నృసింహశాస్త్రిగ్రంథమాలా 1.

శ్రీమద్రామాయణవ్యాఖ్యా



(ఆంధ్రతాత్పర్యసహితము.)



గ్రంథకర్త:

బొమ్మకంటి నృసింహశాస్త్రి.

శ్రీ మ ద్రా మా య ణ వ్యా ఖ్యా



శ్రీమ దాంధ్రదేశీయ గోదావరీమండలాంతర్గత భీమేశ్వరపురీ
వాస్తవ్య శ్రీ చంద్రాభట్ల గౌరీపతిశాస్త్రిణాం చరణకమల
సేవాసమాసాదిత పూర్ణదీక్షాపవిత్రీకృత మానసేన
బొమ్మకంటి పేరుశాస్త్రిశర్మణః సుభద్రాం
బాయాశ్చ గర్భసంభూతేన చతుర్థపుత్రేణ
నృసింహశాస్త్రిణా విరచితా తజ్జ్యేష్ఠ
పుత్ర సుబ్రహ్మణ్యశాస్త్రి
విరచి తాంధ్రతాత్పర్య
సహితా

ప్రథమ సంపుటం.

1940

 [మూల్యం రు 1—4—0

కాకినాడ:

శ్రీపతిముద్రాక్షరశాలాయాం

సంముద్ర్య ప్రకాశితా.

౧౯౪౦

# విజ్ఞప్తి.



పాఠకమహాశయులారా !

పూజ్యులగు మా తండ్రిగారు రచించిన గ్రంథముల నన్నింటిని వారి సమక్షమున నిరంతరము విని యానందాబ్ధియం దోలలాడినభాగ్యము వారి జీవితకాలములో నాకు చేకూరినం దున యమ్మహాసీయుని తేజమును, పాండిత్యప్రకర్షను, లోకమున వెల్లడించుటకు వారి యాశీర్వాదప్రభావప్రేరితుఁడనై యికార్యమునకుఁ గడంగితిని. కాని యసహాయుఁడనగుటచే విద్వదనుభవము నపేక్షించి తత్సాహాయ్యమున నీగ్రంథమును సంస్కృతాంధ్రభాషాభిజ్ఞుల కుపకరించు రీతి నాంధ్రతాత్పర్యము వ్రాసి ప్రకటించి మత్పితరుల స్మారకనిధి కర్పించినాఁడను. గ్రంథకర్తల జీవితచరిత్రము, వంశావళియు స్థలాంతరమునఁ గాననగు.

అముద్రితముగనున్న శేషించిన వైమనకాండలు నీరీతి గనే రెండు సంపుటములుగ ముద్రింపబడును గాన నయ్యవి గ్రంథబాహుళ్యముతో గూడియుండగలవు. ఈగ్రంథ మాంధ్రీకరణ మొనర్చుటలో జనసామాన్యమునకుఁగూడ సులభముగ గ్రాహ్యమగునటుల విషయములన్నియు తేటతెల్లముగనే వ్రాయబడినవి. ఈసందర్భమున నాకు మిక్కిలితోడ్పడిన విద్వాంసులకును, నాకోరికపైన నధికశ్రమకు నోర్చి పీఠికాభాగమును

వ్రాసిన పండితవర్యులగు వ్యాకరణవిద్యాప్రవీణ బ్ర॥ శ్రీ॥ చిలుకూరి పాపయ్యశాస్త్రిగారికిని, అభిప్రాయముల నొసంగిన పండితవరేణ్యులగు శ్రీమత్పరమహంస పరివ్రాజక హరిహరానందతీర్థులవారికిని, తార్కికచక్రవర్తి, శాస్త్రరత్నాకర, బిరుదాంకితులగు బ్ర॥ శ్రీ॥ శ్రీపాద లక్ష్మీనృసింహశాస్త్రి పండితశేఖరులకును, శాస్త్రకోవిదులు బ్ర॥ శ్రీ॥ పేరి పేరయ్యశాస్త్రిల వారికిని, విద్వాంసులు, సాహిత్యవిశారదులు నగు బ్ర॥ శ్రీ॥ కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారికిని నాకృతజ్ఞతాపూర్వకవందనముల నర్పించుచున్నాఁడను. ఈ శ్రీమద్రామాయణవ్యాఖ్యానము దైవభాషలో రచించి గురుప్రసాదలబ్ధమైన యసదృశ విద్యావైభవమును, రామాయణగ్రంథమహిమమును, నూతన ప్రదర్శనముచేసి, దేశమునకు మహోపకారమొనరించిన గ్రంథకర్తల యశస్సును చిరస్థాయినిగఁ జేయుటకుఁ దమ యథాశక్తి ప్రోత్సాహ మొసంగెదరుగాక. అని సవినయముగ

కాకినాడ
25—1—1940

ప్రార్థించు
ప్రకటనకర్త,
బొమ్మకంటి సుబ్రహ్మణ్యశాస్త్రి.

---

# గ్రంథకర్త జీవితచరిత్రము.



గోదావరీమండలమున గౌతమీవసిష్ఠలచే నలంకృతంబై పుణ్యక్షేత్రంబై వెలయుచున్న ర్యాలియను జనపదమునం దీగ్రంథకర్తలు 1856 వ వత్సరమున జననమొందిరి. బొమ్మకంటి వంశమునకుఁ జెందినవారు. హరితసగోత్రులు, పతివ్రతాశిరోమణి సుభద్రాంబ, తపోనిధి పేరుశాస్త్రిగారలు వీరి జననీజనకులు. ఈయుభయుల తపఃఫలము నిగమాగమవేత్తలగు నార్గురు పుత్రులుగఁ బరిణమించినది. వీరిలో జ్యేష్ఠులు వెంకటనృసింహశాస్త్రి ద్వితీయులు రామస్వామవధానులు, కనిష్ఠులు జగన్నాథశాస్త్రిగారలు ముప్వురు వేదశాస్త్రములందుత్తీర్ణులై యుర్లాం మొదలగు సంస్థానములయందు దిగ్విజయమును బొందినవారు. తృతీయు లచ్చన్నశాస్త్రిగారు, తర్క, జ్యోతిశ్శాస్త్రవేత్తలు. సాహితీచక్రవర్తులు. దేవీకటాక్షసంపన్నులు. తురీయులేతద్గ్రంథకర్తలు. వ్యాకరణ, న్యాయ, వేదాంత, మీమాంసాదిశాస్త్రములయందసమానపాండితీధురీణులు. పౌరాణికాగ్రేసరులు. జగదీశ్వరీకరుణాకటాక్షలబ్ధవిద్యాధురంధరులు. శేషించినవారు సీతారామశాస్త్రిగారు న్యాయవేదాంతశాస్త్రములయం దఖండవైశద్యోపేతులు. ఈరీతిగ సోదరులందరు షట్ఛాస్త్రముల నలంకరించి యాంధ్రదేశమం దెల్లెడలను విఖ్యాతకీర్తిని గడించినవారు. కావుననే వీరికి 'బొమ్మకంటిషట్క' మని ప్రసిద్ధికలదు. ఇటులనే యీతీరవాస్తవ్యులైన 'చిలుకూరి' 'అప్పల్ల' వంశములలోఁగూడ 'చిలుకూరి చతుష్టయం' 'అప్పల్లపంచక' మ్మని ప్రసిద్ధ

పండితబృందము లుండెడివి.

ఈగ్రంథకర్తలు బాల్యమునందుపనయనానంతరము సప్తవర్షపూర్తియయినపిదప స్వస్థలము వీడి చిరకాల మనేకప్రదేశములందు గురూపదిష్టముగ విద్యల నభ్యసించినారు. ముఖ్యముగ కోటిఫలిగ్రామవాస్తవ్యులు విజయనగరాస్థాన విద్వాంసులు, "అపరపాణిని" యని కీర్తిగడించి చిత్రప్రభ, వాక్యార్థచంద్రిక, మున్నగు గ్రంథరాజరచయితలు నగు కీ॥ శే॥ శ్రీ భాగవతుల హరిశాస్త్రులవారు వీరి ప్రధానగురువులు. ఈ గురువులయొద్ద నున్నకాలమున నధికశ్రమలకు నోర్చి వారి శుశ్రూషయొనర్చి శాస్త్రాధ్యయన మొనరించినారు. ఈరీతిగ ననేకశ్రమలకులోనై దాదాపు వింశతివత్సరంబులు గడపి విద్యాపారంగతులై స్వస్థలముఁ జేరినతఱి తుల్యానదియొద్దున క్షత్రియబృందముతో నలరారుచున్న రాజుపాలెపు గ్రామవాస్తవ్యులు, సంపన్నగృహస్థులు, నగు పోకుౘూరి వెంకటశాస్త్రిగారి జ్యేష్ఠపుత్రిక, సుగుణవతి రామలక్ష్మి నర్ధాంగినిగ స్వీకరించి వారివంశస్థులనుకూడఁ దరింపఁజేసిరి. పిమ్మట నచ్చన్నశాస్త్రి సోదరులతోఁగలసి భీమేశ్వరపుర వాస్తవ్యులు, పరదేవతయొక్క నూతనావతారమని నిశ్చయింపఁబడిన కీ॥ శే॥ చంద్రాభట్ల గౌరీపతిశాస్త్రులవారి యంతేవాసులై పూర్ణదీక్షాలంకృతులైరి. ఇట్లు తమ యీ యనుజన్ముల యనుకంపావిశేషమునఁ దమకుఁ బూర్ణదీక్ష లభించుటచే వారియెడల వీరి కాదరాభిమానములు మెండుగ నుండెడివి. కావున ననే భక్తితాత్పర్యములతోఁగూడిన యీ సోదరుని చెంతకు వచ్చిగ...

వారు నిర్యాణము నొందినారు. పిమ్మట యీసోదరుని యపూర్వమహిమను, ప్రతిభను తలఁచుకొనుచు వారి సామీప్యమును జేరుటయే తమవాంఛితమని వాకుృచ్చు చుండెడివారు.

ఇటులుండ నుచారులగు జగ్గంపేట సంస్థానాధీశ్వరులచే నాహ్వానింపఁబడి సగౌరవముగఁ బూజింపఁబడుచుఁ దొలుత కాట్రావులపల్లి యను గ్రామమునందుఁ బండ్రెండు సంవత్సరములు గడపిరి. ఇటుల నుండుకాలమున తమ తనయులను పూర్వాణ విద్యాభ్యాసకులుగఁ జేయనెంచి నాయయాస్థానమువారి యనుమతినిఁ బడసి సమీపంబుననున్న పెద్దాపురమను పట్టణంబున నివాస మొనరించిరి. ఇచ్చటనైనను యాయాస్థానపోషకులుగనే యుండెడివారు. కావుననే "యత్కాట్రావులపల్లి విశ్రుత మహాసంస్థాన మర్త్యాశ్రయం। గౌతమ్యానికటేஉస్తి సద్గుణనిధి శ్రీ వెంగయాంబాభృత' మ్మని తారావళి గ్రంథమునందు సంస్థానము నెడల వారికిఁగల కృతజ్ఞతను వెల్లడించినారు. ఇచ్చట నుండుకాలంబున మద్గురువర్యులు శ్రీ మద్దిరాల రామారాయులు ప్రధానాధ్యాపకులుగ నుండుటం జేసి విశ్రుతకీర్తిఁ బడసిన పూర్వాణవిద్యాపాఠశాలయందు సంస్కృతోపాధ్యాయులుగ నియమితులై విఖ్యాతకీర్తిని గడించి నిశ్చింతులై కాలమును గడపిరి. మఱియు నీపట్టణంబున రాజకళాస్థానంబుల నలంకరించుచు వచ్చిన యున్నతోద్యోగు లందరి మన్ననలకుఁ బాత్రులగుచుండెడివారు. ఇందులకు డిప్యూటీకలెక్టరుపదవి నుండి విరమించిన కీ। శే। శ్రీ పాండురంగ శీతారావుగారొసంగిన నీక్రింది యభిప్రాయమే తార్కాణము.

I have known Brahmasri B. Narasimha Sastriar since I joined this district about a year ago and had many opportunities of speaking to him on different subjects. He belongs to a family of which all members are Pandits and himself is a Pandit and a scholor of no ordinary abilities. He is very impressive in his preachings and speaches and instruction and displays a knowledge of various branches. He commands great respect in these parts.

Peddapur, 19—10—1905. (Sd.) P. Sita Row, Deputy Collector, Peddapur.

మఱియు, పంచదశి మున్నగు శాక్తేయగ్రంథముల రహస్యములను వీరి శుశ్రూషఁజేసి నభ్యసించి కృతార్థులైన వారిలో తహశ్శీలుదారు పదవినుండి విరమించిన కీ॥ శే॥ శ్రీ పెద్దాడ శివరావుగారిని జెప్పఁదగును. ఇంకను శిష్యవర్గమునఁజేరి వీరి పురాణామృతమును గ్రోలి ధన్యులైన వారిలో తహశ్శీలుదారుపదవినుండి విరమించిన కీ॥ శే॥ శ్రీ ఆలమూరు రామచంద్రరావుగారు, డిప్యూటీకలెక్టరు పదవినుండి విరమించిన కీ॥ శే॥ శ్రీ కొక్కొండ రాజగోపాలరావుగారు, జిల్లాజడ్జీ పదవినుండి విరమించిన కీ॥ శే॥ దివాన్‌బహదూరు తామ్రపాకం వరదరాజులుగారును యుదాహరణీయులు. కావుననే "యో రామచంద్రా హ్వాయమత్తథత్తే । యాచాప్యధత్తాం భువి తచ్చనామ । గోపాలశబ్దేతి వరదేతిశబ్దౌ చాద్యంతయో రాజపదాంకితేయత్' అని యీకవివర్యులు తారావళియం దీమువ్వురనుఁ జేర్కొనినారు. మఱియు విద్వాంసులు, జిల్లాజడ్జి పదవినుండి

విరమించిన శ్రీ॥ శ్రీ॥ దివాన్‌బహదూరు యం. ఓ. పార్థసారథి అయ్యంగారుగూడ వీరికిఁ జిరపరిచితులనుట శ్రీక్రింగిశ్లోకము వలనఁ గాననగు. "శ్రీపార్థసారథి విభుశ్శ్రితపారిజాతో। దయాసమాసాదిత ధర్మబుద్ధిః। విద్వద్వినోదనసమాహితచిత్త వృత్తి। ర్జేజీయతాం సకలకాలమనూదృగాత్మా॥"

ఇటులఁ బదియారువత్సరంబులు గడచినపిమ్మటఁ దమ సంస్థానాధీశ్వరులు, పండితపోషకులునైన శ్రీ। శ్రీ। దామెర వెంకటసీతారామయ్యబహద్దరు జమీందారువారి యాదరాతిశయమున తిరిగి కాట్రావులపల్లి గ్రామమునం దునికి గలవారలై దాదాపు నాల్గువత్సరంబులు కాలమును గడపిరి. అప్పటికి షష్ఠి పూర్తియయినది. కావునఁ దమపుత్రులసన్నిధి నుండఁగోరి యీ మండలమునకు మండనంబైన కాకినాడపురంబు విచ్చేసినంత నచ్చటి వైశ్యశిఖామణులప్రార్థన నంగీకరించి శ్రీమద్రామాయణభాగవతంబులఁ దనకుఁగల పౌరాణికశక్తినిఁ బ్రదర్శించి శ్రోతల నందరిని తన్మయులుగఁ జేయ, వారలందరు బ్రహ్మరథం బుఁబట్టి యనేకవిధంబుల బహూకరించి శాశ్వతోపకారంబులఁ జేసిరి. ఇటులుండ నిచ్చట వార్థక్యావస్థయందు గర్భశోకములు తటస్థించినవి. కాని ధీరులగుటం జేసి వానిని సరకుగొనలేదు.

వీరు నిత్యము బ్రాహ్మముహూర్తంబున లేచి వైదికకర్మానుష్ఠానానంతరము జగద్గురు శ్రీ శంకరాచార్య ప్రణీతంబైన సౌందర్యలహరిని, ప్రదోషకాలంబున మహిమ్నమును పారాయణం బొనర్చుచుండెడివారు. వీరు మితభాషులు. నిగర్వులు. శాంతస్వభావులు. సాత్వికులు. సత్యసంధులు.

వీరియొద్ద ననేకులు శాస్త్రముల నభ్యసించి కృతార్థులైన శిష్యులు గలరు. వీరిలో నొకశాస్త్రమందు సంపూర్ణులరయ్యును, వీరిసమక్షమున నైషధకావ్యమును సాంప్రదాయసిద్ధముగఁ బఠించుటకై పెక్కండ్రు వచ్చెడివారు. ఈశిష్యవర్గమునం దగ్రగణ్యులు, గురుప్రసాదపాత్రభూతులు నాజ్యేష్ఠ సోదరునివలె మెలఁగి విద్య నభ్యసించి నిరంతర భగవచ్చింతనాసక్తులైన బ్రహ్మశ్రీ దర్భా బైరాగిశాస్త్రులవారిని, 'గురుశుశ్రూషయా విద్యా' యను న్యాయము ననుసరించి విద్య నభ్యసించిన మత్కనిష్ఠసోదరతుల్యులు కడియాల వీరభద్రశాస్త్రిగారిని వేఱొకనక తీరదు.

ఇక్కవిశేఖరులు రచించిన గ్రంథములలో తిలకసహస్రము ప్రథమము. ఇయ్యది శిష్యుల హస్తగతమగుటం జేసి చిరకాలంబుననే యస్తమించినది. రెండవది తారావళి యను గ్రంథము కీ। శే॥ సప్తమఎడ్వర్డుసార్వభౌముని పట్టాభిషేక సమయమున రచింపఁబడినదగుటచే నకాలంబుననే శిథిలమైనది. మూఁడవది మణిమంజరీవిశ్లథ యను మతగ్రంథము, శ్రీ విద్యాపీఠస్థులు జగద్గురువులు నగు శ్రీ శ్రీ శ్రీ భారతీస్వాములవారి యాస్థానపండితులు, వీరి సోదరులు నగు కీ। శే॥ సీతారామశాస్త్రిగారి ప్రోత్సాహమున రచింపఁబడినది. ఇందలి పీఠికాభాగమును ప్రారంభాంశమును గానవచ్చుటలేదు. కాని యీ మూఁడింటిని మా తండ్రిగారివల్ల వినుటయు, నందు పరిశ్రమయుఁ గూడ జేసియుండుటచే నాజ్ఞాపకశక్తికొలది నాయాభాగంబులఁ బూరించి ముద్రింపించఁగలవాడను.

ముద్రితగ్రంథము నాల్గవది. ఇందు తమయావచ్ఛక్తిని వినియోగించి పరదేవతానుహిమమును వెల్లడించిరి.

ఇట్టుల తమ యశశ్చంద్రికల వ్యాపింపఁజేసి యంత డెబ్బదియా అవయేట వ్యాధిగ్రస్తులైరి. అట్టిసమయమున సంస్కృతభాష యందు లేశమైననుఁ బరిచయములేని తమగురువులు దేవిచే నాజ్ఞా పింపబడినవారలై తమ యాయుర్దాయమునుగురించి వచించిన 'వి రించి షష్టి నిర్దిశ్య చత్వారింశ న్మమాజ్ఞయా। ఆయుష్య మారో గ్యయుతం, శీఘ్రమేవ పునః పునః" యను శ్లోకమును జ్ఞప్తియం దునుచుకొన్నవారలై యిందలి తురీయపాదాభిప్రాయ మిప్పటి కిని జగదీశ్వరీకృతంబుగాన గోచరించుటలేదనియు, యకాకారణం బునఁ దమ జీవితం బనిర్దిష్టంబై గదనియు, జగన్మాతయధీనమం దున్నదనియుఁ జెప్పుచు తురీయాశ్రమ స్వీకారంబున కాతురులై నంతలో యవధ్యులై భగవచ్చింతనంబు సేయుచు తమ భౌతిక శరీరము నత్యానందమున వీడి శ్రీయోగదేవిపాదపద్మములను సేవించుచుండిన తమ అచ్చన్నశాస్త్రి సోదరులచెంతకుఁ జేరిరి. పండితశేఖరులయ్యు వీరు బిరుదముల నెన్న డపేక్షింపలేదు. గృహస్థులయ్యు ధనార్జనకు ప్రాకులాడలేదు. సర్వవిషయప్రవర్త కులయ్యు బహిర్ముఖులుగ నుండలేదు. కావున మహనీయుల చరి త్రములు పరమపావనములు. సర్వపాపహారకములు. దుఃఖని వారకములు. ఆనందదాయకములు. మార్గదర్శకములు. నిత్యా నుసంధానయోగ్యములనుట నిస్సంశయము. ఓం తత్సత్.

బొమ్మకంటి సుబ్రహ్మణ్యశాస్త్రి.

# గ్రంథకర్త వంశావళి.



- బొమ్మకంటి వెంకటనృసింహశాస్త్రి
  - సుబ్రహ్మణ్యశాస్త్రి
  - పేరుశాస్త్రి
    - (1) వెంకటనృసింహ శాస్త్రి
      - పురుషసంతతి లేదు
    - (2) రామస్వామి అవధానులు
      - పేరుశాస్త్రి
    - (3) అచ్చన్నశాస్త్రి
      - సూర్యనారాయణమూర్తి
      - వెంకటసుబ్రహ్మణ్యం (దత్తుడు)
    - (4) నృసింహశాస్త్రి
      - సుబ్రహ్మణ్యశాస్త్రి
      - పేరు శాస్త్రి
      - లక్ష్మణ మూర్తి (దత్తుడు)
    - (5) సీతారామ శాస్త్రి
      - పేరు శాస్త్రి
      - లక్ష్మణ మూర్తి
    - (6) జగన్నాథ శాస్త్రి
      - పేరు శాస్త్రి
      - వెంకట నృసింహ శాస్త్రి

# పీ ఠి క.



ఆదికావ్యమనియు, కాళిదాసాదిమహాకవుల కందఱకు మార్గదర్శియనియుఁ బ్రశస్తివడసిన శ్రీమద్రామాయణము "నానృషిః కురుతేకావ్య" మ్మను సూక్తిప్రకారము వాల్మీకి మహర్షి విరచితమై కావ్యత్వసిద్ధి నొందినది. దీనిప్రాశస్త్యము సర్వ భాషలయందును సర్వదేశములందును బెక్కురు పండితులచే వెల్లడింపఁబడిన విషయము సర్వజనవిదితము. కావునఁ దత్ప్రసంగ మటుండనిచ్చి, ప్రకృతమగు కల్పవల్లికవ్యాఖ్యనుగూర్చి కొంచెము ప్రసంగింతము.

చతుర్విధపురుషార్థసాధకమును, కథాచమత్కృతివిశిష్టము నగు నిమ్మహాకావ్యమునకు భరతఖండమందలి పండితులు ప్రాచీనకాలమునుండియుఁ దమకు గోచరించుచువచ్చిన విశేషములతోఁ బెక్కురీతుల నసంఖ్యములగు వ్యాఖ్యానములు రచించుచు వచ్చిరి. ఆంధ్రలిపియందు ముద్రితమై యాంధ్రదేశమునఁ బ్రచారమునందు న్నది వ్యాఖ్యానచతుష్టయము. (1. గోవిందరాజీయము. 2. తనుశ్లోకి. 3 తీర్థీయము. 4. రామానుజీయము) అందుఁ దీర్థీయమున సామాన్యముగాఁ బండితులకు స్ఫురించు నంశములు విడిచిపెట్టి విశేషముగల స్థలములందే యెక్కువ దృష్టియుంచి వివరింపఁబడినది. దీనికంటెను గోవిందరాజీయమున శ్లోకసమన్వయమేగాక విశేషవిమర్శనము లుండుటచే వ్యాఖ్యా

నచతుష్టయమునందు నిదియే పెద్దదిగాఁ గానవచ్చుచున్నది. ఇంకను తీర్థీయమద్వైతపరముగాను గోవిందరాజీయము విశిష్టాద్వైతపరముగాను రామాయణమును వివరించుచున్నవి. తీర్థీయము స్వేతరమతవిమర్శన మేమియు లేక స్వారసికముగ స్ఫురించుతావులనే యద్వైతపరముగ వివరించినది. గోవిందరాజీయ మట్లుగాక విశిష్టాద్వైతమతమున కనుకూలముగా నుండుటకై కొన్నితావులందు శ్రమపడి విశేషార్థములను వివరించినట్లు సామాన్యపండితులకే స్ఫురించునన బెద్దలమాట చెప్పనేల? దానిని జూచియే కాఁబోలు, శ్రీమత్పరదేవతా చరణారవింద మిళిందాయమానమానసులును, "బొమ్మకంటిషట్క" మని ప్రసిద్ధివడసిన పండితసోదరషట్కములోఁ దురీయులును, తర్క-వ్యాకరణపూర్వోత్తర మీమాంసాశాస్త్ర విశారదులును, సంస్కృతకవితాధురంధరులును, తంత్రాగమాదిరహస్యవేత్తలు నగు బ్రహ్మశ్రీ బొమ్మకంటి నృసింహశాస్త్రిగారు సకలవ్యాఖ్యానములను ప్రత్యక్షరమును శోధించి, తమకుఁ దోఁచినవిశేషములను వెల్లడింపవలెనను నుద్దేశముతో 'కల్పవల్లిక' యనుపేర నీవ్యాఖ్యానము రచించుటకుఁగాను తదేకదీక్షతో నష్టాదశపురాణములను భారతాదీతిహాసములను విశకలితముగ శోధించి, తత్సారము నంతయును హృద్గతమొనర్చుకొని, పిమ్మట నీవ్యాఖ్యా[illegible] రచింప నుపక్రమించిరి. రామాయణము సకల[illegible]ంఛితార్థదమగు కల్పవృక్షమనియు, తద్వ్యాఖ్యయగు నీకల్పవల్లికకూడ సకలవాంఛి

తార్థదాత్రి యగుటయేగాక దశదిక్కులందుఁ బ్రాఁకి, కల్పసుమ సౌరభములను వెదచల్లునని యీమహాశయుల తాత్పర్యము.

చతుర్వింశత్యక్షరాత్మకమగు గాయత్రీమహామంత్రము మనసున నుంచుకొని ప్రతిసహస్రమున కొక్కొకయక్షరము సంధించుచు నిరువదినాలుగువేల శ్లోకములుగ వాల్మీకిరామాయణము రచించినాఁ డనుటలో నెవ్వరును విప్రతిపన్నులు కారనుట స్పష్టము. ప్రాచీనులు మొదలు శాస్త్రిలవారి కవ్యవహితపూర్వముగానున్న వ్యాఖ్యాతలునుగూడ గాయత్రీమంత్రాంచితమని యొప్పుకొనుటయేగాని రామాయణమంతయు గాయత్రీస్వరూపమేయని నిర్ణయించినట్లు కనఁబడకపోవుటచే నాకొఱతఁ దీర్పనెంచి, సోపపత్తికముగ సయుక్తికముగ శ్రీశాస్త్రిలవారు రామాయణమునంతయు దేవీపరముగ వ్యాఖ్యాన మొనరించినారు. స్థూలముగఁ జూచినయెడల రాముఁడు శక్తిస్వరూపుఁ డగుట యెట్లని సంశయము గలుగవచ్చునుగాని శాస్త్రిలవారి వ్యాఖ్యానము సవిమర్శముగఁ జూచినచో నట్టిసంశయములు తొలఁగుటయేగాక యన్వయసారళ్యమునకు వశంవదులుగాని పండితశేఖరు లుండరని నానమ్మకము. వారు స్వారసికముగ దేవీపారమ్యమునఁ జేసిన వ్యాఖ్యానవిశేషములు కొన్ని యుదుదాహరింతును. ప్రకృతము శాస్త్రిలవారి పాండితీవిశేషమునుగూర్చి రెండుమాట లిచటఁ బొందుపఱచుట యనావశ్యకము గాదు.

శ్రీ శాస్త్రిలవారు 1856 క్రీ. శ. న సప్తగోదావరీక్షేత్ర మందలి గౌతమీ వసిష్ఠా నదుల నడుమనున్న "ర్యాలి" యను గ్రామమున జన్మించిరి. మహాతపశ్శాలురగు బొమ్మకంటి వేంకటేశ్వర శాస్త్రిగారు పతివ్రతామతల్లియగు సుభద్రాంబగారును వీరి జననీజనకులు. పరదేవతాసాక్షాత్కారము వడసిన బ్ర. శ్రీ. చంద్రాభట్ల గౌరీపతిశాస్త్రిగారు (భీమారామనివాసులు) వీరికిఁ బూర్ణ దీక్ష నొసంగిన గురుపుంగవులు. 'వాక్యార్థచంద్రిక' మున్నగు వ్యాకరణగ్రంథకర్తలగు భాగవతుల హరిశాస్త్రుల వారియొద్దను, ముంగండనివాసులగు పుల్య దక్షిణామూర్తిశాస్త్రుల వారియొద్దను, విజయనగరాస్థాన విద్వాంసులగు కొల్లూరి రామశాస్త్రిలుగారి యొద్దను గొంతవఱకు వ్యాకరణశాస్త్రమును సాహిత్యగ్రంథములను జదివియున్నారు. కాని సర్వవిద్యాస్వరూపముల నెఱుఁగఁజేయు జ్ఞానముఁ బ్రసాదించిన పరమగురువర్యులు గౌరీపతిశాస్త్రిగారేయని శ్రీశాస్త్రిలవారు చెలుపుచుండెడివారఁట. శాస్త్రిలవారి గురుపరంపరను వారి పాండితీవిశేషమునుగూర్చిన విషయమును వారికి ముఖ్యశిష్యులును పుత్రనిర్విశేషులు నగు బ్ర. శ్రీ. దర్భా బైరాగిశాస్త్రిలుగారివలనఁ దెలిసికొనియే యిటుఁ బొందుపఱిచితిని.

వీరు పరాశక్తిగా విక్టోరియామహారాజ్ఞిని స్తుతించుచు సంస్కృతమున 'తారావళి' యనుపేర నొకగ్రంథమును రచించియున్నారు. అందలి శ్లోకడలుగాంచిన శ్రీహర్షుని నైషధీయ చరితమున వీరుచేసిన యపారకృషి వెల్లడికాఁగలదు. మచ్చునకై యొకటిరెండు శ్లోకముల నుదాహరించుచున్నాఁడను.

శ్లో॥ న చ ప్రమత్తా న చ భగ్నవైభవా
నచోద్ధతా కుత్ర చిదల్పకేఽపి
విక్షోభయేతి ప్రథితే యమీశ్వరీ
శ్రీధర్మ రామా సహువం విజిగ్యే॥

శ్లో॥ యదీ యేచ్ఛాశక్తి గ్గగనజలభూమీషు నితరాం
లసద్వార్త్తా తన్త్రీ తనుకలనయాగాతి శతధా,
విపక్షా హ స్యేరన్ యదిమమ సపక్షాస్స్యురధికా
నవో దూరే చేతి ప్రతికల మిమాన్ జన్తునికరాన్॥

రెండవ గ్రంథము తిలకసహస్రము. ఇందుఁ బరదేవతా తిలకమును సంస్కృతమున వేయి శ్లోకములచే నుతింప సమకట్టిరి. శ్లేషయమకచక్రవర్తియగు వేంకటాధ్వరి రచించిన లక్ష్మీసహస్రము నాదర్శముగా నుంచుకొని రచించినట్లు తోఁచును. వేంకటాధ్వరివలె పరదేవతనే వర్ణింపక యామె ధరించిన తిలకమాత్రమునే వర్ణించి సంతుష్టినొందుట వేంకటాధ్వరి గురువుగారగు వేదాంతదేశికులు రచించిన పాదుకాసహస్రమువలె నుండవలెనను నూహయేమో? ఆగ్రంథములోని రెండుశ్లోకముల నీక్రిందఁ బొందుపఱతును.

శ్లో॥ చిన్తయామి తవ చిత్రకం శివే
కున్తలీశిఖ మచిన్త్యవైభవం।
సంతతం సముదపోహితాపి సా
తంతనీతి యదముష్య సన్నిధౌ॥

శ్లో॥ సరసదశనవాసః పావలీలాతిలోల
స్స్వపతివిముఖనేత్రా సజ్జజః కాళిమైవ

వహతి తిలకభఙ్గీం మంజులాం తేఽద్రికన్యే
రసికయువవిమర్దః కిం నపుష్ణాతి లక్ష్మీః॥

పై రెండు గ్రంథములలోని ప్రయోగచమత్కృతియు, కల్పనాపాటవమును బరిశీలించిన నసాధారణములని సహృదయుల హృదయములకు విశదము కాకపోదు.

మూఁడవగ్రంథము మణిమంజరీవిశ్లేషము. ఇయ్యది పై రెండుగ్రంథములవలె కవితాప్రధానముగాక ద్వైతమతస్థు లద్వైతము మీఁదను, శంకరభగవత్పాదుల మీఁదను మత్సరగ్రస్తులై చేసిన నిందలతో నిండియున్న "మణిమంజరి" యనెడు గ్రంథమునకు ఖండనము. దీనిని జూచినయెడల శాస్త్రిలవారి పూర్వోత్తర మీమాంసాపాండిత్య మెట్టిదో ప్రాజ్ఞలోకమునకు స్పష్టము కాఁగలదు. తామద్వైతుల మనెడు నభినివేశ మిసుమంతయు లేక నిష్పాక్షికముగ నందలి యసందర్భముల నన్నిటి నెత్తిచూపి విపులమగు విమర్శ కావించియున్నారు. అందు వారికిఁగల ప్రస్థానత్రయమునందలి స్వాతంత్ర్యమును, శంకరభగవత్పాదుల యందును నద్వైతమునందునుగల భక్తియును శ్రీహర్షకృతమై యనన్యసాధ్యమై విఖ్యాతినవహించిన ఖండనఖండఖాద్యము నందలి పరిచయమును విశదపడును. ఈయంశములు సామాన్యులకు దురవగాహముగానుండుట వాస్తవమే కాని పండితలోకమునకు పరమామోదజనకములనుట నిశ్చయము.

మనదేశమందలి మతగ్రంథములు సామాన్యముగ వేదప్రమాణము పైనను, శాస్త్రసిద్ధాంతములమీఁదను నాధారప

డియుండుటచే నాశైలినే యీగ్రంథమును వేదశాస్త్రసమ్మతముగ శాస్త్రిలవారు రచించి, యద్వైతమతమునకును శ్రీ శంకరులకును నారోపించిన కళంకమును దొలంగించి, తమ పాండిత్యమునేగాక జన్మమునుగూడఁ జరితార్థ మొనర్చుకొనిన ధీరులు. అందలి యొకటి రెండు ఘట్టముల నిటఁ బ్రదర్శించెదను.

"కించ తే శ్రీశంకరభగవత్పాదేష్వేవ పక్షపాతిన, ఉత శ్రీరామానుజాచార్యాదిష్వపి. అభేదవాదితయా ప్రథమేష్వేవేతిచేత్ తేషామప్యంశభేదేనాభేదవాదితయా తాన్ కింజహాసి. అంశాన్తరే స్వమతవర్తితయా అత్యజశ్చేత్, కింసర్వాత్మనా తత్త్యాగః, ఉతావ్యాప్యవృత్తిః, ఆద్యశ్చేత్ శ్రీశంకరభగవత్పాదైరపి కిమపరాద్ధం, యద్యంశభేదేన తదస్తి కిమర్ధజరతీయేన, తస్మాత్త్వైత్యాదిదోషదూషితస్య స్వదేహభ్రమణే జగద్భ్రమణవత్ శ్రుతివిరుద్ధప్రచారస్య తవ సర్వత్రాపి శ్రుతివిరుద్ధగామిత్వధీరితి సకించిదేతత్."

ఈమూఁడు గ్రంథములు సముద్రితములగుటచే లోకమున వెల్లడికాలేదుకాని యైనచో శాస్త్రిలవారినిగూర్చి యింతగా మేము వ్రాయనక్కఱలేకయే వారి కీర్తి లోకమందంతటను సుప్రతిష్ఠితమై యుండెడిది. సరస్వతీపరిపూర్ణకటాక్షపాత్రులగు వీరిగ్రంథములు ప్రకటితములు కాకుండుటకుఁ గల కారణము వేఱుగ వ్రాయనవసరములేదు.

ఈ గ్రంథములేగాక ముద్రణమొగము నెఱుఁగక పుట్టినవి పుట్టినట్లే యున్నచాటువులు పెక్కులుగలవు. అనేక సందర్భములందు శాస్త్రిలవారు వానిని రచించి విద్వత్సభామోదములను బడసినారు.

వహతి తిలకభఙ్గీం మంజులాం తేఽద్రికన్యే
రసికయువవిమర్దః కిం నపుష్ణాతి లక్ష్మీః॥

పై రెండు గ్రంథములలోని ప్రయోగచమత్కృతియు, కల్పనాపాటవమును బరిశీలించిన నసాధారణములని సహృదయుల హృదయములకు విశదము కాకపోదు.

మూడవ గ్రంథము మణిమంజరీవిశ్లథము. ఇయ్యది పై రెండు గ్రంథములవలె కవితాప్రధానముగాక ద్వైతమతస్థు లద్వైతము మీదను, శంకరభగవత్పాదుల మీదను మత్సరగ్రస్తులై చేసిన నిందలతో నిండియున్న "మణిమంజరి" యనెడు గ్రంథమునకు ఖండనము. దీనిని జూచినయెడల శాస్త్రులవారి పూర్వోత్తర మీమాంసాపాండిత్య మెట్టిదో ప్రాజ్ఞలోకమునకు స్పష్టము కాగలదు. తామద్వైతుల మనెడు నభినివేశ మిసుమంతయు లేక నిష్పాక్షికముగ నందలి యసందర్భముల నన్నిటి నెత్తిచూపి విపులమగు విమర్శ కావించియున్నారు. అందు వారికిగల ప్రస్థానత్రయమునందలి స్వాతంత్ర్యమును, శంకరభగవత్పాదులయందును నద్వైతమునందునుగల భక్తియును శ్రీహర్షకృతమై యనన్యసాధ్యమై విఖ్యాతివహించిన ఖండనఖండఖాద్యము నందలి పరిచయమును విశదపడును. ఈయంశములు సామాన్యులకు దురవగాహముగానుండుట వాస్తవమే కాని పండితలోకమునకు పరమామోదజనకములనుట నిశ్చయము.

మనదేశమందలి మతగ్రంథములు సామాన్యముగ వేద ప్రమాణము పైనను, శాస్త్రసిద్ధాంతములమీదను నాధార

డియుండుటచే నాశైలినే యీగ్రంథమును వేదశాస్త్రసమ్మత ముగ శాస్త్రిలవారు రచించి, యద్వైతమతమునకును శ్రీ శంకరులకును నారోపించిన కళంకమును దొలంగించి, తమ పాండిత్యమునేగాక జన్మమునుగూడఁ జరితార్థ మొనర్చుకొనిన ధీరులు. అందలి యొకటి రెండు ఘట్టముల నిటఁ బ్రదర్శించెదను.

"కించ తే శ్రీశంకరభగవత్పాదేష్వేవ పక్షపాతిన:, ఉత శ్రీరామానుజాచార్యాదిష్వపి. అభేదవాదితయా ప్రథమేష్వేవేతిచేత్ తేషామప్యంశభేదేనాభేదవాదితయా తాన్ కింజహాసి. అంశాంతరే స్వమతవర్తితయా అత్యజశ్చేత్, కింసర్వాత్మనా తత్త్యాగః, ఉతాంశ్యవ్యావృత్తిః, ఆద్యశ్చేత్ శ్రీశంకరభగవత్పాదైరపి కిమపరాద్ధం, యద్యంశభేదః తదస్తి కిమర్ధ జరతీయేన, తస్మాత్పౌత్త్యాదిదోషదూషితస్య స్వదేహభ్రమణే జగద్భ్రమణవత్ శ్రుతివిరుద్ధప్రచారస్య తవ సర్వత్రాపి శ్రుతివిరుద్ధగామిత్వధీరితి నకించిదేతత్."

ఈమూఁడు గ్రంథములు సముద్రితములగుటచే లోకమున వెల్లడికాలేదుకాని యైనచో శాస్త్రిలవారినిగూర్చి యింతగా మేము వ్రాయనక్కఱలేకయే వారి కీర్తి లోకమందంతటను సుప్రతిష్ఠితమై యుండెడిది. సరస్వతీపరిపూర్ణకటాక్షపాత్రులగు వీరిగ్రంథములు ప్రకటితములు కాకుండుటకుఁ గల కారణము వేఱుగ వ్రాయనవసరములేదు.

ఈ గ్రంథములేగాక ముద్రణమొగము నెఱుఁగక పుట్టినవి పుట్టినట్లే యున్నచాటువులు పెక్కులుగలవు. అనేక సందర్భములందు శాస్త్రిలవారు వానిని రచించి విద్వత్సభామోదములను బడసినారు.

ఇఁక శాస్త్రిలవారు జీవించియుండఁగనే ముద్రితమై ప్ర చరింపఁబడినది 'కల్పవల్లిక' యొక్కటియే. అదియైనను బాల యోధ్యాకాండములు రెండుమాత్రమే. తక్కిన నాల్గుకాండ ముల వ్యాఖ్యానమును సముద్రితమై పైగ్రంథములతో పాటి యున్నది. శ్రీ శాస్త్రిలవారి జ్యేష్ఠపుత్రులగు సుబ్రహ్మణ్య శాస్త్రిగారిపుడు కల్పవల్లికావ్యాఖ్యకుఁ దెలుఁగుతాత్పర్యము వ్రాసి సిద్ధముచేసి యీగ్రంథమేనియుఁ బూర్ణముగ నచ్చొత్తిం చి యాంధ్రలోకము కృతజ్ఞతఁ బడయుగోరి నాకీ యుపోద్ఘాత ము వ్రాయు మహాభాగ్యము కల్గించినందులకు నే నెంతయుఁ గృ తజ్ఞతఁ జూపుచు, నాబుద్ధికిఁదోఁచిన వ్యాఖ్యానవిశేషముల వివరింతును.

ఈవ్యాఖ్యకుఁ గల్పవల్లిక యను పేరిడుటకుఁగల కా రణము వెనుక చెప్పఁబడియున్నది. ముందు ప్రతిపాదితమైన వి షయము పూర్వవ్యాఖ్యలకంటె విలక్షణమైన దగుటచే శాస్త్రి వారుత్రొక్కిన యపూర్వమార్గస్వరూపము కొంచెము తెలి కొనఁదగియున్నది. శ్రీరాముఁడు విష్ణుస్వరూపుఁడనియు, ధర్మ సంస్థాపనముకొఱకు మానుషరూపమును ధరించెననియు, సీత మహాలక్ష్మీస్వరూపిణియనియు లోకవిదితమై యున్నది. ఇట్లుం డ రాముఁడు త్రిమూర్త్యుపాదానకారణమగు పరాశక్తి స్వరూ పుఁ డనియు, నాగమరీతిచే రాముఁడు ప్రకాశస్వరూపుఁ డని యు, సీత విమర్శస్వరూపిణియనియు నుభయసంబంధముచే సృ ష్టిస్థితిలయము లేర్పడుననియు, నెట్లుచూచినను రాముసకు దే

పారమ్యము తప్పదనియు వీరి యాశయమైన ట్లుపోద్ఘాతము వలనను "తపస్స్వాధ్యాయనిరతం..." అహంవేద్మి మహాత్మానం..." ఇయం సీతామమసుతా..." మున్నగు స్థలములందలి విమర్శవిశేషములవలనను స్పష్టమగుచున్నది.

ఉపోద్ఘాతమందు,

"తస్య శక్త్యాత్మకత్వమేవ గ్రంథతాత్పర్యవిషయమితి తత్ర తత్ర సందర్భానుసారేణ సప్రమాణం నిరూప్యతే. వస్తుతస్తు శ్రీరామస్య శక్త్యాత్మకత్వబోధనపరమేవేదం మహాకావ్యమితి కల్పనమేవ న్యాయ్యం, ప్రతిసహస్రం చతుర్వింశతిమాత్రుభూతగాయత్ర్యక్షరఘటనేనైవాస్య గ్రంథస్య ప్రణయనాత్, అత ఏవాస్య ద్విజమాత్రపఠనీయత్వం శిష్టైరంగీక్రియతే, గాయత్రీమంత్రస్య చ స్త్రీవ్యక్తిపరత్వేనైవాభియుక్తైర్వ్యాఖ్యాతత్వేన, తాద్రూప్యానుసంధానేనైవాస్యాప్యవతారస్య నిఖిలపురుషార్థసాధనత్వమిత్యస్యార్థస్య సామంజస్యేన ప్రతీతేః, సూక్ష్మదృశా విచారేతు నారాయణస్యాపి శక్త్యుపాదానకత్వమేవ"

అని యీమార్గమున కుపష్టంభకముగ దేవీభాగవత చతుర్థాధ్యాయమందలి

"సృష్ట్యర్థ మాత్మనో రూపం మయైవ స్వేచ్ఛయా పితః
కృతం ద్విధా నగశ్రేష్ఠ స్త్రీ పుమా నితిభేదతః॥
శివః ప్రధానః పురుషః శక్తిశ్చ పరమా శివా
శివశక్త్యాత్మకం బ్రహ్మయోగిన స్తత్వదర్శినః॥
వదన్తిమాం మహారాజ తతఏవ పరాత్పరం
సృజామి బ్రహ్మరూపేణ జగదేత చ్చరాచరం॥
సంహారామి మహారుద్ర రూపే ణాంతే నిజేచ్ఛయా
దుర్వృత్తశమనార్థాయ విష్ణుః పరమపూరుషః॥

భూత్వా జగదిదం కృత్స్నం పాలయామి మహామతే
రూపా శక్త్యాత్మకం తాత ప్రధానం తత్ర చ స్మృతం
యత స్తయావినా పుంసః కార్యం నేహ కిమాస్థితం"

అను దేవగీతల నుదాహరించియున్నారు. అట్లగు
విష్ణ్వాదితత్త్వపరత్వము దెలుపు పురాణములు విరోధింపవా
యని శంకించుకొని దానికి సమాధాన మిట్లు తెలిపిరి.

"శక్తిశక్తిమతోః పరస్పరాశ్రయత్వస్య దీపప్రభాదిదృష్టాంతేన సర్వా
శవసిద్ధతయా శక్తిపురుష సామరస్యపర్యవసానేన తయో రన్యతర స్యోత్క
షకర్ష ప్రాప్తి, భీత్యా స్వాభిమతవస్తుసిద్ధిప్రతిపాదనపరత్వమేవ విదుషాం విష్ణ
తత్త్వపరత్వవాదినాం శ్రుతిపురాణాదిషు తు భగవద్విభూతి నానాత్వకల్ప
స్యోపలంభేఽపి నతేషాం పరస్పరవ్యాఘాతః"

(ఉపోద్ఘాతము. పుట. 6-11.)

దీనింబట్టి వీరియాశయమును బ్రతిజ్ఞయు విస్పష్ట మ
చున్నవి.

గాయత్రీమంత్రాదిమాక్షరమగు తకారముతో నార
భింపఁబడిన "తపస్స్వాధ్యాయనిరత" మ్మను శ్లోకవ్యాఖ్యయం
తపస్స్వాధ్యాయనిరత మ్మన శ్రుత్యర్థాప్రవిభక్త శబ్దబ్రహ్మోసక్తు
డనియు, "వాగ్విదాంవర" మ్మన పరాదిభేదములచేఁ జతుర్వి
ములగు వాక్కుల నెఱిఁగిన యోగీశ్వరుఁడనియు సోపపత్తికము
నిర్ధరించి, రామాయణమునకుఁ బ్రకాశవిమర్శస్వరూపైక్యప్ర
పాదనమే ముఖ్యతాత్పర్యమని నిర్ణయించిరి. ఇచ్చటఁ జతుర్వి

వాక్కులనుగూర్చి చేయఁబడిన చర్చ యొంతయు రమ్యమని సహృదయులు గ్రహించి యానందింపఁగలరని దిఙ్మాత్ర మిందుఁ బొందుపఱతును.

"వాచం పరాదిభేదేన చతుర్విధాం వదన్తీతి వాగ్విదః, తేషాంవరం శ్రేష్ఠం, తథాహి- పరా, పశ్యన్తీ, మధ్యమా, వైఖరీతి చతుర్విధా వాక్, వట బీజే వటవృక్షీయ సూక్ష్మరూపవ చ్ఛబ్దసృష్టిసూక్ష్మరూపశాలినీ త్రిపురసున్దరీ పదవాచ్యా పరేత్యుచ్యతే, తస్యా ఏవానాదిసిద్ధప్రాణ్యదృష్టవశా త్స్వాన్తర్లీన ప్రాణిసిసృక్షాయాం తదాలోచనాత్మకం 'తదైక్షత, బహుస్యాం ప్రజాయేయేతి' ఇతిశ్రుతి సిద్ధ మీక్షణం ప్రవృత్తినిమిత్తీకృత్య పశ్యన్తీత్వం, తస్యా ఏవా వికృత శూన్యస్పర్శనాదధ్వనిబిందుశక్తి బీజాక్షరాదిభేదేన వ్యష్టిసమష్టి రూపాయాః పరావన్నాతిసూక్ష్మాయాః వైఖరీవన్నాతిస్థూలాయా స్తదుభయ మధ్యావస్థాపన్నత్వా న్మధ్యమాత్వం, వైఖరీపదవాచ్యమ్। వై-నిశ్చయేన, ఖం-శ్రోత్రేంద్రియం, రాతి-గచ్ఛతి తజ్జన్యజ్ఞాన విషయోభవతీతి తద్వ్యుత్పత్తిః, ఇతోఽధిక విచారస్త్వన్య తోఽవసేయ ఇత్యత్రోపరమ్యతే, తదుక్త మాచార్యైః"

"మూలాధారా త్ప్రథమ ముదితో యశ్చ భావః పరాఖ్యః
పశ్చా త్పశ్యన్త్యథ హృదయగో బుద్ధియు ఙ్మధ్యమాఖ్యః।
వ్యక్తే వైఖర్యథ రురుదిషో రస్య జన్తో స్సుషుమ్నా
బన్ధ స్తస్మా ద్భవతి పవనప్రేరితా వర్ణసంజ్ఞా" ఇతి

ఏవంనిత్యాశస్త్రేఽపి

"మూలాధారా త్సముత్పన్నః పరాఖ్యో నాదసంభవః
స ఏవోర్ధ్వతయా నీతః స్వాధిష్ఠానే విజృంభితః
పశ్యన్త్యాఖ్యా మవాప్నోతి తథైవోర్ధ్వం శ్శనై శ్శనైః
అనాహతే బుద్ధితత్త్వసమేతో మధ్యమాభిధః।

తథా శయోర్ధ్వం సున్నస్సన్ విశుద్ధా కంఠదేశతః వైఖర్యాఖ్యా"

ఇత్యాది. ఇత్థంచ చతుర్విధమాతృకాసు మనుష్యాణాం తురీయవైఖ రూప వాచ ఏవవిజ్ఞానం, యోగీశ్వరాణాంతు సర్వవిధవాక్స్వరూపజ్ఞానస త్తిరితి వాగ్విదాం వర మిత్యుక్తమ్"

(పుట. 6-12.)

ఇది యిట్లుండ శాస్త్రులవారి వ్యాకరణపాండితీధారే తాస్ఫోరకము లింపు లేకపోలేదు. పండితు లాయూతావు జూచి తెలిసికొందురు. "వాల్మీకిర్మునిపుఙ్గవ" మ్మనువాక్యమ దలి వాల్మీకిశబ్దనిష్పత్తినిగూర్చి శాస్త్రులవారుచేసినచర్చ మిక్కి రమణీయము. కాని గ్రంథవిస్తరభీతిచే నుదాహరింప మాని

"తస్య చిన్తయమానస్య" అను శ్లోకవ్యాఖ్యయం గోవిందరాజీయమునఁగల వ్యాకరణ విరుద్ధసిద్ధాంతము నెత్తి స సముగ ఖండించి, తమ యసదృశపాండిత్యశౌండీర్యమును వె డించిరి. అందు శబ్దముల కర్థములనుగూర్చి రవంతయేని స్పృశింపనేలేదు. దీనిం బట్టిచూడ రామాయణమునకు దేవీప ముగ నర్థమును జెప్పుట యొక్కటియే వీరి తాత్పర్యము కాద యు, ఇతరవ్యాఖ్యానములఁగల క్వాచిత్కములగు స్ఖాలిత్యము సవరించి పండితులకును బామరులకును గూడ రామాయ ర్థము యథార్థముగఁ బ్రదర్శించుట వీరి యభీష్టమనియు గో రించును. కావున నయ్యది యిటఁ బొందుపఱుతును.

“‘యస్యచభావేనే’ త్యనేన షష్ఠీతి వ్యాఖ్యానం తదనువృత్తిక ‘షష్ఠీ చానాదరే’ ఇత్యనేనేత్యర్థకం, యథాశ్రుతే తేన సప్తమీమాత్రస్యైవవిధానే నాసామంజస్య ప్రసఙ్గాత్, అనాదరస్తు త్వత్సంకల్పవిషయో నాస్య పరిణయ క్రమః, కింత్వస్మత్సంకల్పవిషయ ఏవేతి స్వీయభావ్యర్థ జ్ఞానశక్తి జ్ఞాపనద్వారా దశరథస్య తదనభిజ్ఞత్వ జ్ఞాపనాత్మక ఏవేతి సమున్నేయం. వస్తుతస్తు భాగార్థకేనాభిశబ్దేన సంబంధః. యదీప్సితం దశరథస్య తత్సంపాదనానుకూల ఇత్యర్థః, స్వీయయుగాది కార్యనిర్వహణస్యాపి తదసంకల్పితస్య మున్యభిప్రేతత్వేన భాగతోక్తిరితి షష్ఠీసమర్థనం సుకరం”

(పుట. 81-82.)

“అహంవేద్మి” అను శ్లోకవ్యాఖ్యయందు శాస్త్రిలవారు తమ క్షోదక్షమమగు తంత్రాగమాదిరహస్యజ్ఞానమును సూక్ష్మముగ గంభీరమగు శైలిని నిట్లు ప్రకటించుచున్నారు.

“వస్తుతస్తు మహాత్మానం రామం అహం వేద్మి, అకార హకారస్వరూపం అహం వేద్మి. “అకారస్సర్వవర్ణాగ్ర్యః ప్రకాశః పరమః శివః, హకారోఽన్త్యః కళారూపో విమర్శాఖ్యః ప్రకీర్తితః” ఇతి సంకేతపద్ధత్యుక్తదిశా శివశక్తిస్వరూపం జానామీత్యేవార్థః, సత్యపరాక్రమం, సత్యా త్రికాలాబాధ్యా యాపరాచిత్క్రమా తత్క్రమం తత్పరిపాటీం తద్రూపమిత్యర్థోఽత్రపక్షే గ్రాహ్య ఇతిరహస్యం, సచప్రకాశవిమర్శ పదార్థప్రతిపత్తి ప్రకారశ్చేత్థం సంగ్రహేణ నిరూప్యతే. వైవర్తనయే, సచ్చిదానన్దలక్షణః పరమాత్మా స్వప్రకాశరూపః కర్తృత్వాద్యభావవాన్ - ఇత్యాదినా కశ్చిత్పదార్థో నిరూపితః. సచ అహంప్రత్యయవిషయ ఇతిచ. తత్రచ కర్తృతాశక్తి రూపా స్వభావాభిన్నా అకామేనా పృథ్వ్యపేయా అస్తీతితు తాంత్రికాః, అనుభవం విశ్వజనీనం చతే స్వరూపయన్, జానాతిస్ఫురతీత్యాదా థాత్వాఖ్యాతరూపదళద్వయేన తథాత్వప్రతీతే రపర్జనీయత్వాత్. సాచశక్తిః, విమర్శః, స్పందః, ఉద్యమః,

కశా, ఇత్యాది శబ్దై రభిధీయమానా ఆత్మస్వభావరూపేత్యాదినా. అత్రబహు వక్తవ్యమపి విస్తర భయా దుపరమ్యతే, ఏవం చైతాదృశే మహిమ్ని శ్రీరామేణ వాన్యథా బుద్ధిః ప్రాకృతేతిభావః"

(పుట. 87-90.)

రామాయణ మూలార్థమునకు విరుద్ధముగ విశిష్టాద్వైతపరముగ నున్న గోవిందరాజకృత మణిమంజీర వ్యాఖ్యయందలి యసంగతములగు కొన్ని విషయములను నిష్పాక్షికముగ ఖండించి యచ్చుటచ్చుట యథార్థమగు నర్థమును శాస్త్రులవారు నిర్ణయించినారు. చూడుడు.

'భవాబ్జపతితం తోయం పవిత్ర మితి పస్పృశుః' అను శ్లోకమునందు "భవాబ్జ పతితమిత్యత్ర పంచమీసమాసః, 'అపేతాపోఢముక్తపతితాపత్రస్తైరల్పశః' ఇత్యనుశాసనాత్, తత్రాల్పత్వం చ ప్రాయికప్రయోగత్వాద్ధకం, శివాపకర్ష బోధనార్థం తు దూరాన్వయపరం మణిమంజీరం తదుపష్టంభనార్థం భాగవతే భారతేచ శ్లోకద్వయం యద్యపి తత్రోదాహృతం, తథాపి నతాన్వర్థ సాధకం, తత్రాద్యం వర్ణోత్కర్ష పరం- ద్వితీయేతు "తదంబుపతితం దృష్ట్వా దధార శిరసాహరః- పాలనార్థం జటామధ్యే యోగ్యోఽస్మీత్యవధారణాత్." ఇతి ప్రసిద్ధపాఠే లకారస్థానే వకారనివేశేన స్వాకవిత్వప్రకటనపరం, అథవా లోకపవిత్రీకరణార్థ మిత్యర్థః, శబ్దస్వభావాత్, తత్రయోగ్యత్వం "ఈశానస్సర్వవిద్యానా". మిత్యాది శ్రుతిసిద్ధ మనన్యదేవతా సాధారణం ప్రభుత్వం, తచ్చ సతి సంకటే తన్నివర్తనేన సుఖాధాయకత్వరూపమేవ, ఇత్యాది భాగవత ఏవోపలబ్ధమ్, జాగ్రతో నిద్రావబోధనప్రాయం గోవిందరాజీయవ్యాఖ్యాన మితి సంతోష్టవ్యమ్ ॥

(పుట. 99-102.)

అనుటచే నిట శివున కపకర్షమును విష్ణున కుత్కర్షము ను జెప్పుటకై మణిమంజీరవ్యాఖ్యయందుఁ జూపఁబడిన స్వమతాభినివేశపూర్వకములును, దుర్బలములు నగు యుక్తులనెత్తి ఖండించుచు భారతప్రయోగమునఁజూపిన ప్రతారణకౌశలమును వెల్లడించినారు.

"దేవై స్త దా సమాగమ్య" (పుట. 120—121)

"జృంభితం తద్ధను ర్దృష్ట్వా" (పుట 122—124)

అను నీఘట్టములందు శివునకు న్యూనతయు, విష్ణున కాధిక్యమును మణిమంజీరవ్యాఖ్య నిరూపించినది. దానిని సహేతుకముగ ఖండించి, శివకేశవులకుఁ దుల్యప్రపత్తి గలుగ శాస్త్రిలవారు తమ నిరుపమానశక్తిసామర్థ్యములను బ్రకటించినారు.

ఈరీతిగనే రామాయణ మామూలచూడముగ సర్వవ్యాఖ్యలతోఁ బరిశోధించి యందందుఁగల విశేషములను బ్రకటించుటయేగాక పాక్షికముగా వ్రాసిన వ్యాఖ్యాంతరములను ఖండించుచుఁ దమ నిరంకుశవైదుష్యమును వేవిధముల వెల్లడించిన శ్రీ శాస్త్రిలవారి మహోద్దేశము యావద్గ్రంథము ముద్రితమైనఁగాని సకలపండితలోకామోదము సంపూర్ణముగఁ బడయఁ జాలదనుచింత యొక్కటిమాత్రము వదలకున్నది. విరివిగాఁ బ్రచారములోనున్నను సమగ్రముగా ముద్రితమైనను దీనినిగూర్చి యింతగా వ్రాయనక్కఱలేదు. శాస్త్రిలవారు జీవించియున్నపుడచ్చొత్తించిన బాలాయోధ్యాకాండలైనను దేశమం దంతట

వ్యాప్తి నొందకపూర్వమే వారు యశశ్శరీరులగుట నే కొలదిమం దికో తక్క తక్కిన పండితవర్గమునకు నిట్టివ్యాఖ్య యున్నదను మాటయేని దెలియదు.

ఆకొఱంత బాపుటకై వారిజ్యేష్ఠపుత్రులగు సుబ్రహ్మ ణ్యశాస్త్రిగారు స్వయముగా నాంధ్రతాత్పర్యమును వ్రాసిప్ర చురింపఁబూనుకొనుట యెంతయు దేశాభ్యుదయ దాయకమని నా యభిప్రాయము. శ్రీ సుబ్రహ్మణ్యశాస్త్రిగారైనను పితృ భక్తిచేతను, కల్పవల్లికవ్యాఖ్యయందుఁగల గౌరవముచేతను దీని ముద్రణమునకు సాహసించిరేకాని ధనాధిక్యముచేఁ బూనుకొ ననేర్చినవారుకారు. ఇట్టిమహోద్యమునకుఁ బండితులు తమ సద భిప్రాయముల నొసంగుటతోపాటు పండితులు భక్తులు నగు ధనికులేగాక, పరమార్థ మాలోచించి కేవల ధనికులుగూడఁ దమతమ శక్త్యనుసారము సాయమొనర్చి యీ మహోద్యమ మును సాంగమొనర్చి యాంధ్రదేశమునకు, అందును గోదావరీ మండలమునకు శాశ్వతప్రతిష్ఠ నెలకొల్పుదురుగాక యని,

| | |
|---|---|
| | ఆశించు |
| కాకినాడ, | బుధవిధేయుఁడు, |
| 21—1—40 | వ్యాకరణవిద్యాప్రవీణ:—చిలుకూరి పాపయ్యశాస్త్రి |
| | మేనేజరు—ఆంధ్రసాహిత్యపరిషత్తు |

---

# పండితాభిప్రాయములు.



౧

ఆస్తికమహాశయాః ?

విదితచరమేవైతత్ ప్రతిసహస్రం గాయత్రీమంత్రాక్షరగ్రథితం చతుర్వింశతి సహస్ర శ్లోకాత్మకం శ్రీమద్రామాయణమాదికావ్యం శ్రీమద్భగవతా వాల్మీకిమహర్షిణా ప్రణీతం వర్వర్తీతి. ప్రసన్నగంభీరశంకరభాష్య ఇవ శ్రీమద్రామాయణార్ణవస్థ గూఢార్థరత్నాన్యపి మహతాం 'యస్యదేవేపరాభక్తి' రితి శ్వేతాశ్వతరశ్రుతి మనురుధ్య పరాపదేవతోపాసనక్షపిత కిల్బిషైర్ధీరైరేవోపలభ్యన్త ఇత్యవివాదం- సుద్ధో గాయత్రీ మన్త్రః నిర్విశేష పరబ్రహ్మపరోఽపి తత్వవిదాం, ఉపాసకానా ముపాసనాయాంతు చిచ్ఛక్తిరూపపరదేవతాత్వేన స్త్రీత్వేనైవ రూపేణ ధ్యాన మభ్యధాయి। యద్యపీతః ప్రాగేవ గోవిందరాజాదికృతా వ్యాఖ్యా లసన్తి శ్రీరామచన్ద్రస్య విష్ణుత్వబోధిన్యః। పాతఞ్జలోత్తర మీమాంసాదిశాస్త్రకృత పుష్కలపరిశ్రమేణ హారితసగోత్రోద్భవేన పరదేవతాప్రసాదవతాఽనేన బ్రహ్మశ్రీ బొమ్మకంటి నృసింహశాస్త్రిణా శ్రీమద్రామాయణగతశ్లోకానాం స్వారస్యం త్రిపురసున్దరీరూప చిచ్ఛక్తిపరతయా వ్యరచి। ఏతదద్వైతభూషాణాం విమత్సరాణాం విదుషాంసర్వేషా

మనుందానందః హృదినూనం జాయత ఇతి విశ్వసిమి. బాల
యోధ్యా కాండద్వయమేవ దృష్టం । ఏతాదృఙ్మహాధీశా
పరాపర దేవతాప్రసాదభాగ్యశ్శ్రకీరోఽపి తత్తనూజః
బొమ్మకంటి సుబ్రహ్మణ్యశాస్త్రీ, తత్పితృవిరచిత కల్పవల్లికా
వ్యాఖ్యాయా, తస్యా ఆన్ధ్రభాషాయాం కృతాన్వర్థగ్రాహ
తాత్పర్యేణ చ సంవలితం ముద్రాపయిష్యతి శ్రీమద్రామా
యణం। అహో మహానుపకారః విద్యదవిద్వదాత్మ కోభ
లోకస్య క్రియతే ఽనేన శ్రీశాస్త్రిణా ఽపిత త్తనూజత్వం చ స
లీక్రియతే। యథావిభవ మేతద్గ్రంథముద్రాపణ విషయే స
చరా భూత్వా, అత్యంత పవిత్ర పరదేవతాపర శ్రీగాయత్ర్యా
గ్రథిత శ్రీమద్రామాయణం ముహుర్ముహుః పఠన శ్రవణాది
సంసేవ్య, శ్రీరామచన్ద్ర చరణానుగ్రహభాజో భవన్తి
త్యాశాసే॥

కాకినాడ,
2—1—1940.

ఇతిశమ్,
నారాయణస్మృతయ
హరిహరానందతీర్థః

౨

బ్రహ్మశ్రీ బొమ్మకంటి నృసింహశాస్త్రిగారు నాకు చిరపరిచితులు. వారు రచియించిన శ్రీమద్రామాయణ కల్పవల్లికా వ్యాఖ్యను స్థాలీపులాకన్యాయముగ జూచినాడను. ఈగ్రంథమునందు శ్రీరాముని శక్తిస్వరూపునిగ ప్రతిపాదించి శాస్త్రులవారు తమపాండిత్యోపాసనావైభవములను పూర్ణముగ వ్యక్తపఱచియున్నారు. కావున నీవ్యాఖ్యానము విద్వాంసుల కమితానందమును గలిగించునని నాకు పూర్ణవిశ్వాసము గలదు. వారిజ్యేష్ఠకుమారులగు సుబ్రహ్మణ్యశాస్త్రిగారీగ్రంథమును ప్రకటించి శాస్త్రులవారి కీర్తిని చిరస్థాయిగా జేసినారు. కల్పవల్లికపై వీరు వ్రాసిన ఆంధ్రతాత్పర్యముగూడ హృద్యముగను సమంజసముగను నున్నది. కావున నీగ్రంథము సర్వజనోపరంజకముగ నుండుననుటకు సందియములేదు. ఈగ్రంథమును రచియించి ఆచంద్రార్కస్థాయియైన కీర్తిని గడించిన శ్రీశాస్త్రులవారిని చిరస్మరణీయులనుగ జేయు భారము పాఠకలోకమునకు గలదని గ్రహింతురుగాక.

ఇట్లు,

పిఠాపురం, 6-1-1940.

తార్కికచక్రవర్తి, శాస్త్రరత్నాకర,
శ్రీపాద లక్ష్మీనృసింహశాస్త్రి.

3

బ్రహ్మశ్రీ బొమ్మకంటి నృసింహశాస్త్రిగారు మహాపం
తులు, నిరుపమాన సాహితీయుతులు. వ్యాకరణవేదాన్తములు
వీరికసమాన ప్రజ్ఞ కలదు. వీరు వ్రాసిన రామాయణవ్యాఖ్య
వీరి పాండిత్యమును సాటించుచున్నది. శ్రీరాముని యవతారమ
వైష్ణవమని శ్రీమద్రామాయణాదుల వలన దెలియ వ
చున్నది. శైవావతారమని ధర్మఖండోత్తరభాగము వ
గాన్పించుచున్నది. శ్రీవాల్మీకి మహర్షి యిరువదినాలుగు గాయ
వర్ణములను సంపుటీకరించి రామాయణమును వ్రాయు
వలన శ్రీరాముని శక్త్యవతారమని బ్రహ్మశ్రీ నృసింహ
స్త్రుర్లు గారు సప్రమాణముగ వ్రాసియున్నారు. అనేకముల
దేవీపురాణములలో శ్రీరాముడు లలితావతారమనియు కొన్ని
టిలో శ్యామావతారమనియు వర్ణించియున్నారు. శ్రీశాస్త్రు
గారు వాని నన్నింటిని పరిశీలించి శ్రీరాముడు దేవ్యవతారమ
యదివరకెన్నడును మెరుగని విషయమును లోకమునకు దెలి
ప్రాచీన వ్యాఖ్యాన లోపములను గూడ చూపించిరి. కల్ప
యని దీనికి బెట్టిన పేరు సార్థకమైనది. ప్రాచీనవ్యాఖ్యలలోనున
నర్థములకంటె నూతనార్థము లనేకములు దీనిలో గలవు.
శాస్త్రుర్లుగారు చాల శ్రమపడి యీవ్యాఖ్యానమును జేయుట
నావందనములను వారికి సమర్పించుచున్నాను. శ్రీశాస్త్రుర్లుగ

కల్పవల్లిక న్యూనాధికభావము లేకుండ యందరకు బాగుగ దెలియునటుల దెనిగించిన వారిజ్యేష్ఠపుత్రులు గూడ వందనీయు లగుచున్నారు. వీరువ్రాసిన తెలుగు సంస్కృతప్రవేశము లేని వారందరకు మిక్కిలి యుపయోగముగ నుండును. కాన సంస్కృతము జనఃవని వారి కాచింత లేకుండ ఈ బొమ్మకంటి సుబ్రహ్మణ్యశాస్త్రుర్లుగారు తొలగించి లోకమునకు మహోపకారము జేసినారని నాకు గొప్ప నమ్మకము.

కాకినాడ
10-1-1940

పేరి పేరయ్యశాస్త్రి.

ర

## వినయోక్తి.

కీ॥ శే॥ విద్వద్వరేణ్యులగు బ్రహ్మశ్రీ బొమ్మకం నృసింహశాస్త్రి మహోదయులచే విరచింపఁబడిన శ్రీమద్రామా యణము యొక్క 'కల్పవల్లిక' యను వ్యాఖ్యానములోఁ బ్ర తము బాలకాండము వారిజ్యేష్ఠకుమారులగు సుబ్రహ్మ శాస్త్రిగారచ్చొత్తింపించి గౌరవాదరములతో నాకొసంగి నేనాకల్పవల్లిక నామూలాగ్రముగఁ బఠించి యమితానంద నందితిని. ఈవ్యాఖ్యాన రాజమున మనోహరములగు నశ్రుత పూర్వవిషయము లెన్నియో వెల్లడింపఁబడి యున్నవి. మఱియు శ్రీమద్రామాయణము పరశక్తిప్రతిపాదకమగు గ్రంథమని స్థి కరించుటకు శ్రీ నృసింహశాస్త్రిగారు చేసిన సిద్ధాంతము త్రికాలాబాధితములై వెలయుననుట యెంతమాత్రము స శయోక్తి కానేరదు.

ఈపండితరాట్టులు రామాయణ మణిఖనిని నిగూ ములై యున్న యమూల్యభావరత్నముల వెదకిఁదీసి, వాని దగు తళుకు నొడఁగూర్చుటయే గాక, ప్రకరణానుకూలము సర్వశాస్త్రవిజ్ఞానములను, సకలకలావైభవములను, గరతల మలకములగునట్లు ప్రత్యక్షము చేసియున్నారు. ఈకల్పవల్లిక జదివినవారికి మన యార్య విజ్ఞానగరిమ యెంత విరివిగా యున్న

దియో విదితము కాఁగలదు. ఈకల్పవల్లిక సంస్కృతభాషలో వ్రాయఁబడి యుండుటచే సంస్కృతానభిజ్ఞులకు నందలి ఘన విషయములు సుబోధమగునట్టుల సుబ్రహ్మణ్యశాస్త్రిగారిచే నావ్యాఖ్యకు సరియగు నాంధ్రానువాదము చేర్పఁబడినది.

ఇతర కాండములు గూడ నీరీతిగ ముద్రింపఁబడినచో మన వాఙ్మయమున కొక నూతన విజ్ఞానవికాసము చేకూరఁగలదు.

ఇలాతలముపై పితరుల కీర్తిపతాకల నెలయించి, వారల పేరులు చిరస్మరణీయము లగునట్లు పాటుపడువారే నిజమగు తనయులు.

శ్రీ సుబ్రహ్మణ్యశాస్త్రిగారు బహుప్రయాసలకు లోనై వారి పితృపాదులచే విరచితములైన గ్రంథరాజముల నచ్చొత్తించి లోకమున వ్యాపింపఁజేయఁ బాటుపడుచున్నారు. వీరి ప్రయత్నమునకు దయామయుఁడగు శ్రీహరి సాహాయ్యకారి యగుఁగావుత.

ఓం తత్సత్,

కాకినాడ,
14—1—1940.

బుధజనవిధేయుఁడు, సాహిత్యవిశారద,
కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రి.

౫

Letter addressed to the late author by a late Ex-judge of the High court of judicature, Madras.

Sir,

My inadequate equipment in telugu has stoo much in the way of enjoying the commentary o Valmiki. My love for the old poet took me a grea way & I found that your intrepretation of th text, so far as I was able to follw it, was in th right spirit. Valmiki should be well intrepreta in India. It is an inexhaustible treasure hous You deserve the thanks of the Andhra popoulatio for the excellent commentary you are writing o this masterpiece. I wish you every succeess.

Govardhan,
Kilpauk,
Madras,
18-8-1924.

Yours truly,
T. V. Seshagiri Iyer

# శ్రీమద్రామాయణస్య బాలకాండే వ్యాఖ్యాత

## శ్లోకానుక్రమణికా.

| క్రమ సంఖ్యా | సర్గః | శ్లోక సంఖ్యా | శ్లోకవివరణం. | పు[illegible] |
|---|---|---|---|---|
| 28 | 18 | 33 | తేయథా జ్ఞానసంపన్నాః | 8[illegible] |
| 29 | ,, | 37 | తస్యచింతయమానస్య | 8[illegible] |
| 30 | ,, | 49 | యథాస్పృతస్య సంప్రాప్తిః | 8[illegible] |
| 31 | ,, | 50 | ప్రణష్టస్య యథాలాభో | [illegible] |
| 32 | ,, | 51 | కించతే పరమం కామం | 8[illegible] |
| 33 | 19 | 2 | సదృశం రాజశార్దూల | [illegible] |
| 34 | ,, | 14 | అహంవేద్మి మహాత్మానం | 8[illegible] |
| 35 | ,, | 15 | యదితే ధర్మలాభంచ | 9[illegible] |
| 36 | ,, | 16 | యదిహ్యనుజ్ఞాం కాకుత్స్థ | 9[illegible] |
| 37 | ,, | 17 | అభిప్రేతమసంసక్తం | 9[illegible] |
| 38 | 23 | 2 | కౌసల్యా సుప్రజా రామ | 9[illegible] |
| 39 | 48 | 27 | తచ్ఛంకర శిరోభ్రష్టం | 9[illegible] |
| 40 | ,, | 28 | తత్రదేవర్షి గంధర్వాః | 9[illegible] |
| 41 | ,, | 29 | శాపాత్ప్రతితాయేచ | [illegible] |
| 42 | ,, | 30 | ధూతపాపాఃపునస్తేన | [illegible] |
| 43 | 67 | 12 | విశ్వామిత్రస్తు ధర్మాత్మా | 10[illegible] |
| 44 | ,, | 21 | భగవన్ దృష్టవీర్యోమే | 10[illegible] |
| 45 | ,, | 22 | జనకానాం కులేకీర్తిం | 10[illegible] |
| 46 | ,, | 23 | మమసత్యా ప్రతిజ్ఞాచ | [illegible] |
| 47 | 73 | 27 | ఇయం సీతా మమసుతా | 11[illegible] |
| 48 | 75 | 18 | దైవైస్తదా సమాగమ్య | 12[illegible] |
| 49 | ,, | 19 | జృంభితం తద్ధనుర్దృష్ట్వా | 12[illegible] |
| 50 } | | | కౌసల్యాయై నరపతిః } | |
| 51 } | | | కైకేయ్యై చావశిష్టార్ధం } | 12[illegible] |
| 52 } | | | అనుచింత్య సుమిత్రాయై } | |

శ్రీమత్పరమగురుభ్యోనమః।



శ్లో॥ మహాతే మహసే భూయాన్నమసాం మమ సంతతిః
యత్ర సంప్రీయతేఽజ్ఞోపి స్త్రీపుంభావ వికల్పనాత్॥

(టిప్పణీ) అత్ర స్త్రీపుంభావపదే- అచతురేత్యానేన- అజంతత్వం చాశంకనీయం- స్త్రీసహితః పుమానితి మధ్యమపద లోపేన నిర్వాహాత్ - స్త్రియాంపుంభావ ఇతి వ్యాఖ్యాతృవివక్షితస్యార్థవిశేషస్య ప్రతీతే రావశ్యకత్వాచ్చ॥

తాత్పర్యము॥ ఏమహాతేజస్సును అజ్ఞాని జ్ఞానియునుగూడ స్త్రీరూపముగనో పురుషరూపముగనో ఉభయరూపముగనో భావనచేసి అమితానందమునొందుచున్నాడో సర్వోత్కృష్టమగు నామహాతేజస్సునకు నా నమస్కారపరంపర యగుగాక.

శ్లో॥ యో సా వచింత్యమహిమా భువి రామచంద్రః
ప్రాదుర్బభూవ రఘువంశపయోంబురాశేః
తం విష్ణు మాహు రపరే శివ మాహురేకే
శక్తించ కేచన పురాణభిదావిదగ్ధాః॥

తా॥ రఘువంశమనెడి క్షీరసముద్రమునుండి బయలు వెడలినట్టియు ఊహింపశక్యముగాని మహిమగల శ్రీరాము డనెడి చంద్రుని విష్ణుస్వరూపుడని కొందఱు శివుడని కొందఱును

భావించుచున్నారు. పురాణములందలిరహస్యములను బా
నెఱిగిన మఱికొందఱు శక్తిస్వరూపుడనియే భావించుచున్నా

శ్లో॥ తత్తన్మతానుగుణవాక్యపదార్థగాథా
సందర్భసంఘటితమేవ మహర్షిరేతత్
కావ్యంతు రామచరితం ప్రణినాయ సమ్య
గ్వాల్మీకిరాత్మభవదత్త సమస్తబోధః।

తా॥ బ్రహ్మచే నొసగబడిన నిఖిలజ్ఞానముకల వా
మహర్షి తాను రచించిన శ్రీమద్రామాయణమును నానా
మును వారివారిమతముల కనువగు వాక్యములు పదార్థము
గాథలు మున్నగువానితో బాగుగ సమకూర్చియున్నాడు.
యిందు శ్రీరాముని చరిత్రమే వర్ణింపబడినది.

శ్లో॥ యే వైష్ణవాః కతిచనాత్మమతానుకూలం
రామాయణం స్వమతికల్పనయా వ్యవృణ్వన్
తత్రాహమస్మి నతరాం ప్రతికూలబుద్ధిః
కింత్వన్యథాపి వివృతిం పరికల్పయామి॥

తా॥ వైష్ణవులు కొంద ఱీరామాయణమునందలి శ్లో
లకు తమమతమున కనుకూలముగ తమబుద్ధికల్పనలచే వ్యా
నము చేసియేయున్నారు. అట్టివ్యాఖ్యానములవిషయమై
ప్రతికూలాభిప్రాయముగలవాడను గాను. కాని వానికే వే
విధముగగూడ వ్యాఖ్యానము జేయుచున్నాడను.

శ్లో॥ అతిగహనో వాగ్గుంభో
మునినా రచితో౽యమాదికావ్యాఖ్యః

తత్రైదంపర్యం విదుషాం
న భవతి దోషాయ కింతు కీర్తయే నితరాం॥

తా॥ వాల్మీకిమహర్షి చే నీయాదికావ్యమున గూర్పబడిన వాగ్జాలమునకు ఇదియేసారమని నిరూపించుట యెట్టివారికిని శక్యముగాదు. కాని పురాణము నెఱింగినవిద్వాంసులు ఇందలి శ్లోకము లిట్టియర్థమును సమర్థించుచున్నవని తెలుపబూనుట దోషావహముకానేరదు. విచారింపగా నయ్యది వారికి కీర్తి దాయకమే యగును.

శ్లో॥ విపశ్చి త్ప్రాయేణ స్వమతిపరిణామావధి గృణన్
ప్రబంధం యం కంచిద్భవతి నుతినిందాసమమతిః
అతో యత్నోఽయం మే నభవతి వృథా కింతుసదస
ద్వివేకజ్ఞాన్యాచే వివృతిపరిపాట్యాం బుధగణాన్॥

తా॥ విద్వాంసుడగునాతడు తనబుద్ధిప్రసరించినరీతిని గ్రంథమును రచించునపుడు జనులు తన్నునుతించినను నిందించినను ఖేదమోదములనొందడు. కావున నాయత్నము విఫలము కానేరదు. కాని గుణదోషములను బాగుగ గుర్తించుపండిత వర్యులు ఈవివరణరీతిని సమాహితమనస్కులై చర్చించెదరు గాక యని ప్రార్థించుచున్నాను.

శ్లో॥ బ్రహ్మదృగ్వంశే జనుషా నృసింహాఖ్యేన శాస్త్రిణా
రామాయణస్య వ్యాఖ్యేయం క్రియతే కల్పవల్లికా॥

తా॥ బొమ్మకంటివంశమున జనించిన నృసింహశాస్త్రిచే శ్రీమద్రామాయణమునకు 'కల్పవల్లిక' యను నీవ్యాఖ్య రచింపబడుచున్నది.

శ్లో॥ ద్విజత్వమారభ్య తపస్యమైవ
యోఽయాపయ జ్జీవిత మీశ్వరార్థం
కృపాలవ స్తస్య సముద్యమోఽస్తు
గౌరీపతేః పూర్ణ గురో ర్మమాయం॥

తా॥ ఉపనయనసంస్కారముచే ద్విజత్వము సిద్ధించి
మొదలుగ ఈశ్వరునికొఱకు తపస్సుచేయుచునే జీవితము
గడపినట్టియు, పరిపూర్ణ గురుపదమునలంకరించినట్టి గౌరీపతిశా
గారి కరుణాకటాక్షలవమే యీనాయుద్యమమని పాఠకు లె
గుదురుగాక.

శ్లో॥ గ్రంథగౌరవభయా దహ మస్యాం
వ్యాకృతౌ నహి వదామి పురోక్తాన్
అర్థభావరసశాస్త్రవిశేషా
న్భోబుధాః కలయతేతి వచో మే॥

తా॥ గ్రంథవిస్తరభీతిచే నావ్యాఖ్యయందు అర్థవి
ములు భావములు రసములు మున్నగునవి నిరూపింపబడుటలే
వానిని కొందఱుపెద్దలు తెలిపియేయున్నారు గాన పండితు
వానిని ఇతరవ్యాఖ్యానములవలననే తెలిసికొనియెదరుగాక.

శ్లో॥ ఆలవాలనిలయా యదివల్లీ
మల్లికాది రల ముల్లసతీతి
మామికాపి మునివాక్యసుఖేలా
వ్యాకృతి ర్విజయతాం దశదిక్షు॥

తా॥ మల్లి మొదలగులతలు ఆలవాలము (కుదురు)

గూడినచో బాగుగ వికసించును. నేను రచించిన మునివాక్య ములవిహరించు (ప్రాకు) నీ కల్పవల్లికావ్యాఖ్యానమను లత దిక్కు లన్నింటియందు జయమునొందుచు వికసించుగాక.

శ్లో॥ స్ఖలితాని పదేపదేఽపి భ్రాంతు
ప్రతిభాశాలిహృదాం మమ ప్రబంధే
తదపి స్వవచస్స్వివాదరక్తా
లలితాన్యేవ భవంతి తాని తేషాం॥

తా॥ ప్రతిభాశాలుర హృదయమునకు నాయీవ్యాఖ్యానమందు మాటిమాటికి స్ఖాలిత్యములు (పొరపాటులు) స్ఫురించెడిని. కాని వారి కాదరాతిశయమున్నచో తమవాక్యములవలె హృద్యములే యగునని నమ్ముచున్నాను.

---

# ఉపోద్ఘాతః



యద్యపీదం శ్రీరామాయణాఖ్యమాదికావ్యం ప్రాచ
శ్రీరామస్య నారాయణాంశత్వప్రతిపాదనద్వారా తదీయపు
ప్రతిపాదనపరమితి ప్రతిభాతి । తథాపి తస్య శక్త్యాత్మకత్వక
గ్రంథతాత్పర్యవిషయమితి తత్ర తత్ర సందర్భానుసారేణ స
మాణంనిరూప్యతే । వస్తుతస్తు శ్రీరామస్య శక్త్యాత్మకత్వబో
పరమేవేదం మహాకావ్యమితి కల్పనమేవ న్యాయ్యం । ప్రతిస
స్రం చతుర్వేదీమాతృభూతగాయత్ర్యక్షరఘటనేనైవాస్య ప్ర
ధస్య ప్రణయనాత్ । అతఏవాస్య ద్విజమాత్రపఠనీయ
శిష్టైరంగీక్రియతే । గాయత్రీమంత్రస్యచ స్త్రీవ్యక్తిపరత్వేనై
భియుక్తైర్వ్యాఖ్యాతత్వేన తాద్రూప్యానుసంధానేనైవాస్యా
వతారస్య నిఖిలపురుషార్థసాధనత్వమిత్యస్యార్థస్య సామంజస్య
ప్రతీతేః । సూక్ష్మదృశా విచారేతు నారాయణస్యాపి శక్తి
పాదానకత్వమేవ । తథా బహుప్రమాణోపలబ్ధేః । నహి
షాంవ్యక్తిభేదమాత్రేణ తేజోభేదఇతీతరగ్రంథదూషణపూ
స్వదేవతాసామ్రాజ్యాభినివేశఉచితః । వాసనావిశేషాత్తు
తథా భ్రామ్యంతీతితు చిత్రమత్రావిప్రతిపద్యతే । "అహం వే
మహాత్మానం రామం సత్యపరాక్రమం । వశిష్ఠోఽపి మహాతే
యేచేమే తపసిస్థితాః" ఇతి శ్రీరామచంద్రధర్మికమాహా
జ్ఞానస్య తపోమాత్రాయత్తతాయాః సరతమభావేన వి

మిత్రేణ ప్రతిపాదనేన విద్వదనుభవస్య స్వవాసనాధీనతయా తత్తద్వ్యాఖ్యానస్య తథా తథా నేయత్వాత్। తదర్థావిష్కరణంతు తద్వ్యాఖ్యానావసరే భవిష్యతి। అతఏవ దేవీమహాభాగవతే చతుర్థాధ్యాయే హిమాలయంప్రతి దేవీప్రోక్తగీతాసు॥ "సృష్ట్యర్థమాత్మనో రూపం మయైవ స్వేచ్ఛయాపితః। కృతం ద్విధానగశ్రేష్ఠ స్త్రీపుమానితిభేదతః॥ శివః ప్రధానః పురుషః శక్తిశ్చ పరమాశివా। శివశక్త్యాత్మకం బ్రహ్మ యోగినస్తత్వదర్శినః। వదంతి మాం మహారాజ తత ఏవ పరాత్పరం॥ సృజామి బ్రహ్మరూపేణ జగదేతచ్చరాచరం। సంహరామి మహారుద్రరూపేణాంతే నిజేచ్ఛయా। దుర్వృత్తశమనార్థాయ విష్ణుః పరమపూరుషః। భూత్వా జగదిదం కృత్స్నం పాలయామి మహామతే। రూపం శక్త్యాత్మకం తాత ప్రధానంతత్ర చ స్మృతం। యతస్తయా వినాపుంసః కార్యం నేహ కిమాస్థితం"॥ ఇతి॥ అస్మిన్నేవపురాణే కృష్ణస్య కాళికావతారత్వస్య స్పష్టతయాభిధానేన రామావతారస్యాపి తథాత్వేనైవ చమత్కారాత్। శక్తిశక్తిమతోః పరస్పరాశ్రయత్వస్య దీపప్రభాదిదృష్టాంతేన సర్వానుభవసిద్ధతయా శక్తిపురుషసామరస్యపర్యవసానేన తయోరన్యతరస్యోత్కర్షాపకర్షప్రాప్తిభీత్యా స్వాభిమతవస్తుసిద్ధిప్రతిపాదనపరత్వమేవ విదుషాం విష్ణ్వాదితత్వపరత్వవాదినాం శ్రుతిపురాణాదిషుతు భగవద్విభూతి నానాత్వకల్పనస్యోపలంభేపి న తేషాం పరస్పరవ్యాఘాతః। స్వార్థసాధనపర్యవసానపరత్వాత్। అతఏవ "యే యథా మాంప్రపద్యంతే తాంస్త

త్రైవ భజామ్యహం॥'' ఇత్యాత్మనో భక్తానుగుణరూపాదిమ
భగవతా ప్రతిపాదితం। నతు వస్తుత ఇయత్త్వా। ఏవ
రామావతారస్య భాగవతత్వాంశే నిర్వివాదత్వేపి రామా
గ్రంథస్వారస్యేన శక్తిభాగిత్వకల్పనమేవ సుఘటమితి తా
రమ్యేనైవ గ్రంథోఽయం మయా వ్యాఖ్యాయతే। ఇతి స
దయాః కలయంతు।

తాత్పర్యము। శ్రీమద్రామాయణమును నీయాదికావ్య
శ్రీరాముడు శ్రీమన్నారాయణుని యంశావతారమని ప్ర
దించుచు, ఆతనిపరతత్త్వనిరూపణము ప్రధానవిషయముగ
కొనినట్లగపడును. కాని యీగ్రంథమునకు 'శ్రీరాముడు
స్వరూపుడే' యని బోధించుటయందు ముఖ్యతాత్పర్యమున్న
సందర్భానుసారముగ నచ్చటచ్చటప్రమాణములచే నింకు ని
పింపబడును. బాగుగ నాలోచింపగా శ్రీరాముడు శక్తిస్వరూ
డని బోధించుటకొఱకే యీమహాకావ్యము బయలువెడలిన
కల్పనయే న్యాయ్యము. ఏలనన, ఇరువదినాల్గక్షరములతోగూ
నట్టియు, చతుర్వేదమాతయునగు గాయత్రీమంత్రము ఈకా
మందు ప్రతివేయిశ్లోకములకొక్కొకయక్షరముచొప్పున,
వదినాలుగువేలశ్లోకములయందు గూర్పబడినది. కను
శిష్టులు, ఉపనయనసంస్కారమునొంది గాయత్రీమంత్రమ
నుచ్చరించుటకధికారులే రామాయణమును పఠించుటకధికా
లగుదురని యంగీకరించియున్నారు. గాయత్రీమంత్రమునకు శ్రీ
వ్యక్తిపరముగ పెద్దలు వ్యాఖ్యానముచేయుటవలనను, ఈమ

మందలి యర్థముకంటె నీగ్రంథమందలి యవతారస్వరూపము వేఱుకాకుండుటవలనను, అట్లుభావనచేసినప్పుడే నిఖిలపురుషార్థములుసిద్ధించుటవలనను, 'శ్రీరాముడు శక్తిస్వరూపుడే' అనునీవిషయము సమంజసముగఁదోచెడిని.

సూక్ష్మదృష్టితో నాలోచించిన నారాయణుడుగూడ శక్తియేఉపాదానకారణముగాగలవాడని తోచును. ఈవిషయమును సమర్థించు ప్రమాణములనేకములు గలవు. స్త్రీపురుషవ్యక్తిభేదముచే తేజస్సునకుగూడ భేదమునంగీకరించి, ఇతరగ్రంథములనుదూషించుచు, తామంగీకరించినదేవతకు సామ్రాజ్యమునిచ్చుటకై పట్టుదల బూనుట సదసద్జ్ఞానముగల విద్వాంసులకు తగదు. కాని పెద్దలుగూడ అనాదివాసనావశమున భ్రమనొందుచుండుట చిత్రమని యిచ్చట తెలుపబడుచున్నది. "అహంవేద్మి ... ..." ఇత్యాదిశ్లోకమున, శ్రీరామచంద్రుని మాహాత్మ్యమును దెలిసికొనుట తపస్సుచేతనేసాధ్యమగుననియు, దానిని దెలిసికొనుటలోగూడ హెచ్చుతగ్గులుగలవనియు చెప్పిన నారదవాక్యములచే మునులుగూడ వాసనావిశేషవశమున భిన్నానుభవముగలవారని తెలియుచునే యున్నది. కావుననే వారి వారి జ్ఞానమునునసరించి పరత్వము ప్రతిపాదింపబడుచున్నది.

పై శ్లోకమునకిట్టి యభిప్రాయముగలదనువిషయము ఆశ్లోకమునకు వ్యాఖ్యానముచేయుసమయమున బాగుగ దెలుపబడగలదు.

శ్రీరాముడు శక్తిస్వరూపుడనువిషయము స్త్రీ
ప్రమాణములచే స్థిరీకరింపవచ్చును. దేవీభాగవతము నా
అధ్యాయమున హిమవంతునిగూర్చి దేవిచే జెప్పబడిన
యందు "ఓతండ్రీ! జగత్సృష్టికొఱకు నాయిచ్ఛచేతనే నా
పము స్త్రీపురుషభేదముచే రెండువిధములుగ జేయబ
ఇందు పురుషరూపము ప్రధానపురుషుఁడగు శివుడు. స్త్రీ
పము పరాశక్తిస్వరూపిణియగు గౌరి. పరబ్రహ్మస్వరూ
శివశక్త్యుభయస్వరూపమని తత్వజ్ఞానముగల యోగులు
చున్నారు. కనుకనే మహారాజ! నన్ను పరాత్పరస్వరూ
పేర్కొందురు. నేనే బ్రహ్మస్వరూపిణినై చరాచరమగు
చమును సృజింతును. మహారుద్రస్వరూపిణినై జగత్తును స
రింతును. నేనే విష్ణుస్వరూపిణినై దుష్టులను నిగ్రహించి
త్తును పరిపాలింతును. కావున వీనిలో శక్తిస్వరూపమే ప్ర
నము. ఆస్వరూపమును విడిచి పురుషునకేకార్యము స్థి
నేరదు". అని కలదు.

ఈపురాణమునందే మఱియొకస్థలమున కృష్ణుడు శ
తారమని స్పష్టముగజెప్పబడియుండుటచే శ్రీరాముడుగ
నట్టివాడేయని చెప్పినచే చమత్కారముగనుండును. దీపప్ర
రెండును ఒకదానినొకటి యెట్లపేక్షించియుండునో, శక్తి
షులుగూడ నట్లే ఒకరినొకరపేక్షించియుందురు. కావున
పురుషులకు సామరస్యము కలిగియుండ, వారిలో నొ
యుత్కృష్టత (గొప్పతనము) గాని, ఒకరికి నికృష్టత (

తనము) గాని, సిద్ధించునను భీతిచే తమకభిమతమగు వస్తువును సిద్ధింపజేసికొనుటకు విద్వాంసులు విష్ణ్వాదులే పరతత్వస్వరూపులని ప్రతిపాదించుచున్నారు. చైతన్యస్వరూపమొక్కటియే యగుటచే, శ్రుతిస్మృతిపురాణాదులయందు భగవద్విభూతి ననేకవిధములుగ వర్ణించినను ఆవచనములకు పరస్పరవిరోధము కలుగనేరదు. శ్రుతులు మున్నగునవి గూడ ప్రతిపాద్యవిషయమును స్వాధీనచేయుటకొఱకే యట్లు ఒకని ప్రాధాన్యమును ప్రతిపాదించుచుండును. కావుననే "యే యథా మాం ప్రపద్యన్తే..." ఇత్యాదివచనముచే భగవంతుడు భక్తులకనుగుణమగు రూపమును ధరించెదనని ప్రతిజ్ఞ చేయుచున్నాడు. యథార్థరూపమిదియే యని నిర్ణయింప నేరికిని సాధ్యముగాదు. పై కారణములచే, రామావతారము భగవదంశయని చెప్పుటలో వివాదలేకున్నను, రామాయణశ్లోకములను విమర్శించినచో శ్రీరాముడు శక్త్యవతారమని కల్పించుటయే యుక్తమని తెలుపుచు, తత్పరముగా నీగ్రంథము నాచే వ్యాఖ్యానము చేయబడుచున్నదని సహృదయులు తెలిసికొనియెదరుగాక.

---

# శ్రీమద్రామాయణస్య కల్పవల్లికాఖ్య

# వ్యాఖ్యాప్రారంభః



శ్లో॥ తపస్స్వాధ్యాయనిరతం తపస్వీ వాగ్విదాం వరం
నారదం పరిపప్రచ్ఛ వాల్మీకిర్మునిపుంగవమ్॥

వ్యా—"రజస్తమోభ్యాం నిర్ముక్తా స్తపోజ్ఞానబలేన యే అప్తాశ్శిష్టా స్తషవోక్తా స్తేషాం వాక్య మసంశయం॥" ఇతియోగపాతంజలోక్తరీత్యా స్వపిపృచ్ఛిషితార్థవిషయక యాథార్థ్యజ్ఞాన ప్రతిబంధకరజస్తమోనివర్తక తపోజ్ఞానసంపత్తిసూచనద్వారా నారదస్యాప్తత్వం బోధయితు మాదౌ తపస్స్వాధ్యాయనిరతమితి గురువిశేషణం। శ్లోకస్యాద్యంతయోః కర్మవిశేషణోపాదానేన గురుభక్తిసూచనద్వారా 'మంగళాదీని మంగళమధ్యాని మంగళాంతాని శాస్త్రాణి ప్రథంతే' ఇతి గ్రంథవృద్ధికారణీభూత గురుస్మరణాత్మకం మంగళమాచరితం। తపస్స్వాధ్యాయనిరతమితి శ్రు. "తస్మాత్స్వాధ్యాయోఽధ్యేతవ్యః" ఇతి తవ్యతా సంధ్యావందనాదివత్ స్వాధ్యాయాధ్యయనస్య నిత్యత్వబోధనేన—శ్రు. 'స్వాధ్యాయాన్మాప్రమదః' ఇత్యధ్యయనసంస్కృతస్య తస్యావిస్మృతివిషయత్వే అనిష్టసాధనత్వావగమేన "స్వాధ్యాయప్రవచనే ఏవేతి నాకో మౌద్గల్యః" ఇత్యేవకారేణ విశిష్టస్వాధ్యాయప్రవచనాదే రితరతపఃశ్రేష్ఠమా ఉత్తమతప స్త్వవసిధ్యాచ

అభ్యర్హితత్వాత్పరత్వేన స్వాధ్యాయపదస్య పూర్వనిపాత
భావేపి "యస్యజ్ఞానమయంతపః" ఇతి జ్ఞానస్యైవాత్ర గ్రహ
న్యాయ్యమితి సూచయితుమాహ ద్వంద్వే తపఃపదప్రయో
"తమేవం విదిత్వాతిమృత్యుమేతి" ఇతిశ్రుత్యా. "నహి జ్ఞా
సదృశం పవిత్రమిహ విద్యతే" ఇతి స్మృత్యాచ, జ్ఞానస్య
ధ్యాయాపేక్షయా ప్యభ్యర్హితత్వేన తపఃపదస్య పూర్వని
చిత్యాత్ । నన్వేవం "సర్వం కర్మాఖిలం పార్థ జ్ఞానే పరిస
ప్యతే" ఇతి సంస్కారకర్మణోఽధ్యయనస్యాపి జ్ఞానం ప్రత్యర్థి
తయా తపఃపదేనైవాచార్యయోగ్యతాభివ్యక్తౌ కిం స్వాధ్
పదేనేతి నవాచ్యం । స్వాచారముఖే నేతరేషామపి ఫలస
యాయినాం స్వాధ్యాయోపాసనాయా ఆవశ్యకత్వబోధన
తత్పదస్య సార్థక్యాత్ । వస్తుతస్తు "సూక్ష్మా మర్థేనాప్ర
తత్వా మేకాం వాచ మభిష్యందమానాం తామన్యే విదుర
మివ నానారూపా మాత్మని సన్నివిష్టా" మిత్యాది శ్రుత
ప్రవిభక్తశబ్దబ్రహ్మోపాసనాసక్త మిత్యర్థకతయా నిరత
విశేషితం । తేన శబ్దార్థోభయరూపశివశక్త్యుపాసకతయా
కృజ్ఞానవిశిష్టమితిఫలితం । అత ఏవ వాగ్విదాంవర మిత్య
వాచం పరాదిభేదేన చతుర్విధాం విదంతీతి వాగ్విదః । తే
వరం శ్రేష్ఠం । తథాహి-పరా-పశ్యన్తీ-మధ్యమా-వైఖరీ
చతుర్విధా వాక్ -వటబీజే వటవృక్షీయసూక్ష్మరూపవ
ష్టిసూక్ష్మరూపశాలినీ త్రిపురసుందరీపదవాచ్యా పరేత్యుచ్య
తస్యా ఏవానాదిసిద్ధప్రాణ్యదృష్టవశాత్త్వంతరీ న ప్రాణినిస్స

యాం తదాలోచనాత్మకం। 'తదైక్షత బహుస్స్యాం ప్రజాయే యేతి' శ్రుతిసిద్ధమీక్షణం ప్రవృత్తినిమిత్తీకృత్య పశ్యన్తీత్వం। తస్యాఏవా వికృతశూన్యస్పర్శనాదధ్వనిబిందుశక్తిబీజాక్షరాదిభేదేన వ్యష్టిసమష్టిరూపాయాః పరావన్నాతిసూక్ష్మాయా వైఖరీవన్నాతిస్థూలాయాస్తదుభయమధ్యావస్థాపన్నత్వాన్మధ్యమాత్వమ్ వైఖరీపదవాచ్యమ్। వై-నిశ్చయేన-ఖం-(శ్రోత్రేన్ద్రి)యమ్-రాతి-గచ్ఛతి-తజ్జన్యజ్ఞానవిషయోభవతీతి తద్వ్యుత్పత్తిః। ఇతోఽధికవిచారస్త్వన్యతోఽవసేయ ఇత్యత్రోపరమ్యతే। తదుక్తమాచార్యైః। "మూలాధారాత్ప్రథమ ముదితో యశ్చభావః పరాఖ్యః। పశ్చాత్పశ్యన్త్యథహృదయగో బుద్ధియుఙ్మధ్యమాఖ్యః। వ్యక్తే వైఖర్యథరురుదిషో రస్యజంతోస్సుషుమ్నాబంధస్తస్మాద్భవతి పవనప్రేరితా వర్ణసంజ్ఞా" ఇతి। ఏవం నిత్యాతంత్రేపి। మూలాధారాత్సముత్పన్నః పరాఖ్యో నాదసంభవః। స ఏవోర్ధ్వతయా నీతస్స్వాధిష్ఠానే విజృంభితః। పశ్యన్త్యాఖ్యా మవాప్నోతి తథైవోర్ధ్వం శనైశ్శనైః। అనాహతే బుద్ధితత్వసమేతో మధ్యమాభిధః। తథా తయోర్ధ్వం నున్నస్సన్ విశుద్ధా కంఠదేశతః। వైఖర్యాఖ్య ఇత్యాది। ఇత్థంచ చతుర్విధమాతృకాసు మనుష్యాణాం తురీయవైఖరీరూపవాచఏవ విజ్ఞానం। యోగీశ్వరాణాంతు సర్వవిధవాక్స్వరూపజ్ఞానసంపత్తి రితి వాగ్విదాం వరత్వమితి। తథాచ శ్రుతిః। "తస్మాద్యద్వాచోఽనాప్తంతన్మనుష్యా ఉపజీవన్తీ"తి. అనాప్తమ్- అసంపూర్ణం। తిసృభిర్వారహితమితి వేదభాష్యే। శ్రుత్యన్తరమపి। "చత్వారివాక్పరిమితా పదాని।

తాని విదుర్బ్రాహ్మణా యే మనీషిణః । గుహాత్రీణి నిహి
నేంగయన్తి । తురీయమ్ వాచో మనుష్యా వదన్తి" ఇతి స్క
పురాణే యజ్ఞవైభవఖండేఽపి । "అపదం పదమాపన్నం
చాప్యపదం భవేత్ । పదాపదవిభాగంచ యః పశ్యతి స పశ్య
ఇతి. అపదం గతిరహితం। నిష్పందం శబ్దబ్రహ్మైవ పరాది
పదచతుష్టయజాతం తదిదం పదచతుష్టమేవ జ్ఞాతంసత్ బ్రహ్మై
భవతీతి తదర్థః । ఇదమేవ మనసి నిధాయ కవిపుంగవః
దాసః 'వాగర్థావివ సంపృక్తౌ వాగర్థప్రతిపత్తయే । జ
పితరౌ వందే పార్వతీపరమేశ్వరౌ' ఇతి శబ్దార్థసామ్యం శివశ
వ్యక్తీచకార । తత్ప్రతిపత్తిస్తు సంప్రదాయైకపరా ఇతి గురు
శరణం । ఏవం చ "అల్పాచ్ తరం" ఇతి సూత్రేణ తపస్
పూర్వప్రయోగమాశ్రిత్య తస్య యద్వేత్యాదిపక్షాం
తత్తత్ప్రమాణోపపాదనపూర్వకం చాంద్రాయణాదివ్రతప
కల్పనం వ్యాకరణాదిశాస్త్రపరత్వకల్పనంచ, గోవిందాచార్య
ణాం స్వపాండిత్యకల్పనమితి మన్తవ్యం। 'వాసుదేవార్జునా
వున్' ఇతి నిర్దేశేన, పూజ్యార్థవాచకస్య ద్వంద్వే పూ
యోగ ఇత్యర్థస్య భాష్యారూఢత్వాత్ । పూర్వనిపాతశాస్త్ర
స్యానిత్యత్వాశ్రయణం త్వగతికగతివిషయం । ఆచార్య వి
ద్వయమధ్యే తపస్విత్వైకాంశబోధక శిష్యవిశేషణోపాదా
గుర్వపేక్షయా స్వస్య న్యూనశక్తికత్వబోధనద్వారా తపః
క్షిత పరాతత్వగ్రహణధారణానుకూలచిత్తైకాగ్ర్యసంపత్తి
నార్థం । అత ఏవ వాల్మీకిరిత్యుక్తం! మాతృగర్భే శిశో

వల్మీకగర్భే చిరావస్థితిస్ఫోరకం। చిరావస్థానంచ తత్ర దృఢతర యోగశక్తిమన్తరా న ఘటత ఇతి తత్సిద్ధిః। అత ఏవాత్రే ఞః ప్రయోగః। నచాపత్యత్వస్య చేతననిరూపిత తయాఽత్ర తదసంభవ ఇతి వాచ్యం। తస్యాంతర్యామిదేవతా మాదాయ పార్వతీత్యాదా వివ తదుపపత్తేః। న చాపత్యపదస్య శుక్లశోణితసంయోగజన్యత్వప్రవృత్తినిమిత్తకతయాఽత్రాపత్యత్వమౌపచారికమితి భ్రమితవ్యం। జానకీ, పాణ్మాతుర, ఇత్యాదావణాది నాపత్యత్వ బోధస్యానుపాం స్వారసికతయా అన్యాదృశధర్మస్యై వాపత్యపద ప్రవృత్తినిమిత్తత్వౌచిత్యాత్। నచ నపతంత్యనేనేతి వ్యుత్పత్త్యా పితృదేవతాపతనప్రతిబంధకపిండదానాది ధర్మాచరితృత్వమేవ తత్ప్రవృత్తినిమిత్త మితి వాచ్యం। సత్యపి చిరజీవనే నాస్తిక్యాదినాదనాచరితుః తదభావే నాల్పాయుషస్తదసంభవేన జనిమతోఽప్యపత్యత్వవ్యవహారాత్। అత్రేద మవధేయం। నహ్యపత్యత్వ మాతం ప్రత్యయప్రయోజకం। కింతు పోష్యపోషకభావాది సంబంధాంతరమపి। అత ఏవ దాశరథ్యాదిపదేభ్యోఽపత్యత్వసామ్యేఽపి భరతాదిప్రతీతి స్వారసికీ। యది తూక్తోదాహరణేషు సంబంధత్వేనైవాపత్యబోధః। న త్వపత్యత్వేన। తథాత్వేన త్వణపవాస్యై ఞః ప్రవృత్త్యౌచిత్యాత్। ఇత్యుచ్యేత, తదా నగరాజాత్మజా, జనకతనయే త్యాదావపత్యత్వప్రతీతే శ్శబ్దా స్తత్ర దుర్వారా ఏవ। అపత్యపదస్యాత్మజాదిశబ్దపర్యాయతయా స్త్రీపుంససాధారణ్యేన కోశారూఢత్వాత్। "అథాబ్రవీ న్మహాతేజా బ్రహ్మా లోకపితామహః। వల్మీక ప్రభవో యస్మా త్తస్మా ద్వాల్మీకి

రిత్యసౌ"॥ ఇతి బ్రహ్మకైవర్తే తదపత్యత్వేవ తత్రప్రభవ
పీ ఇః ప్రయోజకతయా నిర్వచనప్రదర్శనేన వాల్మీకిశ్చ
తాయా నిష్ప్రత్యూహత్వేన న మార్గాంతరాశ్రయణ ప్ర
శ్యక మితి దిక్॥ మునిపుంగవం- మునయో మననశీలాః
పుంగవం శ్రేష్ఠం। యథావచ్ఛ్రుత స్యార్థస్య మన
సాక్షాత్కర్తారో హి మునయః। తేషాం శ్రేష్ఠ మిత్య
బహుధా శ్రుతమపి పరమార్థతత్త్వం పూర్వోక్త దిశా య
మననబలేన నిరచైషీ దితి సిద్ధం। తచ్చ తత్త్వం। చిరం ప
శుశ్రూషాద్యనపేక్షయైవ జిజ్ఞాసూనాం సర్వేషా ముత్త
తారణస్వభావ త్తయా మేఘస్య జలదత్వవ దస్య మునే స్త
దత్వ మసాధారణధర్మ ఇతి బోధయితుం నారద మిత్యు
ఏతేనేతరేషాం తు మునీనాం జ్ఞానవైశిష్ట్యేపి స్వీయగ్రం
షాదినిబంధనద్వారా విలంబేన మార్గదర్శిత్వ మితి తదపేక్ష
స్వగురో రాధిక్యం సూచితం! పరిపప్రచ్ఛ-లిటి ప్రథమపురు
"ఇత్యేవం మను రబ్రవీత్"। "పరాశరవచో యథే"ఇత
వత్ స్వవచనస్య ప్రభువచనస్యేవ సర్వాదరణీయత్వ జ్ఞాప
మార్షశైల్యా స్వస్యైవాన్యత్వ వ్యపదేశః॥ యత్తు సుప్రో
కిల విలలాపేత్యాదావివ వివక్షితభగవద్గుణానుసంధాన
త్వాత్ పరోక్షే లిడుత్తమ ఇతి మణిమంజీరం। తత్ర జ్ఞ
వీర్యాదిగుణవిశేషాశ్రయో రామో భగవా నితి యది స్వ
యోత్తరాత్ ప్రాగ్వాల్మీకి రజానా త్తర్హి ప్రశ్నస్య
జ్ఞాతార్థే ప్రశ్నే గురుప్రతారకత్వాపత్తేః। యది నా

త్తదా తదనుసంధానస్యైవాసంభవ ఇత్యా ద్యూహ్యం । ఏవం చ నైరంతర్యేణ స్వాధ్యాయాత్మకశబ్దబ్రహ్మోపాసకతయా త్రిపురసుందరీపదవాచ్యపరాస్వరూపవిదా ముత్తమత్వేన ప్రసిద్ధం । మననబలేన సంశయవిపర్యయాది నివర్తకతయా శిష్యాణా మనాయాసేన జ్ఞానోపదేశశీలయుతం కోన్వస్మిన్నిత్యాది ప్రకారేణ యోగశక్త్యా నారదోపదిదిక్షితవస్తుగ్రహణానుకూలచిత్తైకాగ్ర్యస్సన్ వాల్మీకిః జ్ఞేయస్వరూపం గురుభక్తిపూర్వకం పప్రచ్ఛేతి ఫలితం । ధనవంతం యాచత ఇత్యాదా ప్రత్యాసత్త్యాऽప్రయుక్తస్యాపి ధనాదేరివ ప్రకృతే నిరుక్తవిశేషణబలేన జ్ఞేయ స్వరూప మితి కర్మణో ఝుటితి ప్రతీత్యా పృచ్ఛతేర్న ద్వికర్మకత్వ హానిః । నవా । తద్రక్షణాయ యత్నాంతరాశ్రయణ మావశ్యకం । కోన్వస్మిన్నిత్యాది వక్ష్యమాణం పప్రచ్ఛేతి తు న సమ్యక్ । తస్య ప్రశ్నప్రకారవిశేషపరామర్శితయా తత్కర్మత్వే నాన్వయాయోగాత్ । 'క్రమా దముం నారద ఇత్యబోధిస' ఇతి మాఘకావ్యస్థశ్లోకే ఇతి శబ్దేన నిపాతేన కర్మత్వస్యాభిధానాత్ న కర్మణి ద్వితీయేతి వ్యాఖ్యాన మితి శబ్దస్య ప్రబోధాకారపరతయా కర్మత్వ స్యాప్రసక్తిరిత్యాది నోపాధ్యాయైః ప్రభాషితం । ఏవం చ సకల నిష్కళభేదేన ద్వివిధస్యాపి త్రిపురసుందరీరూపస్య రామాఖ్యస్య బ్రహ్మణో జ్ఞేయత్వావిశేషే స్యోపాసకానాం ప్రకార విశేష విశిష్టస్య సకలస్యైవ తద్రూపస్యావశ్యకత్వా త్ప్రకార విశేషై రేవ వాల్మీకేః ప్రశ్నః - తదనుకూల మేవ చోత్తరం నారదస్యేతి వేదితవ్యం ! తత్రాపి జగన్ని

యామకత్వజగదాత్మకత్వభేదేన సకలస్య ద్వివిధత్వేఽపి జ
యామక మేవ రూపం త్రిపురసుందర్యా జిజ్ఞాసి తత్త్వేన క
త్రేత మితి మంతవ్యం। జగన్నియామకత్వం చ పంచకృ
యికతయా బ్రహ్మవిష్ణురుద్రాదిభేదేనానంత మేవ। త
కూర్మ పురాణే। హిమవంతం ప్రతి దేవ్యా। "అశక్తో
మాం ధ్యాతు మైశ్వరం రూప మవ్యయం! తదా మే
రూపే కాలాఖ్యే నంతభేదిని। యదేవ రూపం మే త
నసో గోచరం తవ। తన్నిష్ఠ స్తత్పరో భూత్వా మదర్చ
భవ॥ యత్తు మే నిష్కలం రూపం చిదాత్మం కేవలం శి
సర్వోపాధి వినిర్ముక్త మేక మేవ పరాత్పరం॥ జ్ఞానేనై కే
భ్యం క్లేశేన పరమం పదం॥" ఇతి నారదస్య తు జ్ఞానోప
రూపోభయవిధశక్తిమత్తయా మహత్త్వం శ్లోకస్యాద్య
షణే బోధయత ఇతి రహస్యం। కావ్యలక్షణా న్యలంకార
తు వ్యాఖ్యాన్తరా ద్గ్రాహ్యా ణీత్యుపరమ్యతే॥ ప్రశ్న ప్ర
నాహ॥

తా॥ నిరంతరము స్వాధ్యాయరూపమగు శబ్దబ్రహ్మ
పాసనజేయువాడగుటచే 'త్రిపురసున్దరీ' పదముచే జెప్పబడు
శక్తి స్వరూపమును బాగుగ గుర్తెరిగినవారిలో నుత్తమ
పేర్కొనబడువాడును, మననబలముచే సంశయవిపర్య
గలుగకుండ శిష్యులకనాయాసముగ జ్ఞానమునుపదేశించు స
వము గలవాడును, గురువర్యుడు నగు నారదుని, ఆగురు
డుపదేశించువస్తువును గ్రహించుటకుతగిన చిత్తైకాగ్రత గ

డగుచు, వాల్మీకిమహర్షి గురుభక్తిని ప్రకటింపుచు జ్ఞేయస్వ రూపమును అడిగెనని యీశ్లోకమునకు ముఖ్యతాత్పర్యము.

ఈశ్లోకమందలిపదము లీవిశేషముల నెట్లు బోధించునో క్రమముగ తెలుపబడుచున్నవి.

"ఏపుణ్యపురుషులు రజస్తమోదోషములవలన విడువబడు దురో వారే శిష్టులు. అట్టివారి వాక్యములు పరమప్రమాణ ములు సంశయరహితములును" అని యోగశాస్త్రమున పతం జలిమహర్షి చెప్పియున్నాడు. తానడుగబోవు విషయమును బాగుగ తెలిసికొనుటకు ప్రతిబంధకములగు రజస్తమస్సులను తొలగింపజేయగల తపశ్శక్తి, జ్ఞానసంపత్తియు గలవాడగుటచే నారదుడు, వాల్మీకికి మిక్కిలి యాప్తుడని తెలుపుటకై 'తప స్స్వాధ్యాయనిరతం' అను విశేషణమిచ్చుట గ్రహింపబడినది. శ్లోకమున కాద్యంతములలో 'పప్రచ్ఛ' 'అడిగెను' అను క్రియకు కర్మయగు నారదునకు రెండు విశేషణములను ప్రయోగించు టచే వాల్మీకిమహర్షికి గల గురుభక్తి విదితమగుచున్నది. ఇం తియ గాక గ్రంథాదిని గ్రంథాంతమునను మంగళము చేయుట గ్రంథమునకు గ్రంథకర్తకును శ్రేయోదాయకము గాన గురు స్మరణరూపమగు మంగళ మీగ్రంథమందు చేయబడినదను విష యము స్పష్టముగ తెలియవచ్చుచున్నది.

"స్వాధ్యాయోఽధ్యేతవ్యః" అను నీశ్రుతి సంధ్యావంద నాదికర్మలెట్లు నిత్యములో స్వాధ్యాయాధ్యయనముగూడ నట్లే నిత్యమని తెలుపుచున్నది. 'స్వాధ్యాయాన్మాప్రమదః' అను

నీవాక్యము అధ్యయనసంస్కృతమైన స్వాధ్యాయము వ
నచో అది అనిష్టసాధకమని బోధించుచున్నది. "స్వాధ్యా
ప్రవచనే ఏవేతినాకో మౌద్గల్యః" అను నీవాక్యము స్వాధ్యా
ప్రవచనములు ఇతర తపస్సుకంటె ఉత్తమమైన తపస్సని వ
పరుచుచున్నది. ఈ హేతువులచే స్వాధ్యాయపదము శ్రేష్ఠ
గాన వ్యాకరణశాస్త్రమర్యాదచే నీపదము 'తపః' అను ప
నకు ముందే యుండనగునని తోచెడిని; కాని యిచ్చట "య
జ్ఞానమయం తపః" అనువాక్యము ననుసరించి 'తప' శ్శబ్దమ
"జ్ఞానము" అను నర్థమును గ్రహించుట యుక్తమని తె
టకై ఈపదమే ముందుపయోగింపబడినది. "ఆతనిని జ్ఞానస్వ
నిగా తెలిసికొని జననమరణములు లేనివాడగును." అను
వాక్యము ననుసరించియు, "జ్ఞానముతో సదృశమగు పవి
నది వేరొకటిలేదు" అనుస్మృతివాక్యముననుసరించియు జ్ఞా
స్వాధ్యాయము కంటె మిక్కిలి శ్రేష్ఠముగాన 'తపః' అనుప
ముందుండదగినది.

"వివిధమగు కర్మలు జ్ఞానమందే పరిసమాప్తి నొ
చున్నవి" అను గీతావాక్యముచే, సంస్కార కర్మయగు స్వా
ధ్యాయాధ్యయనము జ్ఞానమునకు తరువాతిదిగాన 'తపః' అను ప
చేతనే ఆచార్యుని యోగ్యత తెలియుచుండ స్వాధ్యాయప
అక్కరలేదని తోచెడిని; కాని తనయాచారానుసారముగ
ప్రాప్తివరకు యత్నించెడి యితరులకుగూడ స్వాధ్యాయా
యనము ఆవశ్యకమని తెలుపుటకై యీపదముకావలసి

యుండును. బాగుగ నాలోచించినచో "సూక్ష్మమైనట్టియు, అర్థముకంటె వేరుగాని స్వరూపము గలట్టియు, అద్వితీయము సర్వవ్యాపకము నైనట్టియు, వివిధరూపములచే నంతట వ్యాపించియున్నట్టియు నగు వాక్కును అనేకు లనేకరూపముగ తలచుచున్నారు" అనుశ్రుతివాక్యముచే, అర్థముతో విడియుండని శబ్దబ్రహ్మ నుపాసించువాడనునర్థమును తెలుపుటకై 'తపస్స్వాధ్యాయనిరతం' అను విశేషణము సార్థకమగును.

శబ్దార్థోభయ రూపమగు శివశక్తుల నుపాసించువాడగుటచే వాని యైక్యజ్ఞానముతో గూడినవాడని ఫలితార్థము. కనుకనే 'వాగ్విదాంవరం' అనిచెప్పబడినది. పరా, పశ్యన్తీ, మధ్యమా, వైఖరీ, అనినాల్గువిధములుగ పేర్కొనబడు వాక్కును గుర్తెరింగిన వారిలో శ్రేష్ఠుడని పై విశేషణమున కర్థము.

వటబీజమందు వటవృక్షమునకు సంబంధించిన సూక్ష్మరూపమువలె, శబ్దసృష్ట్యాత్మకమగు సూక్ష్మరూపముతోగూడినట్టియు, 'త్రిపురసున్దరీ' అను పదముచే జెప్పబడు స్వరూపము 'పరావాక్' అనబడును. ఆపరావాక్కే, అనాదిసిద్ధమగు ప్రాణ్యదృష్టవశమున తనయందణగియున్న జీవులను సృజింపవలెనను నిచ్ఛచే తదాలోచనరూపమగు నీక్షణముతో గూడినచో 'పశ్యన్తీ' అనబడును. అదియే, అవికృతాదిభేదముచే వ్యష్టిసమష్ట్యుభయస్వరూపిణియై, పరావాక్కువలె మిక్కిలి సూక్ష్మరూపిణియు, వైఖరీవాక్కువలె మిక్కిలి స్థూలరూపిణియుగాకున్నచో 'మధ్యమా' అనబడును. అదియే శ్రవణేంద్రియ

జ్ఞానమునకు గోచరమగుచో 'వైఖరీ' అనబడును. వై=నిశ్చ
ముగ, ఖం=శ్రోత్రేంద్రియమును, రాతి=పొందుచున్నది;
'వైఖరీ' యను నామము సార్థకము. కావున నాకేవా
అవస్థా భేదముచే నాల్గువిధములుగ గణింపబడుచున్నది.

"మూలాధారము నుండి బయలువెడలిన 'పరా'
భావమే హృదయస్థానము నొందినపుడు "పశ్యన్తీ" అనబ
ఆభావమే బుద్ధితో గలసినపుడు 'మధ్యమా' అనబడును.
నేచ్ఛగల జంతువు నుండి ధ్వనిరూపముగ బయలువెడలు
'వైఖరీ' అనబడును. ఆభావమే పవనప్రేరితమై స్ఫుటమైన
వర్ణమని చెప్పబడును" అను నీ యాచార్యోక్తిచే పై విషయ
దృఢమగుచున్నది. "మూలాధారచక్రమునబుట్టి నాదరూప
పరిస్ఫుటమైనభావము 'పరా' అనబడును. ఆభావమే స
ష్ఠానచక్రమునకు గొంపోబడి నపుడు 'పశ్యన్తీ' అనబడును.
హతచక్రమున బుద్ధితత్వముతో గూడుకొని నపుడు ఆభా
'మధ్యమా' అనబడును. కంఠప్రదేశమునకు తీసికొనిపో
నపుడు 'వైఖరీ' అనబడును." అని నిత్యాతంత్రమందుగూడ
షయ మిట్లు చర్చింప బడినది. ఇట్లు చతుర్విధమగు నీమా
కలలో మనుజులు నాల్గవదగు వైఖరీవాక్కునే యెఱు
దురు. యోగీశ్వరులన్ననో నాల్గింటినిగూడ నెఱుంగు
నారదు డిట్టి యోగీశ్వరుడని తెలుపుటకుగూడ 'వాగ్విదాం
అను నీవిశేషణము. "మనుజులు అసంపూర్ణ మగు తు
వాక్కునే ఆశ్రయింతురు." అని శ్రుతి చెప్పుచున్నది. "చత

వాక్పరిమితాపదాని" ఇత్యాదిశ్రుతికూడ పైయర్థమునే తెలుపుచున్నది.

యజ్ఞవైభవఖండమునందు "స్పందరహితమైన శబ్దబ్రహ్మమే పరాదిభేదముచే పదచతుష్టయమైనది. ఈపదచతుష్టయమును దెలసినవాడు పరబ్రహ్మస్వరూపుడగును" అని తెలుపబడినది. పైవిషయమును మనస్సునందిడికొనియే కవిపుంగవుడగు కాళిదాసు 'వాగర్థావివసంపృక్తౌ... ...' ఇత్యాదిశ్లోకమున పార్వతీపరమేశ్వరులకు శబ్దార్థసామ్యమును వ్యక్తముచేసియున్నాడు. ఆసామ్యమెట్లు స్థిరపడునను నది గురుసాంప్రదాయముననే తెలియనగును.

'తపః' అను శబ్దమునకు కృచ్ఛ్రచాంద్రాయణాదివ్రతమర్థమనియు, వ్యాకరణమర్యాదచొప్పున అల్పాచ్చులుగల యీశబ్దమే ముందుండుటకర్హమనియు గోవిందాచార్యులవారు చెప్పినవ్యాఖ్యానమంతయు వారిపాండిత్యమును వెల్లడించునుగాని, పై విషయములనాలోచించినచో వారివాద మంతసమంజసము కాదని తోచెడిని.

ఆచార్యుని యుత్కృష్టత దెలుపుటకై యుపయోగింపబడిన 'తపస్స్వాధ్యాయనిరతం' 'వాగ్విదాంవరం' అను విశేషణముల రెండింటిమధ్యనున్న 'తపస్వీ' యను నేకవచనాంతవిశేషణము శిష్యుడు గురువుకంటె తక్కువశక్తిగలవాడనియు, ఆగురువుచే నుపదేశింపబడు పరతత్త్వమును గ్రహించి ధారణలో

నుంచుకొనుటకు తగిన చిత్తైకాగ్రతతో గూడినవాఁ
తెలుపుచున్నది.

'వాల్మీకిః' అనుపదముగూడ శిష్యుని యోగశక్తి
మునే బోధించుచున్నది. ఈపదము మాతృగర్భమందు
వలె వల్మీక (పుట్ట) గర్భమున చిరకాలముండినవాఁడు అ
మును స్ఫురింపజేయుచున్నది. అట్లుండుట దృఢతరమగు
శక్తిలేనిదే సంభవింపదుగదా !

'వాల్మీకిః' అనుపదమునకు 'వల్మీకస్య అపత్యం'
వ్యుత్పత్తిచెప్పి అపత్యార్థమునందు 'ఇఞ్' అను ప్రత్యయ
చేసినచో రూపసిద్ధియగును. పుట్టయొక్క సంతతిలోనివాఁడు
యర్థము. ఈపక్షమున పుట్ట అచేతనపదార్థముగాన
కీతఁడు సంతానమగుట యెట్లు? అనుప్రశ్న జనించును. 'పా
(పర్వతసంతానము) అనునప్పుడు పర్వతమందు అంతర్యా
దేవతాస్వరూపము వేరొకటి యుండుటచే నద్దానికి సం
మగుటచే 'పార్వతీ' యనుపద మెట్లుసాధువో, అట్లే పుట్టకు
గూడ అంతర్యామిదేవతయుండుటచే నీశబ్దముగూడ సా
కావచ్చునని పైప్రశ్నకు సమాధానము చెప్పనొప్పును.
అపత్యమనగా శుక్లశోణితసంబంధముచే పుట్టునది యన్న
పుట్టకు నీతనికి అట్టిసంబంధముండుట సంభవించదు గాన
ర్థము సహజముగ పొసగదని భ్రమింపగూడదు. "జానకీ
కునిసంతానము) "షాణ్మాతురః" (షట్కృత్తికలసంతా
మున్నగు తావులందువలె జన్యజనకభావసంబంధమేగాక

సంబంధములుగూడ అపత్యశబ్దముచే దెలుపబడునని గ్రహించి నచో విరోధముండజాలదు.

'అపత్య' శబ్దమునకు "నపతన్త్యనేనేతి అపత్యం" (వీనిచే పితృదేవతలు నరకములోబడరు) అను వ్యుత్పత్తిని గ్రహించినచో పితృదేవతలు నరకమునందు పడకుండ పిండదానము మున్నగు సత్క్రియల నొనరించునాతడే 'అపత్య' మనబడును. పుట్టను వాల్మీకి అట్టి యపత్యము కానేరడు గాన, ఈయర్థ మిచ్చట పొసగుటెట్లు అని సంశయము గలుగవచ్చును. కాని, కలిగిన పుత్రుడు చిరజీవియైనా నాస్తికుడైనను, అల్పాయుర్దాయముగలవాడైనను పితృదేవతల నుద్ధరించుట తటస్థింపనుగాన జననమాత్రముననే అపత్యమగునని చెప్పకతీరదు.

ఇచ్చట 'ఇఞ్' అనుప్రత్యమువచ్చుటకు అపత్యమగుటయే కారణముగాదు. పోష్యపోషకభావము మున్నగుసంబంధాంతరముగూడ కారణము కావచ్చును. కావుననే 'దాశరథిః' (దశరథాపత్యము) మున్నగుపదములందు సంతానముగుటలో సామ్యమున్నను భరతాదులనునర్థము స్వారసికముగ స్ఫురించదు.

"వల్మీకము (పుట్ట) ఉత్పత్తిస్థానముగాగలవాడుగాన నితడు వాల్మీకియైనాడు; అని మహాతేజస్వియు లోకపితామహుడును, అగు బ్రహ్మ చెప్పినాడు" అను బ్రహ్మకైవర్తపురాణవచనమువలన అపత్యార్థమందువలె ప్రభవాద్యర్థములయందుగూడ 'ఇఞ్' ప్రత్యయముకావచ్చును. కాన వాల్మీకిశబ్దమీరీతిగసాధు

వగుటలో సందియములేదు. దీనినిసాధించుటకై యితరమార్గ ములవెనుక నవసరములేదని తెలసికొనతగినది.

'మునిపుఙ్గవమ్' మననశీలురలో శ్రేష్ఠుడు. వినినయర్థ మును బాగుగ మననముచేసి, యద్దానిసాక్షాత్కారము నొంద గలిగినవారే మునులనబడుదురు. అట్టివారిలో నీతడు శ్రేష్ఠుడని చెప్పుటచే, పలుమారులు వినినపరమార్థతత్త్వమును ఈతడే తనమననబలముచే నిర్ణయించెనని స్థిరపడుచున్నది.

ఆతత్త్వమును చిరకాలము శుశ్రూషమున్నగువానినపే క్షింపకయే తెలియగోరువారికందఱ కుపదేశించి, వారినితరింప జేసెడిస్వభావముగలవాడుగాన, మేఘమునకుజలమునొసగు టెట్లుసహజమో అట్లే ఈతనికి జ్ఞానమునుపదేశించుట సహజ మని తెలుపుటకు 'నారదః' అనుపదము ప్రయోగింపబడినది. ఇతరమునులు శుశ్రూషచేసి భక్తివిశేషమునుచూపెడుశిష్యుల కైనను ఆలస్యముగ జ్ఞానమునుపదేశింతురనియు, వెంటనే జ్ఞానమునుపదేశించుటలో నారదుడు వారికంటెఘనుడనియు తోచెడిని.

'పరిపప్రచ్ఛ' అనునీపదము 'లిట్' అనుప్రత్యయముతో గూడినక్రియాపదము. ప్రథమపురుషైకవచనాంతము. "ఈరీతిగ మనువుచెప్పెను" "పరాశరునివాక్యమువలె" మున్నగువాక్యము లందువలె తనవాక్యము ప్రభువాక్యమురీతిని అందరునాదరింప దగినదని సూచించుటకై ఆర్షశైలిని ఈపదమిట్లు ప్రయోగింప బడినది.

"నిద్రించినవాడనై నేను విలపించితిని" మున్నగు తావులందువలె, తానడుగబోవు భగవద్గుణానుసంధానమందలి వైచిత్ర్యముచే పరోక్షభూతార్థమున 'లిట్' ప్రత్యయమునకు ఉత్తమపురుషయని మణిమంజీరమను గోవిందరాజీయవ్యాఖ్యానమున నున్నది. ఆపక్షమున నారదుడుసమాధానమీయకముందే రాముడిట్టిగుణములుగలవాడని వాల్మీకియెఱిగినచో ప్రశ్నకవకాశమేయుండదు. తెలిసియే యడిగినచో గురువును వంచించినవాడగును. తెలియకయేయడిగె ననినచో రాముడట్టిగుణములు గలవాడని వాల్మీకి యెట్లు చెప్పగలడు ? కావున నీరీతివ్యాఖ్యానము సమంజసముగ లేదు.

వాల్మీకి నారదునడిగెను. ఇక్కడ దేనిని ? అనుప్రశ్న జనించును. ధనవంతుని యాచించుచున్నాడు అన్నచో 'ధనమును' అనుపదము ఆవాక్యములో లేకున్నను యాచించునది ధనమేయని యెట్లుసిద్ధమో, అట్లే పై జెప్పినవిశేషములచే జ్ఞేయస్వరూపమునడిగెననువిషయము శీఘ్రముగస్ఫురించును. కావున 'పృచ్ఛ' అనుధాతువు ద్వికర్మకమగుటలో గూడ భంగములేదు. "కోన్వస్మిన్ ......" (ఎవడిప్పుడుగుణవంతుడు) ఇత్యాదికమే కర్మమగుటచే ద్వికర్మకత్వము సిద్ధమగుననన్నచో అది ప్రశ్నయందలి రీతివిశేషము నపేక్షించునదిగాన కర్మమగుట సంభవింపదుగాన మణిమంజీరవ్యాఖ్యానముం డుదాహరించిన అన్వయమే పొసగదు.

పై జెప్పినరీతిని సకలనిమ్నోన్నతభేదముచే ద్వివిధమైన

నట్టియు త్రిపురసుందరీరూపమైనట్టి రాముడను నామముగల పర
బ్రహ్మస్వరూపమే తెలియదగినది. ఆస్వరూపము విశేషము
లతోఁగూడినది కాకున్నను, ఉపాసకులకు విశేషములతోఁగూడిన
సకలస్వరూపమే ఆవశ్యకముగాన అట్టివిశేషములతోఁగూడిన
స్వరూపమునుగూర్చియే వాల్మీకిప్రశ్నించెను. నారదుఁడును
ఆతనిప్రశ్ననను సరించియే సమాధానమొసగెనని తెలియనగును.

సకలస్వరూపమును 'జగన్నియామకము' 'జగదాత్మ
కము' అని రెండుతెఱఁగులనున్నది. అందు జగన్నియామకమగు
శక్తిస్వరూపమునుగూర్చియే ప్రశ్నయని తెలియనగును.

జగన్నియామకస్వరూపమును బ్రహ్మవిష్ణురుద్రాదిభేద
ముచే ననంతము. హిమవంతునిగూర్చి దేవిచెప్పినవాక్యములలో
కూర్మపురాణమునందు "సర్వనియామకము, అవ్యయము, నగు
నారూపమును ధ్యానముచేయుటకుసమర్థుడవుకానిచోఁ కాల
మను పేరుగలట్టియు అనంతభేదములుగల నాసకలస్వరూపమును
ధ్యానించుము. నీమనస్సునకుగోచరించురూపమేదిగలదో దాని
యందే నిష్ఠగలవాడవై నన్నర్చింపుము. చైతన్యస్వరూపము
అద్వితీయము, నిశ్శ్రేయససాధనము, సర్వోపాధిరహితము,
పరములగు ఇంద్రియాదులకందెపరము, నగు నానిష్కలస్వరూ
పము జ్ఞానముచేతనే పొందదగినది. దానిని పొందుటచాలకష్టము"
అనియిట్లుకలదు.

నారదుడు జ్ఞానోపాసనలు రెండింటితోఁగూడినవాఁడు గాన
సర్వసమర్థుడని శ్లోకమందలి యాద్యంతవిశేషణములు తెలుపు

చున్నవి. కావ్యలక్షణములగు గుణాలంకారాదులు ఇతరవ్యాఖ్యల నుండియే గ్రహింపదగినవి.

శ్లో॥ కోన్వస్మిన్సాంప్రతం లోకే గుణవాన్ కశ్చ వీర్యవాన్।
ధర్మజ్ఞశ్చ కృతజ్ఞశ్చ సత్యవాక్యో దృఢవ్రతః॥

శ్లో॥ చారిత్రేణ చ కో యుక్త స్సర్వభూతేషు కో హితః।
విద్వాన్ కః కస్సమర్థశ్చ కశ్చైకప్రియదర్శనః॥

శ్లో॥ ఆత్మవాన్ కో జితక్రోధో ద్యుతిమాన్ కోఽనసూయకః।
కస్య బిభ్యతి దేవాశ్చ జాతరోషస్య సంయుగే॥

వ్యా॥ అస్మిన్లోకే భూలోకే- సాంప్రతం- ప్రశ్నసమకాలే- గుణవాన్- బహుగుణయుక్తః- కోన్వితి ప్రశ్నః। గుణవానిత్యత్ర భూమ్ని మతుప్। "భూమనిందా ప్రశంసాసు నిత్యయోగేఽతిశాయనే। సంసర్గేస్తి వివక్షాయాం భవంతి మతుబాదయః"॥ ఇత్యుక్తేః। లోకాన్తర కాలాన్తరయోర్గుణవతస్సంభవేసి న తత్ర మే జిజ్ఞాసేతి భావః। బహుగుణసత్తాదశాయాం యత్కించిద్దోషసత్త్వేఽప్యశోకవనికాన్యాయేన గుణవానిత్యుచ్యేత, తన్నిరాసార్థం ను శబ్ద ఏవకారార్థకః। గుణవానిత్యనేన సంబధ్యతే। గుణవానేవేత్యర్థః। అవ్యయానామనేకార్థత్వాత్। జిజ్ఞాసావిషయత్వోపలక్షిత ధర్మావచ్ఛిన్నవాచకేన కింశబ్దేనైవ పృచ్ఛార్థలాభే పునః పృచ్ఛార్థకత్వం ను శబ్దస్యానావశ్యకం। అనన్వయాపత్తేశ్చ। తస్య ద్యోతకత్వేనాన్వయాపేక్షైవ నాస్తీతితు నవాచ్యమ్। సమభివ్యాహృతపదనిష్ఠశక్త్యుద్బోధకత్వం హి ద్యోతకత్వం। తచ్చప్రకృతే

అనుచితం। తదర్థస్య పృచ్ఛాయామాశ్శక్యతావచ్ఛేదకతావచ్ఛేదక విధయైవలాభేన ద్యోతకానపేక్షణాత్ । యద్వా- "యత్రాకృతి స్తత్రగుణా" ఇతి గుణాకృత్యో ర్వ్యాప్తిసంబంధావగమాత్ । తదుపలక్షితాకృతేర్గ్రహణం । అతఏవోత్తరవాక్యే సౌందర్య ప్రసంగా దాకృతివర్ణనముపయుజ్యతే । లోకాంతరీయ విష్ణువ్యా వర్తకతయాస్మి న్లోక ఇతి కాలాన్తరీయ నృసింహాద్యవతార వ్యావర్తకతయా సాంప్రతమితిచేతి మణిమంజీరమనాదరణీ యం । "జ్ఞాతుమేవం విధం నర" మితి మనుష్యావతారస్యైవ స్వజిజ్ఞాసావిషయత్వబోధనేన విష్ణువ్యావృత్తేరప్రసక్తత్వాత్ । ప్రశ్నానుగుణోత్తమపురుషాసాధారణసాముద్రికలక్షణా నా మేవ ప్రశ్నవిషయత్వావగమేన నృసింహావతారస్య భగవదవ తారత్వేపి న తద్వ్యావృత్తిసాకాంక్షా । తదవతారస్య మత్స్యకూ ర్మాద్యవతారతుల్యయోగక్షేమత్వాత్ । గుణసముదాయస్య లేశతో యత్ర కుత్రచిత్సంభవేపి గుణవానితి వ్యవహా రస్స్యాత్ । నచ మమాయమాశయః । కింత్వనన్యసాధారణ తయా వీర్యాదిగుణాశ్రయః పురుషః ప్రశ్నవిషయ ఇతి సూచ యితుం గుణవిశేషాశ్రయవాచకపదసమభివ్యాహారేణ పునః పునః కింశబ్దప్రయోగః । ఏవం చ దోషాసంబద్ధత్వే సతి వ్యక్త్యంతరాసాధారణసర్వలోకప్రసిద్ధాకృతి వీర్యాదిసకలగుణా శ్రయః కః ఇతి సముదిత ప్రశ్నతాత్పర్యమ్ । అత ఏవ । "బహవో దుర్లభాశ్చైవ యే త్వయా కీర్తితా గుణా" ఇతి వాల్మీకిప్రశ్నానువాదస్సమంజసః । యద్వా- మనోవృత్త్యాదిపరి

శీలన మంతరా మూర్తిదర్శనమాత్రేణైవ సర్వైర్గోప్యగుణవాని త్యుచ్యతే స క ఇతి ఆహో సామాన్యేన గుణవానితి ప్రశ్నతాత్ప ర్యం। వీర్యవాన్। నామార్థయో రుభయత్ర వీర్యసంపన్న ఇత్యర్థః ఏతన్నామ్న ఏవ తారకమంత్రత్వేద శాస్త్రప్రసిద్ధేః। యద్యపి శివనారాయణాదిశబ్దానామపి వీర్యవత్వేన మంత్రత్వం ప్రమాణారూఢ మేవ। తథాపి బీజవిశేషాదిఘటితతయా తేషాం మంత్రత్వం। రామనామ్న స్తు తదనపేక్ష మేవ విశిష్ట మంత్రత్వ మితి భావః। అత ఏవ, "రామేతి ద్వ్యక్షరం నామ మానభంగః పినాకిన।" ఇతి సాంప్రదాయికాః। అత ఏవ విష్ణు సహస్రనామపూర్ణసామ్యం రామనామ్న స్తచ్ఛేషగ్రంథే పార్వతీం ప్రతి శివేన ప్రతిపాదిత మితి సర్వశిష్టవిదిత మేవ। కిం బహునా। వ్యత్యయేనా ప్యుపదిశ్యమానస్యైతన్నామ్నో వీర్యవిషయే గ్రంథకర్తు రేవానుభవః ప్రమాణ మితి దిక్। వీర్యం నామ శక్తివిశేషః। ధర్మజ్ఞ ఇతి। ధర్మస్వరూపం జానా తీతి ధర్మజ్ఞ ఇత్యర్థః। "శ్రుతి శ్చ భిన్నా స్మృతయ శ్చ భిన్నాః మహామునీనాం మతయ శ్చ భిన్నాః। ధర్మస్య తత్వం నిహితం గుహాయాం మహాజనో యేన గత స్సపన్థా" ఇతి ధర్మతత్వజ్ఞా నస్య సార్వజ్ఞాయత్తత్వోక్తేః। అత ఏవ వాలివధప్రస్తావే ఆత్మాన మధర్మకారిణం మన్వానేన వాలినాక్షిప్తో రామః "సూక్ష్మః పరమదుర్జ్ఞేయ స్సతాం ధర్మ స్సనాతనః। హృదిస్థ స్సర్వభూ తానా మాత్మా వేద శుభాశుభే।" ఇత్యాదినా ధర్మస్వరూప ప్రతిపత్తే రాత్మైకాయత్తత్వం వక్ష్యతి। బహూనా మధర్మ

తయా ప్రతీయమాన స్సూక్ష్మధియా ధర్మో భవతి । ధర్మ
యా ప్రతీయమానోఽధర్మ శ్చ స్యా దితి సంకటోఽయం ధర్మ
పథః । తాదృశమపి యో జానాతి స ధర్మజ్ఞ ఇత్యాశయః ।
కృతజ్ఞః । కృతం జానాతీతి కృతజ్ఞః । ఆత్మన స్సర్వస్వామిత
యా సర్వకార్యనిర్వాహకత్వేన సర్వేషాం స్వామికార్యకారి
త్వౌచిత్యేఽపి మదర్థ మిమే క్లిశ్యన్తీ త్యాత్మవిషయే సర్వా నపి
కృతజ్ఞా నేవ మన్యత ఇతి భావః । అత ఏవ విభీషణస్వీకారవిష
యే అన్యథా మన్వానం సుగ్రీవం ప్రతి శరణాగతరక్షణస్య కపో
తాదివృత్తాంతకథనముఖేన స్వకర్తవ్యత్వే నైకమతికత్వం జాతిధ
ర్మేణ విభీషణే స్వామిద్రోహిత్వశంకయా బిభ్యత స్సుగ్రీవాదీ
న్ప్రతి "అంగుళ్యగ్రేణ లీలయా" ఇతి స్వాసాధారణశక్తిం చ
సంబోధ్యాపి స్వవిషయే సుగ్రీవస్య బహూపకారశీలత్వ మేవ ।
"మద్విధా వా పితుః పుత్రా సుహృదో వా భవద్విధాః" ఇత్యా
దినా ప్రాచీకటత్ । సత్యవాక్య ఇతి । సత్యాని వాక్యాని యస్య
స సత్యవాక్యః । వినోదకథాస్వపి సత్యపరిపాలనార్థం మితవా
క్యప్రయోక్తేత్యర్థః । అత ఏవ "సత్యాయ మితభాషిణా" మితి
రఘువంశే కాళిదాసః । సత్యవక్తృత్వమాత్రం తు న । "సత్యం
వద నానృతం వదే" దితి విధినిషేధాభ్యాం సత్యవాదిత్వస్య
పురుషమాత్రం ప్రతి ప్రవర్తనావిషయత్వబోధనేన తస్యావశ్యా
నుష్ఠేయత్వేన వ్రతాంతఃపాతితయా దృఢవ్రత ఇత్యనేనైవ
సంగ్రహాత్ । వ్రతం హి అవశ్యానుష్ఠేయత్వేన వివక్షితం కర్మ ।
తచ్చ మానసికాదిభేదేన త్రివిధ మపి గృహ్యతే । "అన్నం న ని

ద్యాత్ తద్వ్రతం । అన్నం బహుకుర్వీత తద్వ్రతం । అన్నం న పరిచక్షీత తద్వ్రత" మిత్యాదిశ్రుతిప్రామాణ్యాత్ । "అథ బ్రహ్మచారిణో వ్రత" మితి ధర్మసూత్రే వ్రతశబ్దస్య తదర్థత్వేనైవ వ్యాఖ్యానాత్ । సత్యవాదీతి వక్తవ్యే సత్యవాక్య ఇత్యుక్తేశ్చ। సిద్ధాంతే తు ప్రయోజ్యప్రయోజకభావవిధయా ధర్మద్వయస్యాపి ప్రతీత్యా నాయకోత్కర్షాత్ । చారిత్రేణ । చరిత్ర మేవ చారిత్రం । సతా మాచారః । "చారిత్రం తు సతాం వృత్త" మిత్యుక్తేః । తేన యుక్తః । "ఆచార శ్చ సతాం ధర్మ స్సన్తశ్చాచారలక్షణా" ఇతి మహాభారతే ధర్మవ్యాధోపాఖ్యానేఽభిధానేన శిష్టసంపత్తి రుక్తా । తాదృశాచార ఏవ కులాచార ఇతి తాత్పర్యం । న తు కేవలం పితృపితామహాది ప్రవృత్తిః । నిందితప్రవృత్తికతయా కులానా మేవ కేషాంచిత్ స్మృతిషు నిన్ద్యేషు పరిగణనాత్ । అత ఏవ నిన్దితస్వకులాచారం పరిత్యజ్య ఉత్తమధర్మేణ చరన్త శ్శిష్టై రంగీక్రియంతే। సర్వభూతేషు కో హితః । ఆత్మసుఖం పరిత్యజ్యాపి పరసుఖాభిలాషీత్యర్థః । దయామాత్రసార ఇతి భావః । ఏకం ముఖ్యం ప్రీతిజనకం దర్శనం యస్య స ఇత్యేకప్రియదర్శన ఇత్యర్థః । సర్వభూతాశ్రయత్వేనాస్య స్వస్వకార్యావాప్తయే సర్వేషా మాశ్రయణీయత్వేపి తన్మూర్తిసాక్షాత్కారానంతరం విజాతీయానందావాప్త్యా కార్యాన్తరవిషయకస్పృహా శామ్యతీతి భావః । "భిద్యతే హృదయగ్రన్థిః ఛిద్యన్తే సర్వసంశయాః । క్షీయన్తే చాస్య కర్మాణి

తస్మి న్దృష్టే పరావరే" ఇతి శ్రుత్యా తద్దర్శన మేవ శ్రీశ్రేః పరమకాష్ఠేతి రహస్యం। ఆత్మవాన్ । నిత్యయోగవా చ్యత్ర మతుప్ । నిత్యయోగ శ్చాత్ర సర్వదా ప్యవిస్మరణశీలత్వం। "పరాఞ్చి ఖాని వ్యతృణ త్స్వయంభూ స్తస్మా త్పరా ఙ్పశ్యతి నా న్తరాత్మ" న్నితీంద్రియవృత్తే రాత్మాభిముఖ్యప్రతిబంధకత్వ స్వాభావ్యేపి తద్వశీకరణపూర్వక మాత్మజ్ఞ తయై వావతిష్ఠత ఇతి భావః । పరత్రి శత్రుత్వబుద్ధే ర న్తశ్శత్రుమూలకతా మాకల య్యైవ ప్రవర్తత ఇతి జితక్రోధ ఇత్యు క్తం। మనసా కాయేన చ ప్రకాశత ఇతి ద్యుతిమా నితి । అనసూయక ఇతి । సత్స్వపి దో షేషు పరగుణప్రకటనైకశీల ఇతి భావః । గుణేషు సత్స్వపి దోషావిష్కరణరూప స్యాసూయాపదార్థ స్యాత్యంతనీచవృత్తి తయా తదభావస్య గుణత్వాభావా న్మధ్యమేపి సంభావ్యత్వే నో త్తమపురుషాలంకారత్వాభావాత్ సంయుగే కస్య జాతరో షస్య సతః దేవా శ్చ బిభ్య తీన్యన్వయః । యద్యపి స్వభావత ఏవాత్యన్తవీర్యవత స్తస్య శత్రుజయవిషయే న కదాపి శ్రమః। యథాగ్నేః పరదాహకత్వే । శ్రమే ఖలు రోషాదరః । యేన వీర్యోద్రేకస్స్యాత్ । తాదృశావసర ఏవ నాస్తి । తథాపి శిక్షణీ యదోషప్రాబల్యానుసారేణ రోషో జాయేత తావన్మాత్రేణా న్యై ర్యుద్ధదశాయామపి సాత్వికప్రవృత్తికతయా పూజ్యానా మపి దేవానాం దోషవశంవదత్వే వయ మప్యేవ మేవానేన దండ్యా భ వేమేతిభీతి రుదేతి । చకారోఽప్యర్థకః । కిముతాత్యన్త దుష్టానా మసురాదీనా మితిభావః । అథవా - కిమేభిర్దు

ర్బభ్రైస్సయుఃగేనేతి ణో షేణ సంయుగే నావశ్యకత్వం మన్యమానా దప్యస్మా ద్దేవాశ్చ భిభ్యతీ త్యన్వయః । వస్తుత స్సంయుగేతు నాస్య కశ్చి దపి శత్రు రస్తీతిఫలితం । "షష్ఠీ చానాదరే' ఇతిషష్ఠీ । అనాదరశ్చాత్ర రుదతః ప్రావ్రాజీ దిత్యత్రానావశ్యకత్వబుద్ధిన దన్యవిధోజ్ఞేయః । అపాదానత్వం త్వార్థికం । యుద్ధ మన్తరాజేతవ్యత్వబుద్ధి రేవేత రేషాం స్వావ శంవదత్వే హేతురితి నిష్కర్షః! అత ఏవ క్రోధస్య ప్రయోజనా భావేన క్రోధమేవాజైషీ దిత్యుక్తం ప్రాగ్జితక్రోధ ఇతి । ఏతేన కింశబ్దా త్పంచమ్యాపత్తినిరాకరణార్థం సంయుగే ఇత్యస్య భిభ్య తీ త్యనేనాన్వయపరం శేషషష్ఠ్యాశ్రయేణ కస్యేత్యస్య క్రియా న్వయపరం మణిమంజీరం పరాస్తం । సంయుగ పదాత్తు కథం తదనాపత్తి రితి తు తత్వ్రిష్టవ్యం॥

(టిప్పణీ) అత్ర సంయుగ పదాత్కథం తదనాపత్తిరితి కల్పవల్లీ- సంయుగపదస్యాధారత్వవివక్షయా సప్తమీతితు మనోరమాదా వివృతా । తత్ర సంయుగస్య యుద్ధక్రియా రూపత్వేన ఆధారత్వం దుర్నిరూపం-యది యథాకథం చిత్కాల్వ వచ్ఛేదక దేశపరత్వకల్పనతయా తత్సంరక్షణేఽపి దేవానాం విష్ణు పాల్యత్వప్రసిద్ధ్యా తత్ర్పతియోగికయుద్ధప్రసక్తే స్తేషా మసం గత్యా తద్గ్రంథాశ్యాసంగత్యాపత్తే రిత్యాద్యరుచిరితి ప్రాచీన టీకాయాంతుమనుతే కల్పవల్లికా- ఏతత్పక్షే నాయకే మహా వీరత్వధార్మికత్వాది గుణవిశేష ప్రతీతిశ్చ అస్యోత్తమకావ్యత్వం చ పుష్ణాతీతి చ సహృదయాః కలయన్తు.

తా॥ ఇప్పుడీలోకమున మిక్కిలిగుణములుగలవాడెవడు. 'గుణవాన్' అనుపదముభూమార్థమందువిధింపబడిన మతుప్ అను ప్రత్యయము చివరగలది. కావున ఎక్కువగుణములుకలవాడెవడనియే ప్రశ్నార్థము. లోకాన్తరమందుగాని, కాలాన్తరమందుగాని, గుణవంతులున్నను, వారిని నేనడుగుటలేదు అని దీనికి భావము. 'కోను' అన్నచోటనున్న 'ను' అనుశబ్దము 'ఏవ' అనుశబ్దముయొక్క అర్థముకలది. అశోకవృక్షములు హెచ్చుగ నున్నపుడు ఒకటిరెండుఇతరవృక్షములున్నను అశోకవనమే యనబడును. అటులనే అనేకగుణములున్నపుడు కొలదిగదోషములున్నను గుణవంతుడనియే చెప్పబడును. కాని 'గుణవంతుడే' అనుటచే దోషములేమియులేనివాడని తెలుపుటకై 'ను' శబ్దమునకు పైయర్థము చెప్పవలెను.

ఇట్లుగాక 'ను' అనుశబ్దము ప్రశ్నార్థకమన్నచో ప్రత్యక్షముగ ప్రశ్నను సూచించు 'కః' అను కిమ్‌శబ్దమేయుండగా నీశబ్దమును ప్రయోగింపనక్కరలేదు. ఇక 'ను' శబ్దముప్రశ్నార్థకమే యన్నచో నన్వయమునకుగూడభంగమువచ్చును.

లేదా, "ఎక్కడ సుందరమగు. ఆకారముండునో అక్కడ సద్గుణములుగూడనుండును" అనుసూక్తిచే మంచియాకృతిగలవాడెవడు ? అని ప్రశ్నార్థముకావచ్చును. కావుననే తరువాతి వాక్యములో సౌందర్యప్రసంగమున ఆకృతివర్ణనముగూడ లేకయుండును.

ఇచ్చట లోకాన్తరమన్దలి విష్ణునిగూర్చి యీప్రశ్న కాదని

తెలుపుటకు 'అస్మిన్‌లోకే' యనునదియు, కాలాంతరమందలి నృసింహాద్యవతారములనుగూర్చి కాదని తెలుపుటకు 'సాంప్రతం' అనునదియు కవిచెప్పినాడని, మణిమంజీరవ్యాఖ్యానము (గోవిందరాజీయము) నందు జెప్పబడినది. ఆవ్యాఖ్యానమాదరింపదగినదికాదు. ఏలనన "జ్ఞాతు మేవంవిధం నరం" (ఇట్టిమనుజుని తెలియగోరుచున్నాను) అను వాక్యముచే ప్రశ్నకువిషయము మనుష్యావతారమేయగుటవలన విష్ణ్వవతారమునకు ఇక్కడ ప్రశక్తియే లేదు. ప్రశ్నకు తగునట్టియు, సాధారణముగ నుత్తమపురుషులయందుండెడి సాముద్రికలక్షణములే విషయములుగాన, భగవదవతారమైనను నృసింహావతారమును గూర్చి ప్రశ్న కాదని చెప్పనవసరమును లేదు. అట్లైనచో మత్స్యకూర్మాద్యవతారములు నట్టివేగాన అవికావని చెప్పుటగూడ ప్రశ్నవిషయము కావలసినదే.

నాయభిప్రాయముమాత్రమిదికాదు. ఇతరులందుండని వీర్యాదిగుణములుగల పురుషుడే ప్రశ్నవిషయమని తెలుపుటకొరకే 'గుణవాన్' 'వీర్యవాన్' మున్నగు గుణవిశేషణములను జెప్పెడిపదములతో మాటిమాటికి 'కిం' శబ్దమును కవి చేర్చియున్నాడు. గాన, దోషములులేకుండ ఇతరవస్తువులందుండనట్టియు, సర్వలోకములందు ప్రసిద్ధిచెందిన ఆకారము వీర్యము మున్నగు సకలగుణములుగలవాడెవడని ప్రశ్నకు సముదాయతాత్పర్యము. అట్లైనచో "నీచే జెప్పబడిన గుణములన్నియు నొక్కనియందుండుట కష్టము" అను నారదవాక్య

ముగూడ ననుకూలించును. లేదా, మనోవృత్తిని పరిశీలిం పకయే ఆకృతిని జూచినమాత్రమున అందరకంటె గుణవంతు డని తెలియబడువాడెవడోయని ప్రశ్నకు తాత్పర్యమనియు జెప్పవచ్చును.

'వీర్యవాన్' నామాక్షరములందు, అర్థమునందునుగూడ, సామర్థ్యముగలవాడెవడు? రామనామము తరింపజేసెడి మంత్ర మని. శాస్త్రములలో ప్రసిద్ధికెక్కినది. 'శివ' 'నారాయణ' మున్నగు శబ్దములును వీర్యవంతములు తరింపజేయునవియు నైనను బీజాక్షరములతోగూడినపుడే వానికట్టిశక్తి సిద్ధించును. రామ నామమన్ననో అట్టిబీజాక్షరముల నపేక్షింపకయే మంత్రరాజమై వెలయుచున్నది. కనుకనే "రామ యను నీరెండక్షరములుగల నామము శివునికి మానభంగకరము." అనిసంప్రదాయజ్ఞులు చెప్పియున్నారు. "రామనామ మొక్కటియే వేయినామము లతో సరియైనది" అని పార్వతినిగూర్చి శివుడుపదేశించినాడని శిష్టులుగూడ జెప్పుదురు. పెక్కుమాటలేల? తలక్రిందుగ (మరా) పఠించినమాత్రమున ఆదికవియై వెలసిన వాల్మీకి యనుభవమే మనకీనామమందెట్టిసామర్థ్యముకలదో స్పష్టముగ దెలుపుచున్నది.

'ధర్మజ్ఞః' ధర్మస్వరూపమును బాగుగగుర్తెరింగినవా డెవడు? "శ్రుతులు భిన్నములు. స్మృతులును భిన్నములే. మహర్షులమతములంతకంటెను భిన్నములు. మహాత్ములేమార్గ ము ననుసరింతురో అదియే పొందదగిన మార్గము." అను సూక్తిచే ధర్మతత్త్వము సర్వజ్ఞునకే తెలియును. కనుకనే వాలి

వధప్రసంగమున శ్రీరాముడు తన్ను గూర్చి అధర్మము చేసినాడని వాలి నిందించినపుడు "సనాతనము, సూక్ష్మమునగు ధర్మమును తెలిసికొనుట యెరికిని శక్యము గాదు. సర్వభూతములహృదయాకాశమందున్న ఆత్మయే ధర్మాధర్మములను గుర్తెఱుగును." అని శ్రీరాముడు చెప్పిన వాక్యములచే ధర్మస్వరూపము ఆత్మకే గోచరమగును. అనేకుల కధర్మమని తోచునదియే సూక్ష్మబుద్ధిచే నాలోచింపగ ధర్మమగును. ధర్మమని తోచునది అధర్మము నగును. కావున నీధర్మమార్గము సంకటమైనది. ఇట్టిధర్మమును బాగుగ తెలిసినవాడే ధర్మజ్ఞుడని భావము.

'కృతజ్ఞః' చేసినదానిని గుర్తెరుగువా డెవడు?

ఆత్మ అందరకు ప్రభువు. సర్వప్రాణులకు ప్రభుకార్యమును జక్క-పెట్టుట తగినపనియే. అట్టితఱిని నాకొరకు వీరందరు క్లేశము నొందుచున్నారని తనవిషయమున అందరిని కృతజ్ఞులనుగా తలచువా డెవడు? అని భావము. కావుననే శరణాగతుడయిన విభీషణుని స్వీకరించుటకై సుగ్రీవుడు వేరొకవిధమున దలంచుచుండ, శ్రీరాముడు కపోతవృత్తాంతము మున్నగు నుదాహరణములచే శరణాగతరక్షణము తనకు కర్తవ్యమని దెలిపెను. రాక్షసజాతిధర్మముచే నీవిభీషణుడు స్వామిద్రోహి యగునేమోయని సుగ్రీవుడు తిరిగి భీతిలుచుండ ఆతనికి తన యసాధారణశక్తిని దెలిపియు ఆతడు తన కనేక యుపకారములచేసినాడని "తండ్రికి కుమాళ్లు ననుబోలువారును, స్నేహితులు నినుబోలువారును ......" అని తెలిపినాడు.

"సత్యవాక్యః" సత్యమైన వాక్యములు కలవా డెవఁడు? సత్యపాలనమునకై వినోదాలాపమునఁగూడ పరిమితముగ మాటలాడువాడని యర్థము. కావుననే "సత్యముకొరకు పరిమితముగ మాటలాడువారలు రఘువంశపురాజులు" అని కాళిదాసు చెప్పి యున్నాఁడు. సత్యవాక్కులు గలుగుటయే కాదు. "సత్యమును జెప్పుము. అసత్యమును జెప్పఁగూడదు" అను నీశ్రుతివాక్యములు విధినిషేధములచే సత్యమును జెప్పుట పురుషమాత్రునకి చేయదగినదని బోధించుచు, అది తప్పక చేయవలెనుగాన వ్రతముగనే యుండవలెనది. అని తెల్పుటకై 'దృఢవ్రతః' అనికూడ జెప్పబడినది.

వ్రతమనగా తప్పక చేయవలసినదిగా పేర్కొనబడు కర్మ. అది కాయికమని, వాచికమని, మానసికమని మూడువిధములుగ పేర్కొనబడుచున్నది.

"అన్నమును నిందింపఁగూడదు" అది వ్రతము. "అన్నము విశేషముగ చేయవలెను. అది వ్రతము" "అన్నమును విసర్జింపఁ గూడదు. అది వ్రతము" అను నీశ్రుతివాక్యములచే పైవిషయము దృఢమగును. "పిమ్మట బ్రహ్మచారియొక్కవ్రతము" అను ధర్మసూత్రమందలి వాక్యముకూడ నీవిషయమును స్థిరీకరించుచున్నది. "సత్యమును బలుకువాఁడు" అని చెప్పదగియుండగా "సత్యవాక్కులు గలవాఁడు" అని చెప్పుటచేఁగూడ నీయర్థమే వ్యక్తమగుచున్నది.

తా॥ 'చారిత్రేణచకోయుక్తః' సదాచారముతో గూడినవాఁడెవఁడు ? చరిత్రమే చారిత్ర మనఁబడును. చరిత్ర మనగా సత్పురుషులయాచారము. "ఆచారమన సత్పురుషధర్మము. ఆచారముగలవారే సత్పురుషులు" అను భారతమందలి ధర్మవ్యాధోపాఖ్యానవచనముచే శిష్టసంపత్తియే ఆచార మనఁబడును. అట్టియాచార మే కులాచారము. తనపితృపితామహుల నడవడి మాత్రమే ఆచారము కానేరదు. నింద్యమగు నడవడిగల పురుషులుండుటచే కొన్నికులములను స్మృతులయందు ఋషులు గర్హించినారు. కావుననే నిన్దితమైన తనకులాచారమును వదలి ఉత్తమమార్గమున ప్రవర్తించువారిని శిష్టులని అంగీకరించుచున్నారు.

'సర్వభూతేషు కో హితః' సమస్తప్రాణులయందు దయగలవాఁడెవఁడు ? తనసుఖమునైనను వదలి ఇతరులకు సుఖమును గోరువాఁడని యర్థము.

'కశ్చైకప్రియదర్శనః' ముఖ్యముగ సంతోషమును కలుగజేసెడి దర్శనముకలవాఁడెవఁడు ? సర్వభూతములకు ఆశ్రయింపదగినవాఁడగుటచే అతనిమూర్తిని గన్నతోడనే విలక్షణమగు ఆనందము కలుగును. ఆమేటనే ఇతరకార్యములందలి ఇచ్ఛ నశించును అని భావము. "ఆత్మ సాక్షాత్కారము గలిగినచో హృదయగ్రంథి భేదిల్లును. సర్వసంశయములు ఛిన్నమగును. కర్మవాసనలు క్షీణించును." అనుశ్రుతి ననుసరించి ఆతనిదర్శనమే ఆనందమునకు కడపటిసీమయని ఇందలి రహస్యము.

తా॥ 'ఆత్మవాన్' ఆత్మస్వరూపము నెన్నడును మరవని వాడెవడు? "విషయప్రవణములగు నింద్రియములను పరమాత్మ హింసించినాడు. కావున నివి బాహ్యదృష్టిగలవియే యగును అంతరాత్మను గానజాలవు." అను నుపనిషద్వాక్యముచే ఆత్మ స్వరూపానుసంధానమునకు ఇంద్రియప్రవృత్తి ప్రతిబంధక మగుట స్వాభావికమైనను, ఇంద్రియములను వశము చేసికొని ఆత్మస్వరూపము నెఱుగువాడై యుండువా డెవడని భావము.

"జితక్రోధః" ఇతరులు తనకు శత్రువు లను బుద్ధి తన యంతరంగమున శత్రువులుండుటచేత నే అని యెవడు తెలిసికొని వర్తించునో యాతడే 'జితక్రోధుడు' అనబడును. మనస్సుచే తను శరీరముచేతను ప్రకాశించెడివాడు 'ద్యుతిమాన్' (కాంతి గలవా) డనబడును. ఇట్టివా డెవడు? అని ఈరెండుప్రశ్నలకు నర్థము.

అసూయ యనగా గుణములను దోషములుగ నెంచుట యనిన నీచునియం దట్టిది హెచ్చుగ నుండును. మధ్యమునియం దది యుండదు. ఉత్తమపురుషులకు అసూయ లేకుండుట అలం కారము కానేరదు. కావున 'అనసూయకః' అను పదమునకు దోషములున్నను గుణములుగనే భావించువా డెవడని యర్థము చెప్పనొప్పును. "కస్యబిభ్యతిదేవాశ్చ" ఇత్యాది. యుద్ధమందు ఎవ నికి రోషముగలిగినచో దేవతలుగూడ భయపడుదురో అట్టివా డెవడు? సహజముగ హెచ్చుపరాక్రమము గలవానికి శత్రువు లను జయించుటలో శ్రమయుండనేరదు. అగ్నికి ఇతరులను

దహించుటలో శ్రమయుండునా? ఆయాసము గలిగినప్పుడే రోషము బయలుదేరును. రోషముచే వీర్య ముద్రేకించును. ఈతని కట్టియవకాశమే లేదు అయినను శిక్షితుల దోషము ననుసరించి, ఒకప్పుడు రోషము కలుగవచ్చును. అంతమాత్ర మున యుద్ధమునందుగూడ సాత్త్విక ప్రవృత్తిగల దేవతలును, "మనము దోషముతో గూడినవారమగుచో దండింపబడుదుము" అని భయపడుచున్నారు. మిక్కిలి దుష్టులగు రాక్షసులు భయ పడుదురని వేరే చెప్పనేల? లేదా, నీచులగు వీరితో యుద్ధము మనకేల? అని యుద్ధమున కుద్యమింపకున్నను ఎవనివలన దేవతలు భయమునొందుచునేయున్నారో? వాస్తవముగ నీతనికి శత్రు వను నాతడే లేడని ఫలితార్థము. యుద్ధముచేయకుండగనే ఇతరు లను జయింపవచ్చునను బుద్ధిగలుగుటయే ఇతరు లీతనికి స్వాధీన మగుటకు కారణము. కావున క్రోధమును గైకొనుట కవసరము లేదని తెలుపుటకే వెనుక "జితక్రోధః" అను విశేషణము గైకొనబడినది.

శ్లో॥ ఏత దిచ్ఛా మ్యహం శ్రోతుం పరం కౌతూహలం హి మే।
మహర్షే త్వం సమర్థోఽసి జ్ఞాతు మేవ విధం నరం॥

వ్యా॥ ఏతత్ - పూర్వోక్త ప్రశ్న తాత్పర్యవిషయం వస్తు రహస్యం శ్రోతు మిచ్ఛామి। అనేన గురుప్రసాదాంగభూత శుశ్రూషాసంపత్తి రుక్తా। "గురుశుశ్రూషయా విద్యా" ఇత్యు క్తేః। సతి సంభవే సిధ్య త్విచ్ఛేతి న। కిం త్వత్యంతకౌతుకా యత్తతయా తదిచ్ఛానివృత్తయే క్షణ మపి వర్ష మితం యాపయా

మీతి పరం కౌతూహల మిత్యుక్తం । నన్విచ్ఛాయాం సత్యాం తన్నివృత్తిః, విషయసిద్ధ్యా త్వయా కిమితి న కృతా । "యద్దుష్కరం యద్దురాపం యద్దుర్గం యచ్చ దుస్తరం। తత్సర్వం తపసా సాధ్యం తపో హి దురతిక్రమ" మితి సర్వస్యాపి తపస్సాధ్యత్వోక్తేరిత్యత ఆహ । మహర్షే ఇతి । త్వమేవ సమర్థః ఇత్యర్థః । న కేవల మిదం స్వకార్యసిద్ధ్యర్థం శ్లాఘోక్తిః కింతు సర్వసంశయనివృత్తయే తథా ప్రమాణీకృత స్త్వమిత్యుక్తం అసీతి । అత ఏవ మహర్షిత్వం తవ యుక్తం। మహత్త్వం చ చిరంతన తపశ్చర్యాదినా జ్ఞాతస్యాప్యర్థస్యోపదేశేన పరోపకారశీలత్వం । తచ్చ తవైవ । నేతరేషాం మునీనా మితి భావః ఏతచ్చోపపాదిత మేవ నారదశబ్దనిర్వచనసమయే ఽధస్తాత్ న తు కేవలం జ్ఞానతో ఽధికత్వం వివక్షితం । తత్సిద్ధవత్కృత్యైవ ప్రశ్నోదయాత్ । నను సత్యపి జ్ఞానవిశేషే యత్నాభావే తదుపయోగాభావః । స చ యత్నస్సమాధిరూప ఏవ సవికల్పకవిషయో ఽవసరప్రాప్త్యనుగ్రాహ్య ఇతి ద్యోతయితు జ్ఞాతు మేవం విధం నర మితి । నిర్వికల్పకస్య వాఙ్మనసాతీతయా నిదిధ్యాసాపేక్షత్వేన తతోఽపాసపర్యన్త మానుషధర్మక శ్రవణ ఏవాధికారా త్పూర్వోక్తప్రకారవిశిష్ట ముత్తమపురుషం సౌలభ్యే నోపదిశేతి భావః । యద్వా పూర్వోక్త సకలకల్యాణగుణవిశిష్ట శ్రీరామచంద్రః పరమపురుష ఇతి లోకప్రసిద్ధ్యా స్వానుభవేన చ జానతో మమ యుష్మాస్వ మహాయోగిముఖేన తద్గుణశ్రవణే కుతుక స్సాత్కృత్స్యా నానిష

శ్యతయా జ్ఞాతార్థే వక్తవ్యత్వప్రశ్నే సర్వజ్ఞస్యాపి నారదస్య విస్మృతి ర్జాయే తేతి స్వవినయవ్యంజనద్వారా నారదస్య తాదృ సుత్తమపురుషవిషయకజ్ఞానశక్తి ముద్భావయన్ స్వాపేక్షితం యాచతే । ఏత దిచ్ఛామ్యహం శ్రోతు మిత్యాదినా । స తు జ్ఞాతు మిచ్ఛామీతి । వక్తు మేవం విధం నర మితి చోక్తం । అత ఏవ శ్రూయతాం నర ఇతి చోత్తరం। లోకప్రసిద్ధోఽ య మనుభవః। యదాత్మీయోత్కటరాగాదివిషయే కాన్తాపుత్రాదా గుణవిశేషాతిశయ మనుభవేన జ్ఞాత్వా ప్యన్యేన చతురవాక్యేన పునః పున రోచ్యమానం శ్రావం శ్రావం స్త్రీపుంసాది రానం దాబ్ధౌ మజ్జతీతి । కిం పున రాసేచనకే సకలకల్యాణగుభాజనే పురుషోత్తమే భక్తిభరితాంతఃకరణో వాల్మీకిమునిః । ఏతేన "ఇతి సీతా చ రామ శ్చ లక్ష్మణ శ్చ కృతాంజలిః । అభిగ మ్యాశ్రమం సర్వే వాల్మీకి మభివాదయన్"॥ ఇత్యయోధ్యా కాండవచనేన । "విషయే తే మహారాజ రామవ్యసనకర్శితాః । అపి వృక్షాః పరిమ్లానా సపుష్పాంకురకోరకాః"॥ ఇతి । "రామో రామో రామ ఇతి ప్రజానా మభవ న్కథాః । రామభూతం జగదభూ ద్రామే రాజ్యం ప్రశాసతి"॥ ఇత్యాది వచనజాతై శ్చ రామవైభవస్య సర్వవిదితత్వప్రాప్తౌ వాల్మీకే స్తదంశే అజ్ఞానం కథం । కథం వా నారదం ప్రతి ఏతన్మాత్ర ప్రశ్న శ్చేత్యాశంక్య శ్రుతిప్రసిద్ధేషు బ్రహ్మవిష్ణురుద్రాదిషు కస్య వా పరత్వం ఇతి ప్రశ్నతాత్పర్యం । రామత్వే నావతీర్ణో విష్ణు రేవ పరత్వేనా నిత్యుత్తరవాక్యస్య తాత్పర్య మితి చ

ప్రశ్నోత్తరవాక్య తాత్పర్యవర్ణనపరం మణిమంజీరం శబ్దత స్వ సుందర మితి వేదితవ్యం। అస్మదుక్తరీత్యా ప్రశ్నోత్తరవాక్య తాత్పర్యసామంజస్యే తాత్పర్యాన్తరకల్పనస్యాపాండిత్య మూల కత్వాత్। ప్రశ్నోత్తరవాక్యేషు పరత్వస్ఫోరకపదన్యాస స్యాభా వాచ్చ। దేవతాంతర నిన్దాయా మేవ తదాశయప్రతీత్యా విద్వన్మాత్రగ్రాహ్యత్వాసాపత్తేశ్చ॥

తా॥ 'ఏతదిచ్ఛామ్యహం శ్రోతుం' పూర్వమందడుగబడిన ప్రశ్నకు సమాధానమైన రహస్యమును నేను వినగోరుచు న్నాను. ఈవాక్యముచే గురువుయొక్క యనుగ్రహమునకు సాధనమైన శుశ్రూషాసంపత్తి (వినయముతో గురువును సేవిం చుట) శిష్యునియందు కలదని చెప్పబడినది. పెద్దలుకూడ గురు శుశ్రూషచేతనే విద్య లభించునని చెప్పినారు.

'పరం కౌతూహలం హి మే' ఈరహస్యమును దెలిసికొను టకు నాకు ఎక్కుడు కుతూహలము గలదు. ఐచ్ఛికముగ లభిం చినచో విద్య లభించుగాక యను నూహ నాకు లేదు. మిక్కిలి కుతూహలముతో గూడి, నీవలన జ్ఞానోపదేశమును బొందని క్షణమును వత్సరముగ గడుపుచుంటినని తెలుపుటకే యిట్లు చెప్పినాను. ఇట్టి ప్రబలమైన యిచ్ఛయే నీకున్నచో తపోబల ముచే నీకట్టిసామర్థ్యము కలిగియే యుండవచ్చును. ఈవిషయ మును నీవేల గుర్తింపలేవు. అను నారదుని ప్రశ్నకవకాశము లేకుండ 'మహర్షే' అని సంబోధించినాడు "ఏది చేయ నశ క్యమో, ఏదిపొంద నశక్యమో, ఏదిపోవ నశక్యమో, ఏది దాట

నశక్యమో, అట్టివాని నన్నిటిని తపస్సుచే సాధింపవచ్చును. తపస్సును సాధించుట యేరికిని శక్యముగాదు” అను నారోక్తిచే మహాతపస్సంపన్నుడే జ్ఞానము నుపదేశించుట కర్హుడు. నారదు డట్టిమహర్షి యని యీపదము వ్యక్తము చేయుచున్నది.

'త్వం సమర్థోఽసి' నీవే సమర్థుడవు. వాల్మీకి తనకార్యమును సిద్ధింపజేసికొనుట కిట్లు శ్లాఘించియుండలేదు. సర్వవిధ సంశయములను తొలగించుకొనుటకు పైవిధముగ నమ్మియున్నాడని ఇచ్చటి 'అసి' యను క్రియాపదము తెలుపుచున్నది. చిరకాలము తపస్సుచేసి తెలిసికొనిన విషయమును ఇతరుల కుపదేశించెడి స్వభావముగలుగుటయే ఋషియందలి మహత్వము. (గొప్పతనము.) అదియు నీకే గలదు. ఇతరులకు లేదనియు భావము. నారదశబ్దమునకు అర్థమును వివరించునపుడీవిషయము తెలుపబడియే యున్నది.

ఇక్కడ జ్ఞానముచే గొప్పవాడనుటయే విషయము కాదు. ఆవిషయము తెలిసినపిమ్మటనే ప్రశ్న జనించినది గాన జ్ఞానవిశేష మున్నను సమాధిరూపమగు యత్నము లేనిచో దానియుపయోగ ముండదు. అట్టిసమాధిని సవికల్పకమునే స్వీకరించి తన్ననుగ్రహింపదగునని తెలుపుటకే “జ్ఞాతుమేవం విధం నరమ్” అని చెప్పినాడు. నిర్వికల్పకస్వరూపము వాక్కునకుగాని, మనస్సునకుగాని, గోచరించునది గాదు. అయ్యది నిదిధ్యాసాపేక్షతో గూడినది గాన, దానిసోపానమువరకు వెడల దలచిన నాకు శ్రవణమందే అధికారము కలదు. కావున

పూర్వోక్తవిశేషణములతో గూడిన యుత్తమపురుషుని సులభ
ముగ నుపదేశింపుమని భావము.

లేదా, సమస్తకల్యాణములతోగూడిన శ్రీరామచంద్రుడు
పరమపురుషుడని లోకప్రసిద్ధినిబట్టియు స్వానుభవమువల్లను
గుర్తెరిగిన నాకు మహాయోగులగు తనువలన వానిగుణములను
వినుటకై యెక్కువ కుతూహలము గలదని తెలిసినవిషయమును
గూర్చియే వాల్మీకి ప్రశ్నించినపుడు, సర్వజ్ఞుడగు నారదునకు
గూడ వికారము పుట్టవచ్చునని తనవినయమును ప్రకటించుచు,
నారదు డట్టియుత్తమపురుషులనుగూర్చి బాగుగ నెఱిగినవాడని
తోపింపజేయుచు, తన కవసరమగు విషయమును ప్రార్థించుచు
న్నాడు. ఇదియే "ఏత దిచ్ఛామ్యహం శ్రోతుం" అనుదానికి అర్థ
ము. వినగోరుచున్నాను; గాని తెలిసికొనగోరుటలేదు అని భావ
ము. కావుననే "ఇట్టి నరుని చెప్పుము" అని అడుగుటయు "ఆపురు
షునిగురించి వినుము" అను సమాధానమును పొసగును.

లోకమం దీయనుభవము ప్రసిద్ధముగ నున్నది. తనకు
మిక్కిలి ప్రేమాస్పదులగు దారపుత్రాదులయందలి గుణవిశే
షములను తా ననుభవముచే బాగుగ దెలిసికొనియు, స్నేహి
యగు మఱియొకడు వానిని పేర్కొనుచుండ మాటిమాటి
వినుచు స్త్రీపురుషు లిద్దరును ఆనందసముద్రమున మునుగుచుం
దురు. పరమానందము నొసగువాడు, సమస్తకల్యాణగుణాస్ప
దుడు, పురుషోత్తముడు నగు శ్రీరామునియందు భక్తిభరితాంత
రంగుడగు వాల్మీకి, ఆనందమున మునుగునని వేరే చెప్పనేల!

"సీత, శ్రీరాముఁడు లక్ష్మణుఁడును దోసిలలొగ్గి, వాల్మీకి యాశ్రమమును బ్రవేశించి, యాతని నమస్కరించి" అని అయోధ్యాకాండమునందు జెప్పుటచేతను, "రాముఁడు రాజ్యమును పాలించుచుండ ప్రజల ప్రసంగము లన్నియు, రామ, రామ, రామ, యనియే యగుచుండెడివి. జగత్తంతయు రామమయ మాయెను" ఇత్యాదివచనములచేతను, రాముని వైభవము నందఱు నెరిగియుండ వాల్మీకి యెరుగకపోవు టెట్లు? ఇంతమాత్రమున నారదుని ప్రశ్నించు టెట్లు? అని యాశంకించి, శ్రుతి ప్రసిద్ధులగు బ్రహ్మవిష్ణుమహేశ్వరులలో పరతత్వ మెవరు? అను నదియే ప్రశ్నకు తాత్పర్యము. రాముఁడై యవతరించిన విష్ణువే పరతత్వమని సమాధానవాక్యమునకు తాత్పర్యము. ఈరీతిగ ప్రశ్నోత్తరములకు తాత్పర్యమును వర్ణించిన మణిమంజీరవ్యాఖ్యానము శబ్దసౌందర్యముతోఁగూడినదియే యని యెఱుగనగును. ప్రశ్నవాక్యములందుగాని, ప్రత్యుత్తరవాక్యములందుగాని, పరతత్వమును స్పృశించు పదమే లేదు. కావున, అట్టివ్యాఖ్యానము కేవలము ఇతరదేవతల నిందించుటకొరకే పరిణమించును. విద్వాంసులు గ్రహించుటకు ఎంతమాత్రము తగియుండదు.

శ్లో॥ శ్రుత్వా చైతత్త్రిలోకజ్ఞో వాల్మీకే ర్నారదో వచః ।
శ్రూయతా మితి చామంత్ర్య ప్రహృష్టో వాక్య మబ్రవీత్ ॥

వ్యా॥ శ్రుత్వా- త్రిలోకజ్ఞః- ఇత్యనేన వాల్మీకివాక్యశ్రవణానంతరం సమాధిబలేన లోకత్రయవృత్తాంతం జ్ఞాత్వేత్యర్థ స్సిద్ధ్యతి । వాల్మీకిప్రశ్నస్య భూలోకవర్తిమనుష్యవిషయ

కత్వనిశ్చయేఽపి నిరుక్తగుణసంపత్తే స్తత్రాసంభవం పర్యాలో చ్యా ఽసంభవ దర్థకప్రశ్నస్య శశవిషాణప్రశ్నతుల్యత్వే నోపే క్షణీయత్వేఽపి నాయం శశవిషాణప్రశ్నః । కింతు వాల్మీకిక్కృ త్వేన వస్తుసత్తానిబంధన ఏవేతి తదనుకూలాంశపూరణార్థ ప్రత్యక్షీకృత సర్వలోకవృత్తాంత ఇతి భావః । గురో శ్శిష్యా పేక్ష యాధికత్వేపి శిష్యశక్త్యనురోధేన తజ్జిజ్ఞాసితపూరణాయ యత్నవిశేషాశ్రయణ ముచిత మితి తాత్పర్యం । 'శ్రూయతా మితి । సమాధిబలేన ప్రశ్నానుకూలవస్తు జ్ఞాత్వా తద్బోధన దృఢయత్నోఽహం । త్వ మేవ తచ్ఛ్రవణే యత్న మాతిష్ఠే భావః । యద్వా- వివక్షితగుణశ్రవణే వాల్మీకేః కౌతుకాతి శయ ముద్భావ్య తద్గుణకథాప్రసంగే ఽస్య పారవశ్యం స్యాత్ తథా చ- స్వభాషితస్యాకాశభాషితప్రాయతా స్యాత్! తన్మా భూదిత్యాదరేణ వాల్మీకిం స్వవాక్యార్థ గ్రహణైకాగ్రచిత్త విధాతు మితి భావః। ప్రహృష్టః-న మమాయం శిష్యనిర్బంధః కింతు మదీప్సిత ఏవ భగవత్కథాప్రసంగ స్సచ్ఛిష్యప్రశ్నవ్యా జేన దైవవశా త్సంపన్న ఇతి హర్షాతిశయః।

తా॥ "శ్రుత్వా- త్రిలోకజ్ఞః" వాల్మీకి చెప్పిన వాక్యము లను విని, సమాధిబలముచే లోకత్రయవృత్తాంతములను తెలిసి కొని, అని యర్థము. వాల్మీకి చేసిన ప్రశ్న భూలోకమందలి మను ష్యులనుగూర్చియే యనునిశ్చయము నారదునకు గలదు. లోక మందలిమనుజుల కిట్టిగుణసంపత్తి యుండనేరదు. ఎన్నటికిని సంభవించని విషయమునుగూర్చినప్రశ్న, చెవలపిల్లికి కొమ్ము

లెన్ని ? అను ప్రశ్నతో తుల్యముగాన ఉపేక్షింపవగినదియే. కాని ఈప్రశ్న అట్టిది కాదు. వాల్మీకి ప్రశ్న చేసినాడు గాన దీనియందు వాస్తవ ముండియుండవలెను. అను యూహచే ఆప్రశ్నకు తగు నట్టి సమాధానము చెప్పుటకు ముల్లోకములయందలి వృత్తాంత మును ప్రత్యక్షము చేసికొనినాడని భావము. శిష్యునికంటె గురువు గొప్పవాడైనను, శిష్యునిశక్తికి తగునట్లుగనే ఆతడడిగిన విషయమును దెలుపుటకు యత్నింపవలయునని తాత్పర్యము.

'శ్రూయతామ్' సమాధిబలముచే ప్రశ్న కనుకూల మగు వస్తువును దెలిసికొని దానిని తెలుపుటకై నేను దృఢ ప్రయత్నముతో నున్నాడను. నీవే దానిని వినుటకై తగిన యత్నములో నుండుము. అని భావము. లేదా, కోరినపురుషుని గుణములను వినుటకై వాల్మీకికున్న ఆదరాతిశయము నూ హించి, ఆగుణములను చెప్ప మొదలిడినచో నీతనికి పారవ శ్యము గలుగును. అప్పుడు తాను చెప్పునదంతయు ఆకాశభాషి తముతో తుల్యమగును. అట్లు కాకుండుటకై నారదుడు వాల్మీ కిని తాను చెప్పబోవు వాక్యార్థములను గ్రహించుటలో నిశ్చల చిత్తముగలవానినిగా జేయుటకొరకు, అని భావము. 'ప్రహృష్టః' నాకిది శిష్యనిర్బంధము కాదు. కాని శిష్యునిప్రశ్నయను వ్యాజ ముచే నాకిష్టమగు భగవత్కథాప్రసంగము దైవవశమున సంప్రాప్తించినదని నారదుడు హర్షాతిశయముకలవాడై, ఈరీతిగ చెప్ప మొదలిడెనని భావము.

శ్లో॥ బహవో దుర్లభాశ్చైవ యే త్వయాకీర్తితా గుణాః।
మునే వక్ష్యామ్యహం బుద్ధ్వా తైర్యుక్తశ్శ్రూయతాం నరః॥

వ్యా॥ సామాన్య విశేషాకారేణ బహుత్వద్దుర్లభత్వే గుణానాం త్వత్ప్రశ్న వాక్యేన పరిగృహీతే। అత స్తత్సామానాధికరణ్యం వస్తువిశేషే నిశ్చిత్య వక్ష్యామి। తాదృశగుణ విశిష్టపురుషకథాశ్రవణం శ్రేయోర్థినాం సర్వేషాం మయా విహితమిత్యర్థః। శ్రూయతామితి। విధ్యర్థే లోట్। అత్రశ్రూయతామితి పూర్వోక్తేన నాస్య పౌనరుక్త్యం। కర్మభేదా త్ప్రవృత్తిభేదాద్వా నపౌనరుక్త్య మితి న। ఉభయత్రాపి విశిష్ట స్యశ్రుతే రేవం చోద్యత్వేన కీత్యంతరకల్పనాయా ఆవశ్యకత్వాత్। ఏకాదశీవ్రతాదివదయం రామాయణ శ్రవణ విధి ర్నిత్యకామ్య ఇతి సిద్ధం। అతఏవాన్తే "పఠన్ ద్విజో వాగృషభత్వమీయాత్" ఇత్యనుశాస్తి। తైర్యుక్తో నర ఇత్యనేన తద్గుణయోగో నరత్వావస్థాయామేవ। నతు పరమార్థభూతే వస్తునీతి ద్యోతయతి। అత ఏవబుద్ధ్వా వక్ష్యామీతి స్వరసతస్సంగచ్ఛతే। అన్యథా గుణసంబంధస్య వాస్తవికత్వే తాదృశవస్తునో ఝటితి బుద్ధ్యారోహేణ ప్రశ్నవాక్య శ్రవణా వ్యవహితోత్తర మేవోత్తరమారభ్యేత। నతు కాల విలంబాపేక్షా। ఏతేన యుక్త ఇతి విశేషణేన నిర్గుణవాదనిరాస ఇతి (మణిమంజీర) మహాస్త్రం॥

తా॥ 'బహవో దుర్లభాశ్చైవ' ప్రశ్న వాక్యములో పేర్కొనబడిన గుణములు సామాన్యరూపముచే బహుత్వము (హెచ్చు)తో గూడినవి. విశేషరూపముచే దుర్లభములు

కనుక నీ రెండింటికి సామానాధికరణ్యము (ఒక చోటనుండుట)ను నిశ్చయించి చెప్పుచున్నాను. అట్టి గుణములతో గూడిన పురుషుని కథా శ్రవణము నాచే చేయబడినదని యర్థము. 'శ్రూయతాం' అనునది విధ్యర్థమందు విధింపబడిన 'లోట్' అను ప్రత్యయముతో గూడినది. కావున వెనుకటి శ్లోకమందలి 'శ్రూయతాం' అనుదానితో విరోధము లేదు. ఈ క్రియకు కర్మలు వేరగుటచే గాని, తాత్పర్యభేదముచే గాని, పౌనరుక్త్యము (చెప్పినదానినే తిరిగి చెప్పుట) లేదనుట తగదు. రెండు స్థలములలోను విశిష్టనర శ్రవణమే విషయముగాన వేరొక కృతిని కల్పించుట ఆవశ్యకమే.

దీనిచే ఏకాదశీవ్రతాదికమువలె ఈ రామాయణముగూడ నిత్యకామ్యమైన విధియని తెలుచున్నది. కనుకనే ఈ గ్రంథాంతమున "రామాయణమును పఠించు ద్విజుడు వాక్యాన కధిపతి యగును" అని శాసించుచున్నాడు. 'త్రైర్యుక్తః' (వానితో గూడినవాడు) అనుటచే ఇట్టి గుణములతో గూడుట మనుజుడైనప్పుడే సంభవించును, పరమార్థభూతమగు వస్తువునందు సంభవించదు అని తెలుపుచున్నాడు. కావున "తెలిసికొని చెప్పుచున్నాను" అనువాక్యము సరసముగ సంబంధించుచున్నది. లేనిచో గుణసంబంధము వాస్తవమే మైనచో, అట్టివస్తువు శీఘ్రముగ బుద్ధికి గోచరమగును గాన, ప్రశ్నవాక్యమును వినినతోడనే ప్రత్యుత్తర మొసగ నారంభించెడిని. కాలవిలంబమున కవసరమే యుండదు.

పైనుదహరించిన విషయముల చేతను "యుక్తః" అను విశేషణముచేతను 'నిర్గుణవాదము పోగొట్టబడినది" అని చెప్పిన 'మణిమంజీర' మనువ్యాఖ్యానము తిరస్కరింపబడినదని తెలియుచున్నది.

శ్లో॥ ఇక్ష్వాకువంశ ప్రభవో రామో నామ జనైశ్శ్రుతః।
నియతాత్మా మహావీర్యో ద్యుతిమాన్ ధృతిమాన్వశీ।
బుద్ధిమా న్నీతిమాన్వాగ్మీ శ్రీమాంఛత్రు నిబర్హణః॥

వ్యా॥ మనుచంద్ర కుబేరాదీనాం పంచదశ్యుద్ధారక యా శాస్త్రప్రసిద్ధేర్మ హోపాసనా ఫలత్వేన లోకప్రసిద్ధో యదిక్ష్వాకు రజని। తథా లోకపాలనార్థం తత్కూటస్థోపాస్య త్రిపుర సుందర్యా ఏవావతారోఽయం రామ ఇతి సూచయతి। 'ఇక్ష్వాకు వంశప్రభవ' ఇతి సమష్టిపాలకత్వేన విష్ణుఃఇతి వ్యష్టిపాలకత్వేన రామాదిరితి భేదః। ఏవంచ విష్ణ్వవతారత్వేఽపి రామస్యన పురాణవైషమ్యం। ఉత్పత్తి ప్రభృతి గుణాకృత్యాదినా సర్వ గమనీయత్వా ద్రామో నామేత్యుక్తం। జనైశ్శ్రుతః। భేర్యాది శబ్దవత్ శతపత్రసూచీభేదవద్వా తదుత్పత్త్యవ్యధానేనైవ యుగ పదేవ సర్వజనశ్రుతివిషయ ఇత్యర్థః। అనేనాస్య సర్వలోకాతి శాయి మహిమాస్పదత్వం సూచ్యతే। నియతాత్మేతి। బాల్యేపి చాపలరహిత ఇత్యర్థః॥ వాగ్మీ- బహ్వపి సమ్యగ్భాషత ఇత్యర్థః। సమ్యక్త్వంచ। శ్రోతృ హృదయరంజకత్వే సతి శాస్త్ర సమ్మతత్వం। "వాచోగ్మినిః" ఇతిగ్మినిః। అనునాసిక నివృత్త్యర్థం ప్రత్యయే గకారః। శ్రీమాన్। అగర్భం శ్రీసంపన్న ఇత్యర్థః।

తథాపి కామాదిశత్రునాశక ఇతి శత్రు నిబర్హణ ఇత్యుక్తం। ఏవం మహాపురుషాసాధారణ నియతాత్మత్వాది శత్రునాశ నాంతం గుణదశకం బహుత్వోపలక్షణం ప్రథమ ముక్త్వా, తా దృశ గుణసామానాధికరణం ఆకృతిస్తావమాహ। 'విపులాంస' ఇత్యారభ్య 'శుభలక్షణ' ఇత్యేతదంతం॥

తా॥ మనువు, చంద్రుడు, కుబేరుడు, మున్నగువారలు పంచదశ్యుద్ధారకులుగా శాస్త్రప్రసిద్ధి యుండుటవలన మనూ పాసనకు ఫలముగ ఇక్ష్వాకుడేరీతిగ జనించినో, ఆరీతిగనే లోక పాలనకొరకు ఆకూటస్థుని-యుపాస్యదేవతయగు త్రిపురసుందరి యొక్క- అవతారమై శ్రీరాముడు జనించినాడని సూచించి నాడు; "ఇక్ష్వాకువంశప్రభవః" అనుటచే, సమష్టిపాలకుడగు టచే విష్ణువనియు, వ్యష్టిపాలకుడగుటచే రాముడు మున్నగు వారనియు, విష్ణురామాదులకు భేదము చెప్పబడినది కావున శ్రీరాముడు విష్ణ్వవతారస్వరూపుడనినను పురాణవాక్యములకు విరోధ ముండదు.

పుట్టినది మొదలుగ గుణములచేతను, ఆకృతిచేతను, అందఱకు పొందదగినవాడని తెలుపుటకు "రామోనామ" అని చెప్పినాడు. "జనైశ్శ్రుతః" జనులచే వినబడినాడు. భేరీ శబ్దమువలెగాని, శతపత్రసూచీభేదమువలెగాని, ఆతడు పుట్టిన తోడనే జనులందరు ఆతని జననవార్తను వినినారని యర్థము. దీనిచే నీతడు సర్వలోకముల నతిశయించెడి మహిమగలవాడని

సూచింపబడుచున్నది. 'నియతాత్మా' బాల్యమునందును చాప
ల్యము లేనివాడు,

తా॥ 'వాగ్మీ' విశేషముగ మాటాడినను లెస్స
మాటాడువాడు. అనగా వినువారికి హృదయరంజకముగను,
శాస్త్రసమ్మతముగను, మాటాడువాడని భావము. 'శ్రీమాన్'
అగర్భశ్రీమంతుడు అయినను కామాదిశత్రువుల నణచినవా
డని తెలుపుటకు 'శత్రునిబర్హణః' (అంతశ్శత్రువులను నిర్మూ
లించినవాడు) అని చెప్పినాడు.

ఈరీతిగ 'నియతాత్మా' అనునది మొదలు "శత్రుని
ర్హణః" అనునంతవరకు బహుత్వము సూచించు పదిగుణము
లనుజెప్పి, అట్టిగుణములతోపాటు ఆకారసౌష్ఠవమునుగూడ
'విపులాంసః' అనునది మొదలు 'శుభలక్షణః' అనునంతవరకు
పేర్కొనుచున్నాడు.

శ్లో॥ యశస్వీ జ్ఞానసంపన్నశ్శుచిర్వశ్యస్సమాధిమాన్॥

వ్యా॥ యశస్వీ। "యశోజనే సానిస్వాహా" ఇత్యాది
నా యశస్కామీత్యర్థః। లోకాపవాదభీత్యా ధర్మార్థకామేషు
ప్రవర్తతే ఇతిభావః। అతఏవ। "నాహమర్థపరోదేవి లోక
మావస్తుముత్సహే"। ఇతి వక్ష్యతి। "దేశే దేశే కళత్రాణి
దేశే దేశేచ బాంధవాః। తంతు దేశం నపశ్యామి యత్ర
భ్రాతా సహోదరః" ఇతి లక్ష్మణమూర్ఛాదశాయాం
స్వసేవార్థమాగతస్య సోదరస్య ప్రాణసంకటముద్భావ్య పత్నీ
లోపేఽపి సోదరరక్షణం కర్తవ్యం। తచ్చమయా నకృతం। కింతు

వృత్యుయేన కృత మతో౽హం లోకాపవాదభాజన మభవమితి స్వచింతా మావిష్కరోతి। జ్ఞానసంపన్నః। తత్త్వ విదిత్యర్థః। శుచిః-తథాపి శాస్త్రానుసారేణ సదాచార ఇత్యర్థః। నచైతా దృశ స్సర్వసులభో నేత్యాహ। వశ్య ఇతి-వశంగత ఇతి-సర్వే షామ ప్యాత్మీయత్వ త్సులభ ఇతి భావః-నచాస్య తథాత్వే సర్వే షామపి మనఃప్రదత్వేన లాఘవం భవేదిత్యాహ। సమాధిమా నితి-చిత్తైకాగ్ర్యవానిత్యర్థః-తథాచ పరత్ర గుణానురోధేనైవ స్వచిత్తం పరత్రార్పయతీతి భావః॥

తా॥ యశస్వీ 'లోకములో కీర్తినొందెదను గాక" అను శ్రుతివాక్యమునేతిని యశస్సును గోరువాడని యర్థము. లోకాప వాదభయముచే ధర్మార్థకామములందు ప్రవర్తించువాడని భావము. కావుననే 'దేవి! నేసర్థపరుడను కాను. లోకక్షేమము నుత్సహించుచున్నాను" అని చెప్పుచున్నాడు.

"ప్రతిదేశమందు భార్యలు గలరు. ప్రతిదేశమందు బంధు వులును గలరు. ఏకోదరుడగు నాతమ్ముడుగల దేశమును మాత్రము చూడజాలనైతిని" అని శ్రీరాముడు లక్ష్మణుడు మూర్ఛనొందినసమయమున, తనసేవకొరకు తనతోగూడ వచ్చిన లక్ష్మణుని ప్రాణసంకటావస్థ నూహించి, "భార్యకోపించినను తమ్ముని రక్షింపవలెను. అది నేను చేయనైతిని. దీనికి తారు మారుగ జేసితిని. ఇక నేను లోకాపవాదకు పాత్రుడనైతిని" అని తనవ్యాకులతను ప్రకటించినాడు.

"జ్ఞానసంపన్నః" తత్త్వవేత్త, ఐనను 'శుచిః' శాస్త్రాను గుణమగు సదాచారముతో గూడినవాడు, అని యర్థము. జ్ఞాని వాడు అందఱకు సులభుడు కాడనసక్కర లేదు. "వశ్యః" వశము నొందినవాడు. అందరకు తనవారివలె సులభుడని భావము. అట్టివాడగుచో నందరకు తనహృదయమును దెలిపి లాఘవ మును (చులకతనమును) పొందునేమో యనరాదు. "సమాధి మాన్" చిత్తైకాగ్రతగలవాడు. ఎంతటివానిచిత్తము నెరిగియు తనహృదయమును దెలుపునని భావము.

శ్లో॥ ప్రజాపతి సమశ్శ్రీమాన్ ధాతా రిపునిషూదనః॥

వ్యా॥ ప్రజాపతి సమ ఇతి-విచిత్రవస్తు నిర్మాణసమర్థ ఇత్యర్థః - శ్రీమాన్ధాతేతి-సర్వజనపోషణానుకూల శ్రీయుక్త ఇత్యర్థః-స్వజనమేవ కశ్చిద్రక్షేత్ -నత్వితరం మహాన్తమపి కిముత సాధారణజీవవర్గం! కశ్చిత్పరో జ్జీవకోఽపి స్వజనం నమా యతి। ద్వయంచేద మేకత్రాసంభావితం-అయంతూభయత్రాపి సమబుద్ధిరిత్యాహ- "రక్షితా జీవలోకస్య ధర్మస్య పరిరక్షితా" ఇతి। ఆచరణప్రచారణాభ్యాం స్వధర్మపరధర్మానుపాలక ఇత్యుక్తం। "రక్షితాస్వస్య ధర్మస్య స్వజనస్యచరక్షితా" ఇతి।

తా॥ "ప్రజాపతిసమః" విచిత్రమగువస్తువులను నిర్మిం చుటకు సమర్థుడు. "శ్రీమాన్ ధాతా" సను స్తజనులనుపోషిం చుటకు సమర్థమగు సంపత్తుతో గూడినవాడు.

ఒకడు తనవారినే రక్షించును. గొప్పవానినైనను ఇత రుని రక్షింపడు. కాన సాధారణమనుష్యులను రక్షింపడని చెప్ప

నేల. మఱియొకఁడు ఇతరులనురక్షించినను తనవారి నుపేక్షిం చును. రెండును ఒకనియందుండుట సంభవించదు. "ఈతడన్నో ఉభయులయందు సమబుద్ధిగలవాఁడే. ప్రాణిసమూహమును రక్షించెడివాఁడు, ధర్మమును రక్షించెడివాఁడును" అనుటచే దెలియుచున్నది. ఆచరణప్రచారములచే తనధర్మమును ఇతరు లధర్మమునుగూడ పరిపాలించువాఁడు అనుటకై "తనధర్మమును రక్షించువాఁడు, స్వజనమును రక్షించువాఁడును'' అని చెప్పి నాఁడు.

శ్లో॥ వేదవేదాంగ తత్త్వజ్ఞో ధనుర్వేదే చ నిష్ఠితః।
సర్వశాస్త్రార్థ తత్త్వజ్ఞః స్మృతిమాన్ ప్రతిభానవాన్॥

వ్యా॥ వేదవేదాంగ తత్త్వజ్ఞః - యథాక్రమం సాంగ వేదాధ్యయనం తత్తత్త్వనిష్ఠా పర్యన్తం కృతవానిత్యర్థః-అపఏవ "పురాకల్ప ఏతదాసీత్-సంస్కారోత్తరకాలం బ్రాహ్మణావ్యా కరణం స్మాధీయతే-తతచ్ఛందాంసీ"తి పతంజలిః। క్రమాధ్యయ నం బభాషే। ఋగాదయో వేదాశ్చత్వారః-శిక్షాదీన్యంగా నీతి సువిదిత మేవ।అనంతరముపవేదానప్యధ్యైష్టేత్యాహ- ధనుర్వేదే చ నిష్ఠిత ఇతి-స్వజాతిధర్మతయా తస్య ప్రాథమ్యోక్తిః। తత స్సాంఖ్యయోగతర్కవైశేషికాది షట్ఛాస్త్రాధ్యేతా। అధీత సకలవిద్యావిషయక స్ఫూర్తిః స్మృతిః-సత్యవసరేఽపూర్వార్థ కల్పనాపాండిత్యం ప్రతిభానం॥

తా॥ "వేదవేదాఙ్గతత్త్వజ్ఞః" తత్త్వనిష్ఠ గల్గునంతవరకు యథాక్రమముగ అంగములతోఁగూడిన వేదముల నభ్యసించిన

వాడు. కావుననే "పూర్వకల్పమున బ్రాహ్మణులు ఉపనయన సంస్కారానంతరము వ్యాకరణము పఠించి, పిమ్మట ఛందస్సులను చదివెడివారు" అని మహాభాష్యమున పతంజలిమహర్షి దెలిపినాడు. ఇదియే యథాక్రమమైన అధ్యయనము. ఋగ్యజుస్సామాథర్వణములు నాలుగు వేదములు. శిక్ష, వ్యాకరణము, ఛందస్సు, నిరుక్తము, జ్యోతిషము, కల్పము, అను అంగములు ప్రసిద్ధములే. ఉపవేదములను గూడ చదివెనని దెలుపుటకు 'ధనుర్వేదేచనిష్ఠితః' అని చెప్పినాడు. స్వజాతిధర్మమగుటచే తొలుత ధనుర్వేదమునే చదివినాడు. పిమ్మట సాంఖ్యము, యోగము, తర్కము, వైశేషికము, మున్నగు శాస్త్రములను జదివినవాడు.

"స్మృతిమాన్" చదివినవిద్యలన్నిటియొక్క స్ఫూర్తితో గూడినవాడు. "ప్రతిభానవాన్" సమయమువచ్చినపుడు అపూర్వవిషయములను కల్పించు పాండిత్యముగలవాడు.

శ్లో॥ సర్వలోక ప్రియస్సాధు రదీనాత్మా విచక్షణః।

వ్యా॥ "దేవాన్భావయతా నేన తే దేవా భావయన్తువః। పరస్పరం భావయన్తశ్శ్రేయః పరమవాప్స్యథ" ఇతి దేవమనుష్యాదీనా మన్యోన్యోపకృతి ప్రయోజక కృత్యోపయికతయా సర్వలోకప్రియత్వమిత్యాహ్యాం। నచైతావదేవ-కింతు। "ప్రియప్రాయా వృత్తిర్వినయమస్రృణోవాచి నియమః। ప్రకృత్యా కల్యాణీ మతిరనవగీతః పరిచయః"। ఇత్యాది లక్షణ లక్షితసజ్జనత్వవాం శ్చేత్యాహ। సాధురితి- అదీనాత్మా- ఆపద్వ

శేనాస్య రక్షణీయత్వ దశాపత్తిర్హి దైన్యం-తచ్ఛూన్యస్వభావ ఇత్యర్థః-"అప్రార్థితాని దుఃఖాని యథైవాయాన్తి దేహినాం। సుఖాన్యపితథాయాన్తి కా తత్ర పరివేదనా" ఇత్యుక్త్యా సుఖ వద్దుఃఖంచాపి కాలవశేనానివార్యమితి అవస్థాయ దుఃఖనివృత్తయే పరానపేక్ష ఇతిభావః- అతఏవాత్మేత్యుక్తం- ఏతేనాస్య ప్రవృత్తిసామాన్యం లోకానుకరణమేవేతి నతద్విరోధ ఇత్యుత్తరత్ర స్ఫుటీభవిష్యతి। విచక్షణః- విమర్శస్వభావ ఇత్యర్థః। స్వాంశే అదీనత్వేపి విమర్శే నాన్యదీయకష్టదశాం జ్ఞాత్వా తన్ని వృత్తిపర ఇతి భావః॥

తా॥ 'ఈయజ్ఞముచే దేవతలను భావన చేయుడు. ఆదేవతలు మిమ్ములను భావన చేసెదరుగాక. ఇట్లు ఒకరినొకరు భావన చేయుచో ఉభయులును గొప్ప శ్రేయస్సును పొందగలరు' అను గీతావాక్యమునననుసరించి దేవతలు మనుజులు ఒకరికొకరు నుపకారముచేసికొనుటలో నుపయోగించెదరుగాన "సర్వలోకములకు ప్రియమగుట' యని తెలియనగును. ఇంతమాత్రమేకాదు. "నడవడి ప్రియమైనది. వాఙ్మయమము వినయముచే మధురమైనది. బుద్ధి స్వభావముచే మంగళప్రదమైనది. పరిచయ మనింద్యమైనది'' అని భవభూతి చెప్పిన లక్షణములతో గూడిన సజ్జనుడని తెలుపుటకుగాను 'సాధుః' అని యుపయోగించినాడు.

'అదీనాత్మా' దైన్యమన ఆపత్తుతోగూడినపుడు ఇతరులచే రక్షింపబడతగిన యవస్థకు వచ్చుట. అట్టిది లేనివాడని

యర్థము. "ప్రాణులకు తాము గోరకుండగనే దుఃఖము లేట్లు వచ్చునో, సుఖములుగూడ నారీతిగనే వచ్చును. వానికొఱకై విలపించనేల ?" అను నార్యోక్తిచొప్పున కాలవశమున సంప్రాప్తించు సుఖదుఃఖము లనివార్యములని భావించి, వానిని లక్ష్యముచేయక, దుఃఖములను పోగొట్టుకొనుటకు ఇతరులనపేక్షించడు. కావుననే "ఆత్మా" యని కలదు. దీనిచే సీతనిప్రవృత్తిమాత్రము లోకమునను సరించుటకొఱకే యని ముందు వ్యక్తము కాగలదు. "విచక్షణః" విమర్శతోగూడినస్వభావము కలవాడు. తనకు దీనత్వము లేకున్నను విమర్శచే ఇతరులకష్టములను దెలిసికొని వాటిని తొలగించువాడని భావము.

శ్లో॥ సర్వదాభిగతస్సద్భిస్సముద్ర ఇవ సింధుభిః ।

వ్యా॥ సత్సంగ ఏవ ధీమతాం భూషణం. సత్వాన్య దితి తదభిగమనే నకాలనియమః-ఇతరేషాంతు నియతకాల ఏవ స్వాభిగమ ఇత్యర్థః। ఏతేన రాజ్యే ఽస్య వ్యసనాభావస్సూచ్యతే-అత ఏవ కాళిదాసః- "అగృధ్నురాదదే సోఽర్థమసక్తస్సుఖమన్వభూత్" ఇత్యవోచత్-అత్ర నదీసముద్ర సంబంధ సాదృశ్యప్రతిపాదనేన "యథా నద్య స్యందమానా స్సముద్రేఽస్తంగచ్ఛన్తే నామరూపే విహాయ" ఇతి శ్రుతిసిద్ధమైక్యం సమంజసమభిప్రేతం వేదితవ్యం। ఏవం స్వాత్మప్త్యర్థం సర్వేషాం ప్రీతిజననార్థంచ విశేషతః కతిచిద్గుణాన్వర్ణయిత్వా మారభ్య సహస్రజిహ్వోఽపి నాస్య గుణాన్ చిరాయాపి వక్తుం శక్నుయాత్ - కిముతైకముఖ స్స్వల్ప కాలేనాహమితి తద్గుణవర్ణనే అసామర్థ్యం ప్రకటయన్నివ

సామాన్యేన సర్వగుణాశ్రయత్వం ప్రతిపాద్యతావతా అతృప్తగ పునర్విశేషతః కతిచిద్గుణా న్వర్ణయతి॥

తా॥ సముద్రుడు నదులతోవలె నెల్లపుడు సత్పురుషులతో గూడువాడు. సత్సహవాసమే బుద్ధిమంతులకు భూషణము. ఇతరము భూషణము కాదు. సత్పురుషులతో గలియుటకు కాలనియమము లేదు. ఇతరులతో నియమితమగు కాలమందనే కలసికొనువాడు. దీనిచే నీతనికి రాజ్యము ననుభవించుట యందు వ్యసనము లేదని సూచితమగుచున్నది. కావుననే కాళిదాసు రఘువంశమున "ఆతడు తృష్ణలేనివాడై ధనమునార్జించెను. ఆసక్తిలేనివాడై రాజ్యసుఖము ననుభవించెను" అని చెప్పినాడు. ఇచ్చోట నదీసముద్రసంబంధముతో పోల్చుటచే "ఏరీతిగ ప్రవహించెడి నదులు తమ నామరూపములను వదలి సముద్రమున నశించిపోవునో" అని శ్రుతిలో చెప్పబడిన ఐక్యము సమంజసముగ నీతనికభిప్రేతమని తెలియనగును.

ఈరీతిగ తన తృప్తికొరకు, అందఱకు ప్రీతి కలుగుటకును విశేషముగ కొన్నిగుణములను వర్ణించుటకారంభించి, వేయి ముఖములచే జెప్పినను వీనిగుణముల వర్ణింప నలవికానపుడు, ఒక ముఖముతో స్వల్పకాలమున నే నేమి చెప్పగలనని తన యసామర్థ్యమును వెల్లడించుచు, సామాన్యముగ సర్వగుణములు గలవాడని తెలిపి, అంతటితో తృప్తినొందక కొన్ని విశేషగుణములను జెప్పుచున్నాడు.

శ్లో॥ స చ సర్వగుణోపేతః కౌసల్యానందవర్ధనః ।
సముద్ర ఇవ గాంభీర్యే ధైర్యేణ హిమవానివ॥

వ్యా॥ చకార ఏవకారార్థకః-అన్యయోగాయోగ వ్యవచ్ఛేదార్థకః-కౌసల్యానందవర్ధనః-ఆనందస్య వర్ధనః ఆనందవర్ధనః-కౌసల్యాయాః ఆనందవర్ధన ఇతి విగృహ్య గమకత్వాత్సమాసః స్వీకర్తవ్యః-తేన స్వరూపస్వభావాదినా అస్యానందపోషకత్వస్య సర్వసాధారణ్యేఽపి భూమిష్ఠనిధివ న్మాతృగర్భే విలీయ, కాలక్రమేణ వర్ధమానోఽపీశ్వరత్వేన గర్భధారణాదినా క్లేశాజనకతయాఽయం మదీయగర్భస్థః యః కశ్చిన్మహానుభావః నతు లోకసాధారణ శ్శిశు రిత్యానంద మనుభవన్త్యా-అత ఏవస్వమూర్తిదర్శన మపేక్షమాణాయాః కౌసల్యాయాః బహిరభివ్యక్త్యా ఆనందాబ్ధిం పూర్ణేందు రివోద్వేలయామాసేతి ఫలితం-పుత్రలాభఫలస్య కౌసల్యాయా ఏవ లాభాద్దశరథనందన ఇత్యనుక్తిః మణిమంజీరం త్వరుచికరం-జననేనైవ పుత్రస్య పితృఋణమోచకత్వేన తదర్థం చిరం తపస్యతో దశరథస్యానందోదయే అవివాదాత్-మాతాపిత్రోర్జీవనాంశే కాలభేదేఽపి తత్సత్తాదశాయాం గుణవత్ప్రజాసంబంధ జన్యానందస్య తౌల్యేన తదన్యతర స్యేతరాపేక్షయా ఆనందాంశే న్యూనత్వ స్యాధిక్యస్యవా వక్తుమనౌచిత్యాత్-కౌసల్యాపేక్షయా దశరథోఽల్పభాగ్య ఇతి అశ్లీలార్థప్రతీతి ప్రసంగాచ్చ-"రామో రతికరః పితు" రిత్యుత్తరత్ర దశరథస్యాప్యానందకరత్వ ప్రతిపాదనాచ్చ-కించోభయో రామవియోగజన్య దుఃఖస్య సామ్యేఽపి తత్సోఢు మశక్త్యా మృతస్య

దశరథస్యైవ తుల్యవిత్తివేద్యతయా తత్సంయోగజన్య సుఖవిశే షస్య కౌసల్యాపేక్షయా ఆధిక్య మిత్యస్యార్థస్య పరిస్ఫూర్తేశ్చ- అతఏవ-"కౌసల్యా లోకభర్తారం సుషువేయం మనస్వినీ" ఇతి స్వరసతస్సంగచ్ఛతే । "నహి వంధ్యా విజానాతి గుర్వీం ప్రసవ వేదనా" మితి న్యాయేన ప్రసూతి కాలిక శ్రమాతిశయస్య సర్వ స్త్రీసాధారణ్యేపి పూర్వోక్త రీత్యా కౌసల్యాయాః తాదృశ క్లే శాభావేన బహిరభివ్యక్తస్స్వపుత్రదర్శన జన్యానంద పారవశ్యాని యాప ప్రశంసావిశిష్ట మనస్సంబంధబోధకత్వం విన ఇత్యాది తద్వ్యాఖ్యానావసరే స్ఫుటం ప్రతిపాదయామఃగ-సముద్ర ఇవ గాంభీర్యే-ఇతర దురవగాహ శాయత్వం గాంభీర్యం-ఆత్మసేవా విధురాణాం మహతా మాత్మతత్త్వం సప్రకాశయతి-స్వసేవినాం త్వల్పానామపి మత్స్యకూర్మాదీనాం స్వగర్భప్రవేశనేన సముద్ర ఇవ స్వతత్త్వ ప్రకాశనేన పోషక ఇతిభావః-నతు సర్వాత్మనా అప్రకాశిత స్వాశయకత్వం గాంభీర్యం-తథా సతీతరానాశ్రయణీ యత్వాపత్తేః। ధైర్యేణ హిమవానివ-అనన్తరత్నాశ్రయస్య తస్య గిరేః హిమానీవ ధీరస్య తస్య విపన్నాపకర్ష హేతు రితి పర్యవ సన్నం-అత ఏవ "అనన్తరత్న ప్రభవస్య యస్య హిమన్న సౌభాగ్య విలోపిజాత" మితి కాళిదాసః చమదకార్షీత్-యద్వా-హిమ గిరేస్స్వతో హిమాశ్రయత్వే నాసారాతిశయో యథా నవికృతి కారీ తథాఽయమపి స్వభావే నావికృతత్వేన శోకమోహాది రవికృతికారీతి భావః-అత ఏవ హిమవానిత్యుక్తం।

తా॥ చకారము 'ఏవ' అనుదాని యర్థము కల్పి, 'కౌసల్యానన్దవర్ధనః' అనుచోట ఆనందస్య వర్ధనః (ఆనందమును వృద్ధి పొందించువాఁడు) కౌసల్యాయాః ఆనన్దవర్ధనః కౌసల్యానన్దవర్ధనః (కౌసల్యాదేవియొక్క ఆనన్దమును వృద్ధి పొందించువాఁడు) అను వ్యధికరణసమాసము సంగీకరింపవలెను. శ్రీరాముఁడు, తన స్వరూప స్వభావాదులచే అందరియొక్క ఆనందమును పోషించుట సహజమైనను భూమియందలి నిధివలె మాతృగర్భమున అణగి, కాలక్రమమున వృద్ధినొందినను పరమేశ్వరు డగుటచే తను గర్భధారణ క్లేశమును కలిగింపక పోవుటచేతను "నాగర్భమందున్న యీతఁడెవఁడో మహానుభావుఁడు, లోకసాధారణమగు శిశువు కాఁడు" అని ఆనంద మనుభవించుచు, తనమూర్తి దర్శనమును కోరుచున్న కౌసల్యకు, బైటను ప్రత్యక్షమై పూర్ణచంద్రుని వోలె ఆనందసముద్రము నుప్పొంగించెనని భావము.

"పుత్రలాభఫలము కౌసల్యకే కలుగుటవలన "దశరథనందనః అని చెప్పుట లేదు." అని చెప్పిన మణిమంజీరవ్యాఖ్యానము రుచికరమైనది కాదు. పుత్రుఁడు పుట్టినంతనే పితృదేవతల ఋణమును తీర్చువాఁడగుటచే, అట్టి పుత్రునికై చిరకాలము తపస్సుచేసిన దశరథున కానందము కలిగిన దనుటలో వివాదమే లేదు. తల్లిదండ్రులు జీవించుటలో కాలభేదమున్నను, వారు జీవించియుండగ గల్గిన సద్గుణములు గల సంతానము వలన గలిగెడి యానందమిద్దరకు తుల్యమేగాన, ఆనందానో

మున ఒకరికంటె నొకరికి హెచ్చుతగ్గులు చెప్పుటకు వలను పడను. అట్లైనచో కౌసల్యకంటె దశరథుడు అల్పభాగ్యము గలవాడను అమంగళార్థము తోచును. "రాముడు తండ్రికి ప్రీతిని గలిగించువాడు" అని మున్ముందు దశరథున కానందమును గలుగజేసినట్లు కవి చెప్పుచున్నాడు. రాముని వియోగము వలన గలిగెడి దుఃఖము ఇద్దరకు సమానమైనను, దానిని సహింపలేక చనిపోయిన దశరథునకే శ్రీరామునితో గూడి యున్నపుడు కలుగునట్టి యానందము, కౌసల్యకంటె నెక్కుడు కలదను నర్థము స్ఫురించెడిని. కావుననే "కౌసల్యా లోకభర్త యగు నవనిని కనెనో" అను వాక్యము సరసముగ సరిపడుచున్నది. "గొడ్రాలు దుర్భరమగు ప్రసవవేదన నెరుగదు" అను న్యాయముచే ప్రసవకాలమున మిక్కిలి శ్రమపడుట స్త్రీమాత్రమునకు సహజమైనను, వెనుక జెప్పిన రీతిని కౌసల్య కట్టి శ్రమ కలుగలేదు. కనుకనే యామె ప్రత్యక్షముగ నవతరించిన తన పుత్రుని జూచుటచే గలిగిన యానంద పారవశ్యమును ప్రశంసింపవలెనను నూహ కలిగి యున్నది; అను నీమొదలగు విషయములను ఆయావ్యాఖ్యానములయొక్క యవసరము కలిగినపుడు మున్ముందు స్ఫుటముగ జెప్పుదుము.

'సముద్ర ఇవ గాంభీర్యే' ఇతరులకు ప్రవేశింప శక్యము గాని యాశయముతో గూడుటయే గాంభీర్యము. అట్టి గాంభీర్యము గలవాడు. తన్ను సేవింపని యెట్టి మహాత్ములకైనను ఆత్మతత్త్వమును ప్రకాశింపజేయడు. తన్ను సేవించెడి అల్పుల

నైనను, మత్స్యకూర్మాదులను తన గర్భమునం దునిచికొనుటచే సముద్రునివలె ఆత్మతత్త్వమును వెల్లడించి పోషించునని భావము.

ఏరీతిగను తన యభిప్రాయమును దెలుపక పోవుట "గాంభీర్యము" కాదు. అట్లైనచో నితరులు తన్నాశ్రయించుటకే అవకాశముండదు.

'ధైర్యేణ హిమవానివ' అనన్తములగు రత్నములతో గూడిన హిమవత్పర్వతమునకు మంచువలె, ధీరుడగు నాతనికి విపత్తు అపకర్షను గలిగించునది కాదు. కావుననే కాళిదాసు "అనన్తములగు రత్నములకు స్థానమైన హిమవంతునకు మంచు అతిశయమును పోగొట్టినది కాలేదు" అని చమత్కరించినాడు. లేదా, హిమవత్పర్వతము స్వతస్సిద్ధముగ గొప్పమంచుతో కూడినను అందువల్ల గలిగిన సారాతిశయము లేకపోవుట వికారము నెట్లు కలుగజేయలేదో, అట్లే సహజముగ వికారములు లేనివాడు గాన శోకమోహాదు లీతనిని వికృతుని జేయలేవు. అని భావము. కావుననే 'హిమవాన్' అని చెప్పినాడు.

శ్లో॥ విష్ణునా సదృశో వీర్యే సోమవత్ప్రియదర్శనః ।

వ్యా॥ సర్వలోకాతిశాయీ అనుభావవిశేషః వీర్యం- యథామార్గాసో విషయే విష్ణునా ప్రయుక్తస్య చక్రస్య అనివార్యత్వేన వీర్యం ప్రసిద్ధం-తథా కాకాసురాదివిషయే అభిమన్త్రితస్య తృణాదే రనివార్యత్వేన వీర్యమస్మిన్ప్రసిద్ధ మితి భావః-సోమవత్ప్రియదర్శనః-సోమవదితి షష్ఠ్యన్తాద్వతిః-సుఖ

పేతి ప్రియదర్శన ఇత్యనేన సమాసః-"సముదాయేన సంబంధో యేషాం గురుకులాదినా। సంస్పృశ్యావయవాంస్తేతు" ఇతి దిశా గుణభూతాయామపి-దృశిక్రియాయా మప్యన్వయః-నతు పృథక్పదం-తథా సత్యనన్వయాపత్తేః-వృత్తౌత్వేకార్థీ భావేనాన్వయాంగీకారే క్లేశస్య సుసహత్వాత్-ప్రీతిజనక కాంతివిశేష వా నిత్యర్థః॥

తా॥ "విష్ణునా సదృశో వీర్యే" సర్వలోకముల నతిశయించు సామర్థ్యవిశేషమునకే వీర్యమని పేరు. దుర్వాసుని విషయమున ప్రయోగించిన చక్రము అనివార్యమగుటచే నీతని వీర్యము ప్రసిద్ధమే. అట్లే కాకాసురుడు మున్నగు వారి విషయమున అభిమంత్రించిన తృణము గూడ నెవరిచేతను నివారింపబడలేదనుటచే నీతని వీర్యము ప్రసిద్ధమని భావము.

"సోమవత్ప్రియదర్శనః" చంద్రునియొక్కవలె ప్రియమైన దర్శనము గలవాడు. ప్రీతిని గల్గించు కాంతివిశేషము గల వాడని భావము.

శ్లో॥ కాలాగ్ని సదృశః క్రోధే క్షమయా పృథివీసమః।
ధనదేన సమస్త్యాగే సత్యే ధర్మ ఇవాపరః॥

వ్యా॥ కాలాగ్ని సదృశః క్రోధే-సత్యవసర ఏవ క్రోధః-నతు మదప్రమాదాదినాస్య క్రోధోదయ ఇతి భావః-క్షమయా పృథివీసమః-క్షమైవాస్య నిసర్గ ఇతి భావః-ఉభయత్రాప్యుపమాన స్వాభావ్యాత్-త్యాగే-త్యాగకాలే స్వస్మిన్ధనదత్వమేవ

మనుతే నతు తేన విత్తనాశభీతిరితి భావః-తతశ్చాస్య త్యాగక ర్తవ్యతాదశాయాం మత్యుత్సాహేన వాంఛితాదప్యధికప్రద ఇతి వ్యజ్యతే-అత్ర సర్వత్రా ప్యుపమాన నిర్దేశేషు యత్రసాదృశ్య ప్రతిపత్తు స్సహృదయత్వం తదర్థప్రత్యాయన ఏవ కవే స్తాత్పర్యం కల్పనీయం-అత ఏవ త్యాగే సత్యపీత్యపి శబ్దాన్తర్భావేన వ్యా ఖ్యాయ త్యాగవిశిష్టాఢ్యత్వస్యోత్తమగుణత్వ ప్రతిపత్తయే ధన దసామ్యముక్త్వా వర్ణ్యస్య మహోదారత్వం వ్యజ్యత ఇతి ప్రాచాం వ్యాఖ్యానం సంగచ్ఛతే-ఏతేన త్యాగే సత్యపీతి వ్యాఖ్యానం క్రమభంగేన తత్ప్రతీతి విషయస్యాఢ్యత్వస్యోత్తమ గుణత్వాభావేన చ అయుక్తమితి దూషణపరం మణిమంజీర మపాస్తం-సాధారణ ధర్మవాచకపదస్య భిన్నవిభక్త్యంతతయా తత్ర తత్ర గ్రహణేన తదంశే క్రమస్య కవినైవ పరిత్యక్తత్వాత్- సముద్రాదేరుపమానత్వే అవాస్తవికత్వస్య స్వయమేవాంగీకృత త్వేన తత్తత్తయథా యథం సాదృశ్యప్రతీ త్యవగాహస్య తత్త ద్వ్యుత్పత్త్యధీనతాయామేవ పర్యవసానేనాన్వయక్రమస్య త్యక్త ప్రాయత్వాచ్చ-సాధారణ ధర్మవాచక పదోత్తర సప్తమ్యావిష యతావ్యర్థస్తు స్వబుద్ధి కల్పిత ఇతి న తద్భంగోఽన్యస్యదోషాయ భవతి-అప్యర్థాన్వయపక్షేపి త్యాగస్య ఉపమానవృత్తిత్వబోధస్య సహృదయసాక్షికస్య ఇతఃపూర్వమేవ యథాకథంచిత్సత్వేన తదంశేపి క్రమస్య సంతోష్టవ్యత్వాత్-ధనదపదస్వారస్యస్యే త్యాదన్వయపక్షేఽప్రతీతేశ్చ-కేవలాఢ్యత్వస్య గుణత్వాభావేపి త్యాగిత్వ విశిష్టాఢ్యత్వస్య గుణత్వే నిరాబాధాత్-త్యాగాంశే

కుబేరస్య సామాన్యతః కవి ప్రసిద్ధ్యభావేన తాత్పర్యాన్తరక ల్పనే వ్యాఖ్యాతు రనపకర్షాచ్చ- సత్యే ధర్మ ఇవాపరః- లోక విలక్షణః- "అహింసా పరమోధర్మస్సచ సత్యే ప్రతిష్ఠితః" ఇతి మహాభారతే ధర్మవ్యాధోపాఖ్యానే పరమధర్మస్యాహింసా యా స్సత్యమూలకత్వకథనేన సత్యధర్మావవినాభావేన సేవత ఇత్యర్థః- యద్వా- సత్యే ధర్మే ఇవ అపరః ఉత్కృష్టః-సత్య ధర్మయోర్ద్వయోరపి నిరుపమాన ఇత్యర్థః- ఏతేన అపరపదస్య ఉత్కృష్టార్థకత్వం స్వీకృత్య తస్య ధర్మాంశే విశేషణతయా అన్వయేన క్రమప్రాప్తోపమాలంకారసంరక్షణపరం మణిమంజీర మపాస్తం-లోకే ధర్మదేవతాయా ఏకత్వేనావ్యావర్తకత్వా ద్విశేషణస్య "విష్ణునా సదృశో వీర్యే" ఇత్యత్రానన్వయాలం కారస్య తేనైవోక్తత్వాత్ - సతి చమత్కారాతిశయే విలక్ష ణార్థకల్పనాయా అపి దృష్టత్వాచ్చ- యద్వా-సత్యే యథా ధర్మో లోకవిలక్షణ స్తథాయమపీత్యర్థః. ఏతేన పూర్వోక్తదిశా అస్య సర్వగుణాలవాలత్వేఽపి ధర్మదేవతాయా ఇవ సత్యమేవ స్వరూపమితిభావః- అత ఏవ "అహింసా పరమోధర్మస్సచ సత్యే ప్రతిష్ఠితః । సత్యే కృత్వా ప్రతిష్ఠాంతు ప్రవర్తన్తే ప్రవృ త్తయః" ఇతి ధర్మపారమ్యస్యాపి సత్యమూలకత్వం ధర్మవ్యాధో పాఖ్యానే మహాభారతేఽప్యుక్తం- ఏవం భగవతశ్శ్రీరామచం ద్రస్య "ఇక్ష్వాకువంశప్రభవ" ఇత్యారభ్య "సత్యే ధర్మ ఇవా పరః" ఇత్యేతదన్తసందర్భేణ అవతారాది విశ్వామిత్రయాగ రక్షణ సీతాపరిణయ పరశురామవిజయ పురప్రవేశాన్త బాల

కాండస్థాన్యసాధారణాపదానాని సంక్షేపేణ సంసూచ్య అయోధ్యాకాండే యావనదశాప్రాప్త రాజ్యపరిత్యాగ పితృవాక్య పరిపాలన మునివృత్తిస్వీకారాంతేతరదుర్లభగుణజాతం వక్తుం సంక్షేపేణోపక్రమతే- "తమేవం గుణసంపన్నం" ఇత్యాదినా- తథాహి- "ఇక్ష్వాకువంశ ప్రభవ" ఇత్యవతారసూచనం- అన్యథా సంభూత ఇతి వదేత్ - "మహావీర్య" ఇతి విశ్వామిత్రాగమన హేతూక్తిః- "శ్రీమాన్" ఇతి తదుపదిష్టమన్త్రద్యోతనం- "శత్రునిబర్హణః" ఇతి-తత్సాధ్య తాటకావధాదిద్వారా తద్యాగ రక్షణకథనం "విపులాంస" ఇత్యాది సీతాకల్యాణోచిత సౌందర్యాద్యభివర్ణనం- "లక్ష్మీవాన్" ఇతి- సాక్షాత్సీతాపరిణయ వ్యక్తిః "శుభలక్షణః" ఇత్యనేనోత్పాతాదినా పిత్రాదిసంభావితాపజయ నివృత్తిపూర్వక పరశురామ జయరూప శుభలాభ ప్రసంగః- "ధర్మజ్ఞః" ఇత్యాది "ప్రియదర్శన" ఇత్యే తదన్తం రాజ్యపరిపాలనానుకూల రాజధర్మస్థాపనం। ఏవం తత్తత్సందర్భానుసారేణాన్యదప్యూహ్యం-

తా॥ 'కాలాగ్ని సదృశః క్రోధే' సమయము వచ్చినప్పుడే కోపము. మదముచేగాని, ప్రమాదముచేగాని ఇతనికి కోప ముదయించదని భావము.

'క్షమయా పృథివీ సమః' ఓరిమియే ఈతనికి సహజమని భావము.

'ధనదేన సమస్త్యాగే' త్యాగము చేయునపుడు తన్ను కుబేరునిగా తలచుకొనువాడు. త్యాగముచే ధనము నశించు

నేమో యను భీతి లేదని భావము. కావున త్యాగసమయమున అత్యుత్సాహముతో కోరినదానికంటె నధికముగ నిచ్చెడివాడని తోచును.

ఇచ్చట ఉపమానములను దెలుపుచోటుల నంతటను ఏ సాదృశ్యము తోచుటచే శ్రోతకు సహృదయత్వము గల్గునో అట్టి యర్థమును తోపించుటయందే కవికి తాత్పర్యము కలదని కల్పించుకొనవలెను. కావుననే "త్యాగే సత్యపి" (త్యాగము కలిగినప్పుడును) అని అపిశబ్దాంతర్భావముచే వ్యాఖ్యానము చేసి, త్యాగముతో గూడిన ధనికుడగుట ఉత్తమమని తెలుపుటకై కుబేరునితో పోలిక జెప్పి, దీనిచే నాయకుని ఔదార్యాతిశయము తోచుచున్నది" అను ప్రాచీనుల వ్యాఖ్యానము సంగతమగుచున్నది.

ఇట్లు చెప్పుటచే "అపిశబ్దాంతర్భావముచే తారుమారు చేసి వ్యాఖ్యానము చేసినను, దానివలన తోచెడి ఆఢ్యత్వము (ధనికత్వము) ఉత్తమగుణము కానేరదు గాన, అట్లు చెప్పుట తగదు" అను మణిమంజీరవ్యాఖ్యానము త్రోసివేయబడినది. సాధారణ ధర్మమును బోధించెడి పదము భిన్నవిభక్త్యంతముగ అచ్చటచ్చట కవియే గ్రహించినాడు గాన, ఆవిషయమున క్రమమును కవియే వదలినాడు. సముద్రుడు మున్నగువారు యుపమాన వస్తువులగుట వాస్తవము కానేరదని తానే (మణిమంజీరవ్యాఖ్యాతయే) అంగీకరించినాడు గాన, అక్కడక్కడ సాదృశ్యజ్ఞానము, ఆయాప్రతీగ వ్యుత్పత్తులను జెప్పియే సాధింపవలె

ననుటలో, పర్యవసాన మగుటచే, తాను గూడ అన్వయక్రమ మును విడచినట్లే యగును. సాధారణధర్మవాచకమగు పదముల మీది సప్తమికి 'విషయత్వ' మను నర్థము చెప్పుట తాను జెప్పినదే గాన, దానికి భంగము గలుగుట యితరులకు దోషా వహము గానేరదు. "అపి" శబ్దాంతర్భావముచే నన్వయమును జెప్పినను, త్యాగమనునది ఉపమానమగు కుబేరునియందుండుట సహృదయులకు విదితమై ఇంతకు పూర్వమే ఏదియో యొక రీతిని సంభవించినదై యుండును గాన, ఆవిషయమునగూడ క్రమముండునని సంతోషించునది.

కేవలము 'ఆఢ్యత్వము' గుణము కాకపోయినను త్యాగి త్వముతో గూడిన ఆఢ్యత్వము గుణమగుటలో బాధకముండదు. త్యాగవిషయమున కవులు కుబేరుని పేర్కొనరు గాన, మఱి యొకరీతిని కల్పించినచో వ్యాఖ్యాత కపకర్ష యుండదు.

'సత్యే ధర్మ ఇవాపరః' లోకవిలక్షణము. "ఉత్కృష్ట మగు అహింస యనెడి ధర్మము సత్యమందు స్థిరపడినది" అను భారతమందలి ధర్మవ్యాధోపాఖ్యానమున అహింస యను ధర్మ ము సత్యమూలకమని చెప్పుటచే సత్యధర్మముల రెండింటిని విడువకుండగ సేవించుచున్నాడని భావము.

లేదా, సత్యమందు ధర్మమందువలె ఉత్కృష్టుడు. సత్య ధర్మముల రెండింటియందు సాటిలేనివాడని యర్థము.

ఇట్లు చెప్పుటచే "అపర" అను పదమునకు ఉత్కృష్టార్థ మును సేకరించి, దానిని ధర్మాంశమున విశేషణముగా అన్వ

యించినచో క్రమముగ ప్రాప్తమయిన ఉపమాలంకారము కూడ సిద్ధించును" అను మణిమంజీరవ్యాఖ్యానము సరిపడను. లోకమున ధర్మదేవత ఒక్కటియే గాన విశేషణము అవ్యావర్తక మగును. అదియు గాక "విష్ణునాసదృశో వీర్యే" అను చోట అనన్వయాలంకారమని మణిమంజీరవ్యాఖ్యాతయే చెప్పియు న్నాడు. చమత్కార విశేషమున్నచో విలక్షణమగు నర్థమును కల్పించుట కనబడుచునేయున్నది.

లేదా, సత్యవిషయమున ధర్మ మేరీతిని లోకవిలక్షణమో అట్లే ఈతడు విలక్షణుడే. దీనిచే నీతడు సమస్తగుణములకు స్థానభూతుడైనను ధర్మదేవతకువలె ఈతని స్వరూపము మాత్రము సత్యమే యని భావము. కావుననే "అహింస ఉత్కృష్ట మగు ధర్మము. అది సత్యమందు స్థాపింపబడినది. సత్యమందు స్థితి నొందియే సమస్తప్రవృత్తులు గల్గుచుండును" అని ధర్మ మందు ప్రవృత్తి గలుగుట సత్యమూలకమే యని మహాభారత మున ధర్మవ్యాధోపాఖ్యానమునం దున్నది.

ఈరీతిగ "ఇక్ష్వాకువంశప్రభవః" అనునది మొదలు "సత్యే ధర్మ ఇవాపరః" అనునంతవరకు శ్రీరాముని యవతారాదిక మును, విశ్వామిత్రుని యాగము రక్షించుట, పరశురాముని జయించుట, పురప్రవేశము మున్నగు బాలకాండ యందలి సాధారణ విషయములను సూచించి, అయోధ్యాకాండయం దలి యౌవనదశ లభించుట, రాజ్యమును విడుచుట, పితృవాక్య మును పాలించుట, మునివేషమును ధరించుట, మున్నగునట్టి

ఇతరులకు లభించని గుణగణముచు జెప్పుటకు సంక్షేపముగ నుపక్రమించుచున్నాడు. "తమేవం గుణసంపన్నం" మొదలుగ నీవిషయమే ఆరంభించబడుచున్నది.

ఎట్లన "ఇక్ష్వాకువంశము ఉత్పత్తిస్థానముగా గలవాడు" అనుటచే అవతారమును సూచించినాడు. లేనిచో "పుట్టినాడు" అనియే చెప్పును. "గొప్ప వీర్యము గలవాడు" అనుటచే విశ్వామిత్రుని రాకకు కారణము చెప్పుట. "సంపత్తు గలవాడు" అనుటచే విశ్వామిత్రుడు మంత్రముల నుపదేశించినాడనుట. "శత్రువుల నిగ్రహించినవాడు" అనుటచే తాటక మున్నగువారిని వధించి విశ్వామిత్రుని యాగమును రక్షించినాడనుట. "విశాలమైన భుజశిరస్సులు గలవాడు" అనుటచే సీత వరించుటకు తగిన సౌందర్యము కలవాడనుట. "లక్ష్మికలవాడు" అనుటచే సీతను పెండ్లాడినాడనుట. "శుభలక్షణములు గలవాడు" అనుటచే, తండ్రి మొదలగువారు ఉత్పాతములను గుర్తించి పరాజయ మగునేమో యని భీతిల్లునపుడు ఆభయమును తొలగించి పరశురాముని జయించినాడనుట. "ధర్మము నెరిగినవాడు" మొదలుగ "ప్రియమైన దర్శనము గలవాడు" అనునంతవరకు రాజ్యపరిపాలనకు తగిన రాజ్యధర్మమును స్థాపించినాడనుట ఈరీతిగ సందర్భములను బట్టి ఇతరమైనవికూడ నూహించునది.

శ్లో॥ తమేవం గుణసంపన్నం రామం సత్యపరాక్రమం ।
జ్యేష్ఠం శ్రేష్ఠగుణైర్యుక్తం ప్రియం దశరథస్సుతం॥

వ్యా॥ పూర్వోక్తగుణసమృద్ధమ్- అనేన కతిపయగుణవిశిష్టానాం వ్యావృత్తిః- సత్యపరాక్రమం। అజయ్య తాటకాది వధేన ప్రత్యక్షీ కృతపరాక్రమం ఇత్యర్థః- శ్రేష్ఠగుణైర్యుక్తం- సకలగుణసమృద్ధేరితరభ్రాతృసాధారణ్యేపి తదపేక్షయా చరమకాష్ఠాపన్నగుణయుక్త మిత్యర్థః- ప్రియం మణిముకురకమలాదివత్ స్వభావత ఏవ సర్వప్రీతి విషయం॥

తా॥ 'ఏవం గుణసంపన్నం' ముందు జెప్పిన గుణములతో నిండినవాడు. దీనిచే కొన్నిగుణములతో మాత్రమే కూడినవాడని కాదనుట.

'సత్యపరాక్రమమ్' జయింప శక్యముగాని తాటక మున్నగువారిని జంపుటచే ప్రత్యక్షమైన పరాక్రమము గలవాడు. అని అర్థము.

'శ్రేష్ఠగుణైర్యుక్తం' సకలగుణసమృద్ధి ఇతరసోదరుల కున్నను, వారికంటె పరమావధిని పొందిన గుణములతో గూడిన వాడని యర్థము.

'ప్రియం' మాణిక్యము, అద్దము, కమలము, మున్నగు వానివలె స్వభావముచే నందరకు ప్రీతిపాత్రుడని యర్థము.

శ్లో॥ ప్రకృతీనాం హితైర్యుక్తం ప్రకృతి ప్రియకామ్యయా।
యౌవరాజ్యేన సంయోక్తుమైచ్ఛత్ప్రీత్యా మహీపతిః॥

వ్యా॥ ప్రకృతీనాం ప్రజానాం హితైరాప్తై ర్జనైర్యుక్తం జుష్టం- ఏతేన ప్రజాసౌఖ్యమేవాస్య ముఖ్యాభిప్రేతం। నతు ఇతరరాజవత్ రాజ్యాడంబర ఇతి సిద్ధం। అత ఏవ వక్ష్యతి

"నాహమర్థపరో దేవి లోక మావస్తు ముత్సహే" ఇతి ప్రకృతి ప్రియకామ్యయా- సర్వప్రాణిహితేచ్ఛయా । తదపి స్వమాత్ర సాధ్యమేవేతి భావః । ప్రీత్యా స్వప్రేమ్ణా నతు తదీయకుతు కేన- సంయోక్తుం- సంఘటయితుం । త్రిలోకపాలనానుకూలా నన్యసాధారణ గుణగణ సమగ్రస్య స్వపుత్రస్య శ్రీరామచంద్ర స్యాత్యల్పభౌమప్రజారక్షణోచిత యావరాజ్యస్వీకారే కీదృశీ రీతిస్స్యాదితి ఉత్కటానురాగో దశరథస్యోదభూదితి భావః । ఏతేన కరతలప్రాప్త రాజ్యపరిత్యాగపూర్వక వనవాసాదికం నాస్య (రామస్య) దుఃఖాయేతి సిద్ధం- తాదృశ రాజ్యలాభస్య తదీయేచ్ఛా విషయత్వాభావేన తద్వియోగస్యాస్య దుఃఖా నావహత్వాత్ - తత్ప్రీతివిషయాసిద్ధేరేవ తద్దుఃఖకారణత్వాత్- తచ్చ ప్రజారక్షణాదృతే నాస్యాన్య త్సుఖ మిత్యవతారప్రయో జనం సూచితం॥

తా॥ 'ప్రకృతీనాం హితైర్యుక్తం' ప్రజల కాపులగు వారితో గూడినవాడనుటచే ఈతడు ముఖ్యముగ కోరునది ప్రజాసౌఖ్యమే. ఇతరరాజులవలె రాజ్యాడంబరమును గోరుట లేదు అని విదితమగుచున్నది. కావుననే "నేను అర్థపరుడను కాను. ప్రజాక్షేమమే కోరువాడను" అని చెప్పబడినది.

"ప్రకృతి ప్రియకామ్యయా" సమస్తప్రాణులకు హితము కలుగజేయవలెనను కోరికచే అని అర్థము. అదియు తనకొక్కనికే సాధ్యము.

'ప్రీత్యా' తన (దశరథుని) ప్రీతిచేకాని శ్రీరాముని కోరికచే గాదు అని భావము.

'సంయోక్తుం' సంఘటన చేయుకొరకు. మూడులోకములను పాలించుటకు తగునట్టియు, ఇతరులకు దుర్లభమగు గుణగణపూర్ణుడగు శ్రీరామునకు స్వల్పమగునట్టియు, భూమియందలి ప్రజలను రక్షించుటకు తగిన యౌవరాజ్యమును స్వీకరించుట యెట్లుండునో యని దశరథునకు మిక్కుటమగు అనురాగము జనించెనని భావము. దీనిచే అరచేతిలోనికి వచ్చిన రాజ్యమును విడచి వనమున కేగుట మున్నగునవి రామునకు దుఃఖమునకు కాలేదు. ఎందుచేతనన, రాజ్యము పొందవలెననెడి యిచ్ఛ లేనే లేదు గాన, అట్టిదానిని విడుచుట దుఃఖకారణ మెట్లగును? తనకు ప్రీతివిషయమగు వస్తువు లభింపక పోయినగదా దుఃఖము గల్గుట. ప్రజారక్షణకంటె నితరమగు సుఖ మీతనికి లేదు. ఇదియే యీతని యవతార ప్రయోజనము. అని సూచింపబడినది.

శ్లో॥ తస్యాభిషేక సంభారాన్ దృష్ట్వా భార్యాథ కైకయీ ।
పూర్వం దత్త వరా దేవీ వరమేనమయాచత॥

వ్యా॥ పట్టాభిషేక వృత్తాంత శ్రవణమాత్రేణ అస్యాస్తుతోషోదయ ఏవ నతు సంతాపః। తత్సామగ్రీప్రదర్శనేన కైకేయ్యా మనోవృత్తిస్తు మంథరయా అన్యథాకృతేతి భావః- అన్యథా "తస్యాభిషేకవృత్తాంతం శ్రుత్వే" త్యేవ వదేత్ - ఏవం చ మన్థరావృత్తాంతస్య సాక్షాదకథనేన అతిపాపానాం కథా

మాత్రమపి "కథాపి ఖలుపాపానా మల మశ్రేయసే యతః" ఇతి న్యాయేన దోషావహేతి ధ్వనితం- ఉత్తరత్రతు వ్యంగ్యాన్తర మాదాయ ఉత్తమకావ్యత్వస్య సువచత్వాత్ ॥

తా॥ 'తస్యాభిషేక సంభారాన్ దృష్ట్వా' శ్రీరాముని పట్టాభిషేకమునకై సిద్ధమయిన సంభారములను జూచి. పట్టాభిషేకవృత్తాంతమును వినుటచే కైకేయికి సంతోషమే జనించెను. సంతాపము కలుగనే లేదు. సంభారములను జూచి మంధర ప్రేరేపించుటచే ఆమె మనోవృత్తి త్రిప్పబడెను. అట్లు కానిచో "ఆతని యభిషేకవృత్తాంతమును విని" అనియే కవి చెప్పును. మంథరావృత్తాంతమును ప్రత్యక్షముగ జెప్పకపోవుటచే "పాపాత్ముల కథయు అమంగళముకొఱకగును" అను నార్యోక్తిచే పాపాత్ముల కథను స్మరించుటయు దోషావహమని ధ్వనించుచున్నది. మున్ముందు వ్యంగ్యాన్తరమును (శ్లోచెప్పి అర్థాంతరమును) పురస్కరించుకొని దీని నుత్తమకావ్యమని చెప్పవచ్చును.

శ్లో॥ స సత్యవచనాద్రాజా ధర్మపాశేన సంయుతః ।
వివాసయామాస సుతం రామం దశరథః ప్రియం॥

వ్యా॥ ధర్మపాశేన ధర్మ ఏవ పాశ ఇతి మయూరవ్యంసకాదిత్వా ద్రూపకసమాసః- తస్యోత్తరపదార్థ ప్రధానత్వేన బంధనక్రియాన్వయసౌకర్యాత్। సంయుతః బద్ధః ధర్మైకాయత్తచిత్తః దశరథః సత్యవచనాత్। ల్యబ్లోపే పంచమీ। "సత్యాన్న ప్రమదితవ్యం" ఇత్యాది విధివచనమూలశ్రేత్యర్థః- కైకేయీ

ప్రతి స్వప్రతిజ్ఞాతార్థ నిర్వహణహేతోః సుతమపి ప్రియమపి రామం వివాసయామాస। విప్రార్వాద్వసత్తేర్ణిజంతాల్లిట్-వనం ప్రస్థాపయామాస । అత్రప్రేరణ "ణిచా" సర్వస్మిన్నపి కార్యే పిత్రాజ్ఞానువర్తిత్వమేవ రామస్యేతి గుణశ్రేష్ఠతా ద్యోత్యతే- ఏవం చ భగవదాజ్ఞారూపశ్రుతివచనానుబంధినః దశరథస్య పుణ్యలోకావాప్తిరేవేతి సిద్ధం। అత ఏవ "ధర్మాత్మా సశుభైః కృత్స్నైః క్రతుభిశ్చాప్తదక్షిణైః । ధూతపాపో గతస్స్వర్గం పితానః పృథివీపతిః" ఇత్యారభ్య "నశోచ్యః పితా తాత స్వర్గత స్సత్కృత స్సతాం" ఇత్యన్తయా పంచశ్లోక్యా పితుర్దశరథస్యోత్తమ లోకం ప్రాప్త స్యాశోచ్యత్వం శ్రీరామేణ వర్ణితం। తత్ర ధర్మాత్మేత్యస్య అత్రైవ తాత్పర్యం' భగవతశ్శ్రీరామచంద్రస్యేతి తత్త్వం। పూర్వాంగీకృత రామపట్టాభిషేకం విసృజ్య అనంతర కైకేయీ వరదానం క్షుద్రధర్మ ఇతి తు న సమ్యక్-తస్య తతోపి పూర్వాంగీకృతత్వావగమస్య స్పష్టత్వాత్-అత ఏవ పూర్వం దత్తవరేతి విశేషణం- అత ఏవస్వపితరి స్త్రీవశంవదత్వేన అధర్మచారిత్వధియా వధాద్యనిష్టాపాదనపరం లక్ష్మణంప్రతి తస్య సత్యపరిపాలనపరత్వేన ధార్మికత్వం సమర్థ్య తదీయ దుష్టబుద్ధినివర్తనపరస్య అయోధ్యాకాండస్థ శ్రీరామవాక్యస్యోపపత్తిః॥

తా॥ 'ధర్మపాశేన సంయతః' ధర్మమే పాశము; దానిచే గట్టబడినవాడు. ఇక్కడ రూపకసమాసము సేకరించి ఉత్తర పదార్థమునకు ప్రాధాన్యము నిచ్చుటచే ఆపాశము బాధక క్రియతో నన్వయించుటకు తగి యున్నది. ధర్మమునందే

స్థిరపడిన చిత్తము గల దశరథుడు. "సత్యమువలన ప్రమాదము నొందక గూడదు." అను శ్రుతివాక్యము రీతిని సత్యవచనము నాశ్రయించి, కైకేయికి తాను ప్రతిజ్ఞ చేసిన ప్రయోజనమును నిర్వహించుటకై ప్రియుడగు రాముని గూడ వనమున కంపెను. ఇచ్చట "వివాసయమాస" అను పదము ప్రేరణార్థమందు విధింపబడిన "ణిచ్" అను ప్రత్యయముతో గూడినదై, సర్వకార్యముల యందును శ్రీరాముడు పితృతాజ్ఞనే అనువర్తించెడి శ్రేష్ఠగుణములతో గూడినవాడని తెలుపుచున్నది. కావుననే భగవదాజ్ఞారూపమగు శ్రుతి వచనమును నిర్వహించిన దశరథునకు పుణ్యలోకములు ప్రాప్తించెననుట సిద్ధము. కావున "ధర్మమూర్తియగు మాతండ్రి తానొనర్చిన సమస్త శుభములచేతను, సంపూర్ణ దక్షిణల నర్పించిన క్రతువులచేతను, పాపములను పాఱద్రోలి స్వర్గమున కేగెను" అనునది మొదలుగ "స్వర్గమును బొందినవాడై సత్పురుషులచే సత్కరింపబడిన తండ్రినిగూర్చి విచారింప నక్కఱలేదు" అనునంతవఱకు నుండెడి పైను శ్లోకములచే ఉత్తమలోకముల నొందిన తండ్రినిగూర్చి దుఃఖింపనవసరము లేదని శ్రీరాముడు వర్ణించినాడు. ఇచ్చట 'ధర్మాత్మా' అను పదమున కిదియే తాత్పర్యము.

పూర్వమునం దంగీకరించిన శ్రీరామపట్టాభిషేకమును వదలి తరువాతిది యగు కైకేయికి వరము నిచ్చుట క్షుద్రధర్మమని యనుట యుక్తము కాదు. ఏలనన వరదానము పట్టాభిషేకమునకంటె ముందే ప్రతిజ్ఞ చేయబడినది. కావుననే "పూర్వ

మం దీయబడిన వరములుగల కైకేయిదేవి" అని పైశ్లోకమున కలదు. కనుక నే "తన తండ్రి స్త్రీవశంవదుడై అధర్మము నాచరించినాడని లక్ష్మణుడు వధాదిప్రయత్నముల నుడువుచుండగ, శ్రీరాముడు దశరథుని సత్యవ్రతపరాయణుడుగను ధార్మికునిగా దెలిపి, యాతని దుర్బుద్ధిని మరల్పినాడు" అను అయోధ్యా కాండయందున్న శ్రీరామవాక్యము సరసముగ నున్నది.

శ్లో॥ సజగామ వనం వీరః ప్రతిజ్ఞామనుపాలయన్ ।
పితుర్వచననిర్దేశాత్ కైకేయ్యాః ప్రియకారణాత్॥

వ్యా॥ స ఇత్యనేన విఘ్నబాహుల్యేఽపి ప్రతిశ్రుత వనవాసైక నిర్వహణపరత్వం పరామృశ్యతే-ఆరణ్యక రాక్షసాదిభ్యో భీతిరాహిత్యం వీర ఇత్యనేన బోధ్యతే । వచననిర్దేశాత్ - పితురప్రియత్వేపి స్వవనవాసస్య శ్రుతివాక్యవత్ తద్వచన మాత్ర గౌరవాదిత్యర్థః- ప్రియకారణాత్ -మాతుః కైకేయ్యాః ప్రియం భవత్వితి హేతోః వనవాసస్య అవశ్యకర్తవ్యత్వ ప్రతిజ్ఞా మనుపాలయన్ 'శ్రేయాంసి బహువిఘ్నాని' ఇతి న్యాయేన ఆత్మవ్రతస్య అన్తరాయబాహుల్యేన భంగో భవేదితి పదే పదే తద్రక్షణైకాయత్తచిత్తస్సన్నిత్యర్థః- ఏతేన వనవాసాభావస్య స్వమాతుః కేవలం ప్రియత్వేపి తద్విషయే పితృశాసనాభావే జననీ జనకోభయసమ్మతత్వేన వనగమనమేవ ఆచరణీయమితి నిశ్చిత్య వనం గతవానితి భావః- ఏవం చ సాక్షాత్స్వమాతుః ప్రియమపి హిత్వా సపత్నీ మాతృహితానువర్తిత్వేన అస్య గుణశ్రేష్ఠతా ధ్వన్యతే॥

తా॥ 'సః' (అట్టివాడు) అనుటచే విఘ్నములు హెచ్చుగ నున్నను ప్రతిజ్ఞ చేసిన వనవాసమును నిర్వహించుటయం దాసక్తి గలవాడనుట వ్యక్తమగుచున్నది. 'వీరం' అనుటచే అరణ్యమందలి రాక్షసాదులవలన భయము నొందనివాడని బోధింపబడుచున్నది. 'వచననిర్దేశాత్' 'తండ్రియొక్క వాక్య నిర్దేశమువలన' అనుటచే తండ్రికి వనవాస మిష్టము కాకున్నను, ఆతని వాక్యమాత్రమందు శ్రుతివాక్యమందువలె గౌరవము నుంచి యని యర్థము. "ప్రియకారణమువలన" అనగా తల్లి యగు కైకకు ప్రియమగుగాక యను హేతువువలన యని యర్థము 'ప్రతిజ్ఞను పాలించుచు' అనగా వనవాసము తప్పక చేయదగిన దను ప్రతిజ్ఞను పాలించుచు అని యర్థము. "శ్రేయస్సుల కనేక విఘ్నములు" అను న్యాయముచే తన వ్రతమునకు విఘ్నబాహుళ్యముచే భంగము కలుగునేమో యని అనుగడుగునకు దానిని రక్షించుటయందే మునిగిన చిత్తముగలవాడై అని యర్థము.

వనవాసము లేకుండుట తన తల్లికి (కౌసల్యకు) మిక్కిలి ప్రియమైనను, దానికై పితృశాసనము లేకుగాన తల్లిదండ్రుల కిద్దరకు సమ్మతమగు వనగమనమే చేయతగినదని నిశ్చయించి, వనమున కేగెనని భావము. కావున నేరీతిగను తనతల్లికి వనవాసము లేకుండుట ప్రియమైనను వదలి సవతితల్లికి హితమగు దానినే (వనవాసమునే) యనుసరించుటచే నీతని గుణముల యాధిక్యము తోచుచున్నది.

శ్లో॥ తం వ్రజంతం ప్రియో భ్రాతా లక్ష్మణోఽనుజగామహ।
స్నేహాద్వినయ సంపన్న స్సుమిత్రానందవర్ధనః॥

శ్లో। భ్రాతరం దయితో భ్రాతుస్సౌభ్రాత్ర మనుదర్శయన్॥

వ్యా॥ ప్రియః ప్రేమవిషయః లక్ష్మణోహ లక్ష్మణ ఏవ- అనుజగామ ఆత్మ ప్రేమాస్పదత్వేన అపరిత్యాజ్యత్వేపి స్వనిమిత్తమన్యస్య క్లేశో మాభూదితి దయయా ఆత్మానం పరిత్యజ్య- వ్రజంతం- గచ్ఛంతం- బిభర్తి అపరిచ్ఛిన్నానందకరత్వే నేతి భ్రాతరం- బిభర్తి సేవాచాతుర్యేణేతి భ్రాతా- వినయ సంపన్నః- సహజవినయయుక్తః ఇతి అప్రత్యాఖ్యానే హేతుః- భ్రాతుశ్శ్రీరామచంద్రస్య సౌభ్రాత్రం భ్రాతృగుణసంపత్తిం అనుదర్శయన్ అన్యేషాం ప్రకటయన్- సుమిత్రానందవర్ధనః- శరీరక్లేశమవిగణయ్య పరమపురుషసేవయా మహాఫలం సంపాదయితుం స్వయముద్యుక్తస్య ఆత్మపుత్రస్య ధీరత్వవిజ్ఞానేన సుమిత్రాయాః సంతోషాతిశయః- స్నేహాత్ - అంతర్ద్రవాత్ మాతరి వత్స ఇవ- అనేన భ్రాత్రనుగమనే సహజమేవ కారణమితి సిద్ధం॥

ఇతి శ్రీమద్రామాయణే బాలకాండే ప్రథమసర్గే హారితస
గోత్రోద్భవేన బొమ్మకంటి నృసింహశాస్త్రి విరచి
తాయాం కల్పవల్లికాఖ్యాయాం వ్యాఖ్యాయాం
ప్రథమః కిసలయః.

తా॥ 'ప్రియః' ప్రేమకు విషయభూతుడగు లక్ష్మణుడే యనుసరించి వెడలెను. 'వ్రజాతం' తనకు మిక్కిలి ప్రేమాస్పదుడగుటచే (లక్ష్మణునకు) విడిచిపెట్ట తగనివాడైనను, తనకొఱకై యితరులకు క్లేశము కలుగకుండుగాక యని దయతోనున్నట్టియు, తన్ను వదలి వెడలుచున్న "భ్రాతరం" ఎడ తెగని యానందమును కలుగజేయువాడగుటచే భరించునట్టి రాముని, "భ్రాతా" సేవాచాతుర్యముచే భరించువాడై, "స్నేహాద్వినయసంపన్నః" "సహజవినయముతో గూడినవాడు" అనుటచే నీతని వాక్యము త్రోసివేయుటకు వీలు లేదని తోచుచున్నది. "సౌభ్రాత్రం" సోదర గుణసంపత్తిని, "అనుదర్శయన్" ఇతరులకు ప్రకటించుచు.

"సుమిత్రానందవర్ధనః" తన శరీరమునకు క్లేశము గలుగుటను లెక్కింపక, పరమపురుషుని సేవచే మహాఫలమును సంపాదించుటకై స్వయముగనే ఉద్యుక్తుడైన తన పుత్రుని ధీరత్వమును దెలిసికొని సుమిత్రకు సంతోషాతిశయము కలిగెననుట. "స్నేహాత్" హృదయ ద్రవీభావమువలన దూడ తల్లిననుసరించినట్లు స్వయముగనే లక్ష్మణుడు శ్రీరాము ననుసరించెనని భావము.

ఇట్లు శ్రీహారితసగోత్రోద్భవ బొమ్మకంటి నృసింహ
శాస్త్రి విరచితంబైన శ్రీమద్రామాయణ
కల్పవల్లికా వ్యాఖ్యానమందు ప్రథమ
కిసలయము సంపూర్ణము.

అథ ప్రథమ కిసలయోక్త గ్రంథదిశా ప్రతిశ్లోకం ప్రతి పదం చ సవిమర్శం తత్తదర్థవ్యాఖ్యాశాస్త్రవిశేషాది ప్రతిపాదన పూర్వకం కృత్స్నస్యాప్యస్య మహాకావ్యస్య వ్యాచిఖ్యాసితత్వే ఽపి విస్తరభయేన తదుపేక్ష్య ఉపక్రమగ్రంథ చరమభాగోక్తక్రమేణ పూర్వవ్యాఖ్యానైరగతార్థాన్ ప్రతికాండం తత్తద్ఘట్టీయ శ్లోకాన్ సంగృహ్య యథామతి సహృదయ హృదయాకలనాయ వివృణోమి.

తా॥ మొదటి కిసలయమున జెప్పిన గ్రంథరీతిని ప్రతి శ్లోకమునందు ప్రతి పదమునకు సవిమర్శముగ నానా యర్థముల వలన దోచెడి శాస్త్రవిశేషములను తెలుపుచు, ఈ మహా కావ్యమున కంతకు వ్యాఖ్యానము చేయువలెనను నిచ్ఛ యున్నను విస్తరభీతిచే నాయిచ్ఛను వదలి, ఉపక్రమ గ్రంథాంతమున చెప్పిన రీతిని పూర్వవ్యాఖ్యానములచే గతార్థములు గానట్టియు ప్రతి కాండయందు నానా ఘట్టములలో నుండెడి శ్లోకములను సంగ్రహించి నాబుద్ధి ప్రసరించినంతవఱకు సహృదయుల హృదయముల కానందము గలుగునట్లుగ వివరించు చున్నాడను.

శ్లో॥ తేషామపి మహాతేజా రామస్సత్యపరాక్రమః ।
ఇష్టస్సర్వస్య లోకస్య శశాంక ఇవ నిర్మలః॥

వ్యా॥ మహాతేజా అపి- సత్యమేవ న్యాయ్యమేవ యత్కార్యం తస్మిన్నేవ పరాక్రమముపయుఙ్క్తే। నతు శక్తిమత్తయా అయుక్తే ప్రవర్తతే। అతః సత్యపరాక్రమః- అన్యథా

ఖలత్వమేవ స్యాదితిభావః నిర్మలశ్శశాంక ఇత్యనేన తస్య శార దత్వం ప్రతీయతే- తదానీం కాంత్యతిశయేన కలంకాభివ్యక్తే స్ఫుటత్వాత్- అత ఏవ ఇష్టస్సర్వస్య లోకస్య ఇతి సుష్ఠు- కాలాంతరీయ చంద్రసామ్యంతు ఇతరేషాం త్రయాణామితి గమ్య తే! ఇదంచోత్తరత్ర అయోధ్యాకాండే భరత లక్ష్మణాదీనాం మాతా పిత్రాదే ర్వధోద్యమకథాంశేన అయోగ్యశక్తిప్రకట నాభిప్రాయకం॥

తా॥ 'సత్యపరాక్రమః' మిక్కుటమగు తేజస్సు గలవా డైనను సత్యము, న్యాయము నగు కార్యమునందే పరాక్రమము నుపయోగించుచున్నాడు. శక్తి యున్నదని అయుక్తమగు కార్య మునకై ప్రవర్తించుట లేదు. కావుననే సత్యమగు పరాక్రమము గలవాడు. లేనిచో దుర్మార్గతయే వాటిల్లు నని భావము. "శశాంక ఇవ నిర్మలః" నిర్మలమగు చంద్రుడు అనుటచే, శర త్కాల చంద్రుడని విదిత మగుచున్నది. ఆసమయముననే కాం త్యతిశయముచే కళంకము స్ఫుటముగ గానవచ్చును. కనుకనే "సమస్తలోకములకు ఇష్టుడు" అనుట తగియున్నది. ఇతరసమ యముల యందలి చంద్రునితో పోలిక మిగిలిన ముగ్గురికి కలదని తోచెడిని. అయోధ్యాకాండలో చెప్పబోవు రీతిని భరత లక్ష్మ ణాదులు తల్లిదండ్రులను వధించు ప్రయత్నము గలవారగుటచే అయోగ్యమగు శక్తిగలవారని తెలుపుటకే యిట్లు చెప్పబడినది.

శ్లో॥ న చ తేన వినా నిద్రాం లభతే పురుషోత్తమః ।
మృష్ట మన్న ముపానీత మశ్నాతి న చ తం వినా॥

వ్యా॥ తేన వినా నిద్రాం నలభతే- పూర్వం తస్మిన్ని ద్రాత్యేవ పశ్చాత్స్వస్య నిద్రాలాభ ఇత్యర్థః-అమానుష సర్వ సుఖాస్పదస్య యథాకాలం నిద్రాయాః ప్రవృత్తేరున్నతస్థలీ యస్యాంభసః నిమ్నభాగ ఇవ శీఘ్ర ప్రవృత్తే స్సహజత్వేపి లక్ష్మణనిద్రాప్రవృత్త్యనంతరమేవ స్వస్య నిద్రాప్రవృత్తిరితి అను జేఽస్య విజాతీయం ప్రేమేతిభావః। ఏవ ముత్తరవ్యాక్యార్థస్యాపి తాత్పర్యం- నతు భుజ్యాద్యర్థే సాహిత్యం వివక్షితం- తథాత్వే సహేత్యేవ బ్రూయాత్ -నతు వ్యతిరేకముఖేన-నఞ్ ద్వయస్య వివక్షితసాహిత్యదార్ఢ్యార్థకత్వం తు న। తావదభిప్రాయస్య సహశబ్దప్రయోగేపి లాభాత్- చమత్కార విశేషాభావేన అలంకారకల్పనాయా అనవకాశః- అత ఏవ "మాత్రా సహ కుమారం భోజయేత్" ఇత్యాదావవధారణ పరతయైవ వ్యవహ రన్తి భట్టీయాః॥

తా॥ "న చ తేన వినా నిద్రాం" "ఆతని విడచి నిద్రింపడు" అనగా ముందుగ లక్ష్మణుడు నిద్రించిన పిమ్మటనే తాను నిద్రించునని యర్థము. అమానుషమగు సర్వసుఖముల ననుభవించెడి తనకు సరియగు సమయమున నిద్రాప్రవృత్తి, ఎత్తైన ప్రదేశమునందలి నీరు పల్లమునకు ప్రవహించునట్లు శీఘ్రముగ కలుగుట సహజమైనను, లక్ష్మణుడు నిద్రించినతరువాతనే తాను నిద్రింప గడగు ననుటచే సోదరునియం దీతనికి విలక్షణమగు ప్రేమ కలదని భావము. తరువాతి వాక్యమునకుగూడ నిట్లే యర్థము చెప్పవలెను. కాని భోజనము మున్నగువాని నొకే

సారి చేయుచున్నారని చెప్పగూడను. అశ్లైసచో (సహ) వాని తోగూడ అనియే కవి చెప్పియుండెడివాడు.

శ్లో॥ సర్వ ప్రియకర స్తస్య రామస్యాపి శరీరతః ।
లక్ష్మణో లక్ష్మిసంపన్నో బహిఃప్రాణ ఇవాపరః॥

వ్యా॥ అపిశబ్దో భిన్నక్రమః - శరీరతోపి। తద్ధి కదాచిద ప్రియాయాపి భవేదిత్యర్థః॥ అత ఏవ శరీరపదప్రయోగః-యద్వా, సర్వప్రీతిహేతుభూత రామశరీర ప్రియకరస్య లక్ష్మణస్య యోగ్యతాం వ్యనక్తి- శరీరతోపీతి । బహిఃప్రాణ ఇతి- హృదిప్రాణ ఇత్యాదినా ప్రాణాదీనాం స్థలవిశేషనియమః శాస్త్రప్రసిద్ధః॥ అయన్తు సర్వదేశావచ్ఛిన్నస్సన్ రామశరీరం రక్షతీత్యపర విశేషణం॥

తా॥ "రామస్యాపి" అను నీస్థలమున నున్న "అపి" శబ్దమును "శరీరతః" అను పదము తరువాత జేర్చుకొని అన్వయము చెప్పవలెను. శరీర మొకప్పుడు అసంతుష్టిని కలుగజేయవచ్చును. లక్ష్మణు డట్టివాడు కాడని తెలుపుటకే ఇచ్చట "శరీర" పదమును ప్రయోగించినాడు. లేదా, అందఱకు ప్రీతిని కలుగజేయు రాముని శరీరమునకుగూడ ప్రియమును కలిగించువాడు లక్ష్మణుడనుటచే నాతని యోగ్యత విదిత మగుచున్నది. 'బహిఃప్రాణః' బయిటి ప్రాణము, లోపలి ప్రాణము, అని ప్రాణాదులకు స్థలవిశేష నియమము శాస్త్రములందు ప్రసిద్ధము. ఈతడు సమస్త దేశమందు నుండి రాముని శరీరమును రక్షించుచున్నాడని, యీ విశేషణముచే వ్యక్తమగుచున్నది.

శ్లో॥ తే యథా జ్ఞానసంపన్నా స్సర్వైస్సముదితాగుణైః।
ప్రీమన్తః కీర్తిమన్తశ్చ సర్వజ్ఞా దీర్ఘదర్శినః।

వ్యా॥ ప్రీమన్తః-సర్వగుణసత్త్వేపి స్వాపేక్షయా మహత్తరపురుషకథాశ్రవణే తదపేక్షయా వయం నికృష్టా ఇతి జిహ్రీయతీత్యర్థః-కీర్తిమన్తః-తాదృశమహాపురుషేభ్యోఽపి కీర్తిమాశాసానా ఇత్యర్థః। సర్వజ్ఞాః- తాదృశయశః ప్రయోజకమార్గం సర్వం జానన్తీత్యర్థః- దీర్ఘదర్శినః- తథావిధ యశస్సంపాదనే స్వశక్తిముద్భావయన్త ఇత్యర్థః-

తా॥ "ప్రీమన్తః" సమస్తగుణము లున్నను తనకంటె గొప్పవాని కథలు వినునపుడు వానికంటె మనము నికృష్టులమని లజ్జపడువారు. "కీర్తిమన్తః" అట్టి మహాపురుషుల కుండెడి కీర్తికంటె నెక్కుడగు కీర్తిని గోరెడువారు. "సర్వజ్ఞాః" అట్టి యశస్సును గలుగజేయు మార్గము నంతను ఎరుగునట్టివారు. "దీర్ఘదర్శినః" ఆయశస్సంపాదనమున తమ శక్తి నూహించుకొనువారు అని యర్థము.

శ్లో॥ తస్య చింతయమానస్య మంత్రిమధ్యే మహాత్మనః।
అభ్యాగచ్ఛన్మహాతేజా విశ్వామిత్రో మహామునిః॥

వ్యా॥ చింతయమానస్యేతి- వర్తమానశానచా చింతాసమకాలమేవ తదీయ వాంఛితసిద్ధిరితి దశరథస్య సుకృతాతిశయప్రకటనం- "యస్యచభావేనే త్యనేన" షష్ఠీతి వ్యాఖ్యానం తదనువృత్తిక "షష్ఠీచానాదరే" ఇత్యనేనేత్యర్థకం-యథాశ్రుతే తేన సప్తమీమాత్రస్యైవ విధానే నాస్యాసామంజస్యప్రసంగాత్ -

అనాదరస్తు త్వత్సంకల్పవిషయో నాస్య పరిణయక్రమః- కింత్వ స్మత్సంకల్పవిషయ ఏవేతి స్వీయభావ్యర్థ జ్ఞానశక్తిజ్ఞాపనద్వారా దశరథస్య తదనభిజ్ఞత్వ జ్ఞాపనాత్మక ఏవేతి సమన్వయం। వస్తు తస్తు భాగార్థకేనాభిశబ్దేన సంబంధః, యదీప్సితం దశరథస్య తత్సంపాదనానుకూల ఇత్యర్థః- స్వీయయాగాది కార్యనిర్వహణ స్యాపి తదసంకల్పితస్య మున్యభిప్రేతత్వేన భాగత్వోక్తిరితి షష్ఠీ సమర్థనం సుకరం॥

తా॥ "చింతయమానస్య" అను నివర్తమానార్థమును విధింపబడిన "శానచ్" అను ప్రత్యయముచే దశరథునకు తా నాలోచించు సమయముననే కోరిన కోరిక సిద్ధించెనని ప్రకటిత మగుచున్నది. ఇచ్చట "యస్యచ భావేన భావ లక్షణం" అను వ్యాకరణసూత్రముచే షష్ఠి వచ్చినదని వ్రాసిన వ్యాఖ్యానము, ఆసూత్ర మధికారముగాగల "షష్ఠీచానాదరే" (అనాదరాతి శయము ద్యోత్యమగునపుడు షష్ఠి వచ్చును) అను సూత్రముచే షష్ఠి వచ్చునని తెలుపుటకే. ఈ అనాదర మెట్టిదనిన, శ్రీరాముని వివాహక్రమము నీ (దశరథుని) సంకల్పవిషయము కాదు; నా సంకల్పవిషయమే యని విశ్వామిత్రుడు, తన కున్నట్టి రాబోవు విషయములను తెలిసికొనెడి శక్తిని దెలుపుచు దశరథున కట్టి జ్ఞానము లేదని తెలుపుటయే.

బాగుగ నాలోచించిన చో "అభ్యగచ్ఛత్" అను పదము నందలి భాగార్థకమగు 'అభి' శబ్దముతో సంబంధము, దశరథున కేది యభిమతమో దానిని సంపాదించుటకు అనుకూలముగ

ఃని యర్థముగలది. దశరథుడు సంకల్పించునట్టి తన యాగాది కార్యములను శ్రీరాముడు నిర్వహించుట విశ్వామిత్రున కభి ప్రేతమే గాన "భాగత్వేను" సిద్ధించి షష్ఠీవిభక్తి సిద్ధించును.

శ్లో॥ యథామృతస్య సంప్రాప్తిర్యథావర్షమనూదకే।
యథాసదృశదారేషు పుత్రజన్మాప్రజస్యచ।

శ్లో॥ ప్రణష్టస్య యథాలాభో యథాహర్షో మహోదయే।
తథైవాగమనం మన్యే స్వాగతం తే మహామునే॥

వ్యా॥ అమృతస్య యజ్ఞశిష్టస్య అనూదకే- మదీయే దేశే- సర్వకాల మవిచ్ఛన్నసస్యసంపత్తయే నదీమాతృకత్వం దేవమాతృకత్వం వా నిమిత్తం। తచ్చ దైవానుగ్రహాత్ యథా దేశకాలం వృష్టిమన్తరా నసంభవతి- తాదృశం వర్షం- అప్ర జస్య- అప్రజత్వేన నిశ్చితస్య మమ పుత్రజన్మ- ప్రణష్టస్య- ప్రజాలాభాత్పూర్వం మృతస్య మమ పునః లాభః సత్తా "ఆత్మావై పుత్రనామాసీ" తి శ్రుతేః। మహోదయే- అతర్కి తోపనతైతాదృశోత్సవే హర్షః- మమ యథా దైవానుగ్ర హేణ నిరంతరాయం సర్వమేతన్నిష్పన్నం తథైవ తాదృశయావ త్ప్రకారసముదాయహేతు తయైవ మదీయమహాతపః ఫలభూ తం తవాగమనం స్వాగతమితి మన్యే ఇత్యర్థః- ఏవం చ యథా మమ అమృతం న యాగమాత్రాత్ శిష్టం భవతి కింతు యథా వదనుష్ఠితాదేవ యాగాదితి తత్సిద్ధిః- "యజ్ఞాద్భవతి పర్జన్య" ఇత్యాది ప్రమాణేన సత్క్రియత్వే ఖలు మమ రాజ్ఞః సర్వ సస్యానుకూలవర్షద్వారా మమదేశే సర్వత్ర ప్రజానాం సమృ

ద్ధిః- యథా వా ఏతావన్తం కాలమపుత్రస్య వర్షీయసో మమ భగవత్ప్రసాదాత్ భార్యాసు తిసృష్వపి సుపుత్రావాప్తిస్తతశ్చాపుత్రత్వేన ఇతః పూర్వం మృతప్రాయస్య మమ యథా "తదుతే మర్త్యామృత" మితి శ్రుత్యా అమృతత్వలాభః తతస్తాదృశపుత్రవిషయే కల్యాణవిమర్శ సమయే అతర్కితోపగతస్య తవ మదీయ గృహాగమనరూపమహోత్సవే సంతోషాతిశయ ఇత్యేతత్సర్వం సముదితం భవదాగమన సుకృతఫల మితి తర్కయామీతి ఫలితం- ఏతత్పక్షే అనూదకే ఇతి విషయసప్తమీ- అనుగత జలయుక్తత్వరూపధర్మపరతయా యోజ్యం- యత్తు అనూదకే ఇత్యత్ర స్వమతే "అన్యత్రాపి దృశ్యత" ఇత్యనేన దీర్ఘ ఇతి ప్రాచాం వ్యాఖ్యానం తత్తు నసమ్యక్- "ఉపసర్గస్య ఘఞ్యమనుష్యే బహులం" ఇతి సమాసప్రకరణస్థోత్తరపదాధికారీయసూత్రఘటకబహుళగ్రహణేన దీర్ఘ ఇతి వ్యాఖ్యాతుముచితత్వాత్- దృశి గ్రహణస్య బహుళగ్రహణ తుల్యార్థకత్వేపి ప్రకరణభేదేన స్ఫూర్తి విలంబాత్ ॥

తా॥ యజ్ఞశేషము, ఉదకము లేని నాదేశమందు వర్షము, ఇంతవరకు పుత్రులు లేరని నిశ్చయించుకొనిన నాకు తగిన దారలయందు పుత్రులు పుట్టుట, సంతానము కలుగకముందు మృతుడనైన నాకు తిరిగి యునికి, ఈమహోత్సవ సందర్భమున హర్షము యెట్లు సమకూడెనో, అట్లే, తమ రాకగూడ సమకూరినది. తమరు వచ్చుటచేతచే పైశుభము లన్నిటికి గారణమగు నా మహాతపస్సు ఫలించెనని తలచుచుంటిని.

నా కమృతము, యాగము చేసినంతమాత్రమున శిష్టము
గాదు. యథావిధిగ యాగము ననుష్ఠించినపుడే అట్లు అగును.
తమ రాక చేతనే నేను యథావిధిగ యజ్ఞముచేసినవాడ నైతిని.
సర్వకాలములయందును దేశ మవిచ్ఛిన్నమగు సస్య సంపత్తితో
గూడి యుండవలయు నన్నచో నదీమాతృక మేని (ప్రవాహ
జలము సస్యాధారముగా గలది) దేవమాతృక మేని (వర్షోదకము
సస్యాధారముగా గలది) గావలయును. దైవానుగ్రహముచే
దేశకాలానుకూలముగ వర్షించినపుడే అట్లగుట తటస్థించును.
అట్టి దైవానుగ్రహమును యజ్ఞములను బాగుగ ననుష్ఠించి
నపుడే సిద్ధించును. "యజ్ఞమువలన మేఘము లుత్పన్న మగును."
మున్నగు ప్రమాణములచే రాజునైన నేను సత్క్రియల నను
ష్ఠించినచో సర్వసస్యములకు ననుకూలమైన వర్షము గురిసి
నాదేశమందలి ప్రజలకు సర్వ సస్యసమృద్ధి గల్గును. అట్టి
సమృద్ధి నా దేశమం దుండుటయు తమ శుభాగమనమునే
గలిగినది. ఏరీతిగ నింతవరకు పుత్రులు లేనివాడనై మునసలి
నగు నాకు భగవదనుగ్రహమున పుత్రులు లభించిరో, పుత్రులు
లేనిచో మృతప్రాయుడ నైన నాకు పుత్రలాభముచే నమృ
తత్వము సిద్ధించినదో, అట్టి పుత్రులకు కల్యాణమునుగూర్చి
చింతించునపుడు ఆకస్మికముగ తమరు మాయింటికి వచ్చుట
యనెడు మహోత్సవమున నాకు సంతోషాతిశయము గల్గినదో,
అది యంతయు నే నొనరించిన మహాపుణ్యముల ఫలమగు తమ

శుభాగమనమునసే కలిగెనని యూహించువాడను అని ఫలి
తార్థము.

శ్లో॥ కం చ తే పరమం కామం కరోమి కిము హర్షితః ।
పాత్రభూతోసి మే బ్రహ్మన్ దిష్ట్యా ప్రాప్తోసి కౌశిక॥

వ్యా॥ కం పరమం అన్యదుష్కరం. కామం కామనా
విషయం కరోమి కుర్యాం ప్రార్థనాయాం వ్యత్యయేన లట్-
కిమితి తవ త్వరేత్యత్రాహ-కిం కిం వా హర్షితః తారకాదిత్వా
దితచ్- హర్షయుక్తో హం కృత ఇతి శేషః- అతః త్వన్నిమిత్తక
హర్ష ఏవ త్వత్కార్యనిర్వర్తనే త్వరయతీతి భావః॥

తా॥ ఇతరులకు చేయ శక్యముగాని నీకార్యమును దేనిని
నేను చేయువాడను? నీ కీతొందర యేల యనియెదరేమో;
తమరు వచ్చుటచే గలిగిన యానందాతిశయము మే, తమ కార్య
మును నిర్వహించుటకై నన్ను తొందర పెట్టుచున్నది.

శ్లో॥ సదృశం రాజశార్దూల తవైతద్భువి నాన్యథా ।
మహావంశ ప్రసూతస్య వసిష్ఠవ్యపదేశినః॥

వ్యా॥ ఏతత్-పూర్వోక్తప్రక్రమవిశిష్టం వాక్యం. అన్యథా-
ప్రకారాన్తరయుక్తంచేత్-న సదృశం నభవతి। సాదృశ్యప్రయో
జకధర్మసంపత్తిమాహ- మహావంశప్రసూతస్యేత్యాది- వంశః
కులం విద్యాసంతతిశ్చ- తదుద్భవస్య వసిష్ఠవ్యపదేశినః- త్వమివ
త్వద్వాక్యమపి తదుపదేశయుతం- విద్యాభావే తత్రాపి సంప్ర
దాయప్రవర్తకగురూపదేశాభావేన కథం త్వద్వాక్యం త్వమివ
మాననీయం స్యాత్ అత ఏవ "వేదమువాక్యాన్యాన్యే... 

సీన మను శాస్తి" ఇత్యాదినా అధ్యాపనమనుసృత్య శిష్యప్రవర్త నాద్యుపయోగ్యుపదేశోపి చోద్యతే । అత స్త్వత్సాదృశ్యం త్వద్వాక్యే ఘటత ఇతి భావః॥

తా॥ "ఏతత్" పూర్వమున చెప్పబడిన క్రమముతో గూడిన వాక్యము, ఈలోకమున రాజశార్దూలుడవైన నీకే తగుచు. "అన్యథా" నీవాక్యము మఱియొకరీతి నున్నచో తగదు. ఏలనన నీవు గొప్పవంశము, విద్య, సంతతి, ఉత్తమోత్పత్తిస్థానముగ గలవాడవు. వసిష్ఠుని యుపదేశము గలవాడవు. నీ వెట్లు ఆతని యుపదేశముతో గూడినాడవో నీవాక్యము నట్లే యాతని యుపదేశముతో గూడినది. విద్య లేకున్నను, అంశనను, సంప్రదాయ ప్రవర్తకుడగు గురువుయొక్క ఉపదేశము లేకున్నను, నీవాక్యము, నీవువలె యెట్లు గౌరవింపదగియుండును. కావుననే "వేదమును జెప్పి ఆచార్యుడు శిష్యుని శాసించును" అను శ్రుతివాక్యముచే అధ్యాపనమున కనువుగ శిష్యప్రవర్తనకు తగిన ఉపదేశముగూడ గురువు చేయువలెనని తెలుపుచున్నది. కావున నీపోలిక నీవాక్యమునందును గలదు.

శ్లో॥ అహం వేద్మి మహాత్మానం రామం సత్యపరాక్రమం ।
వసిష్ఠోఽపి మహాతేజా యేచేమే తపసి స్థితాః॥

వ్యా॥ అహం వేద్మీతి అద్యాపి రామమహాత్మ్యజ్ఞానా ద్యైవ ప్రమత్త ఇత్యర్థః- మహాతేజాః స్వస్మాదపి బ్రహ్మవర్చస్వీత్యర్థః। వేత్తీతి విపరిణామ్యతే- తపసి స్థితా ఇతి- "తపసి సర్వం ప్రతిష్ఠితం" ఇతి శ్రుతత్వాత్ తదేకశరణా ఇమే మదాగమసముప

లక్ష్మ్య సమాగితా నారదాదయోఽపి విదంత్యేవ। తే పుత్రస్య మాహాత్మ్యం నతు జ్ఞాతమేతత్। కిం తపసేతి తతో నవిరతా ఇతి వర్తమాన ప్రత్యయాల్లభ్యతే ఏవం చ తదీయ మాహాత్మ్య మపరిచ్ఛిన్న మితి భావః। వస్తుతస్తు మహాత్మానం రామం అహం వేద్మి- అకార హకారస్వరూపం అహం వేద్మి- "అకారస్సర్వ వర్ణాగ్ర్యః ప్రకాశః పరమశ్శివః। హకారోఽన్త్యః కళారూపో విమర్శాఖ్యః ప్రకీర్తితః" ఇతి సంకేతపద్ధత్యుక్తదిశా శివశక్తిస్వ రూపం జానామీత్యేవార్థః। సత్యపరాక్రమః- సత్యా త్రికాలా బాధ్యా యా పరా చిత్కళా తత్ప్రక్రమం తత్పరిపాటీకం తద్రూ పమిత్యర్థోఽత్ర పక్షే గ్రాహ్యః ఇతి రహస్యం। స చ ప్రకాశవిమర్శ పదార్థప్రతిపత్తిప్రకారశ్చేత్థం సంగ్రహేణ నిరూప్యతే వైవ ర్తనయే। సచ్చిదానందలక్షణః పరమాత్మా స్వప్రకాశరూపః కర్తృత్వాద్యభావవాన్- ఇత్యాదినా కశ్చిత్పదార్థో నిరూపితః- స చ అహంప్రత్యయవిషయ ఇతి చ- తత్ర చ కర్తృతా శక్తిరూపా స్వభావాభిన్నా అకామేనాప్యభ్యుపేయా అస్తీతి తు తాంత్రికాః। అనుభవం విశ్వజనీనంచ తే వ్యరూపయన్- జానాతి స్ఫురతీ త్యాదౌ ధాత్వాఖ్యాతరూప దళద్వయేన తథాత్వ ప్రతీతేర వర్జనీయత్వాత్- సా చ శక్తిః విమర్శః స్పందః ఉద్యమః కళా ఇత్యాది శబ్దైరభిధీయమానా ఆత్మస్వభావరూపేత్యాదినా. అత్ర బహువక్తవ్యమపి విస్తరభయాన్నపరమ్యతే। ఏవంచ ఏతాదృశే మహిమ్ని శ్రీరామే [illegible] స్యార్థబుద్ధిః ప్రాకృతత్వభావః।

తా॥ మహాత్ముడగు రాముని నేను తెలిసికొనుచున్నాను. అనగా నేటివరకు శ్రీరాముని మాహాత్మ్యమును తెలిసికొనుటకై నేను యత్నించుచున్నానని యర్థము. తపస్సుచేత బ్రహ్మ వర్చస్వియగు వసిష్ఠుడును తెలిసికొనుచున్నాడు. "తపస్సునందే సర్వము ప్రతిష్ఠిత మైనది" అను శ్రుతివాక్యము రీతిని తపస్సునే యాశ్రయించినట్టియు, నారాకను గుర్తించి వచ్చిన యీ నార దాదులును నీపుత్రుని మాహాత్మ్యమును తెలిసికొనుచున్నారు. మాకును తెలిసియే యున్నది. ఇక తపస్సంపన్నులకు విరమించవలె దను నీయర్థము "వేద్మి" అను నీవర్తమాన కాలమందు విధింప బడిన ప్రత్యయముచే తోచుచున్నది. కావున శ్రీరాముని మాహాత్మ్య మిట్టిదని చెప్ప నలవి కానిది. ఇచ్చట వాస్తవమగు నర్థ మెట్లనిన, మహాత్ముడగు రాముని "అహం" గా తెలిసికొను చున్నాను. అనగా అకార హకార స్వరూపమునుగా తెలిసి కొనుచున్నాను. "అకారము సర్వవర్ణములకు ప్రథమము. స్వప్రకాశము. పరమశివస్వరూపము. హకార మన్నివర్ణము లకు చరమము. కళాస్వరూపము. విమర్శనము పేరుగలది" అని సంకేతపద్ధతిలో చెప్పినరీతిగ శివశక్తి స్వరూపునిగ తెలిసికొను చున్నాను అని యర్థము. 'సత్యపరాక్రమం' సత్యా యా పరా క్రమః' అని వ్యుత్పత్తి. త్రికాలాబాధ్యమగు మేచిత్కాళ కలదో దాని క్రమము, పరిపాటి, రూపమును గలవాడు అను నర్థ మిచ్చట ప్రతిపాదనము...

ఇక ప్రకాశ విమర్శ పదార్థ ప్రతిపత్తి యీక్రిందివిధిని సంగ్రహముగ దెలుపబడుచున్నది.

వైవర్తనయమున "సచ్చిదానంద లక్షణములు గల్గి యు, స్వప్రకాశస్వరూపుడును అగు పరమాత్మ కర్తృత్వాదులు లేనివాడు" అను నీ మున్నగుదానిచే నొకపదార్థము నిరూపింపబడినది. ఆపదార్థ మహంప్రత్యయ విషయమనియు దెలుప బడినది. అంతు "కర్తృత్వ శక్తిస్వరూపము, స్వభావముచే నభిన్నమై, కోరిక లేకయు పొందదగినది కలదు" అని తాంత్రికులు నుడివిరి. సర్వజనప్రసిద్ధమగు అనుభవమునుగూడ నిరూపించిరి. ఆశక్తియే, 'విమర్శము' 'స్పందము' 'ఉద్యమము' 'కళ' మున్నగు శబ్దములచే వ్యవహరింపబడు ఆత్మ స్వభావ రూపమనియు చెప్పిరి. ఇచ్చట చెప్పదగిన యంశము చాల గలదు. విస్తరభీతిచే విరమింపబడుచున్నది.

కావున నిట్టి మహిమగల శ్రీరామునియందు నీకన్యథా బుద్ధి గలుగుట తగదని దీనిభావము.

శ్లో॥ యది తే ధర్మలాభం చ యశశ్చ పరమం భువి ।
స్థితమిచ్ఛసి రాజేంద్ర రామం మే దాతుమర్హసి॥

వ్యా॥ ధర్మలాభం బహుపుణ్యఫలం. ఈదృశే సుగుణాకర సుపుత్రవాప్త్యా యశః- ఏతన్మహాఫలలాభేన సకలదిగన్త విశ్రాంతం చ। స్థితం సిద్ధం। దాతుం- అధీనీకర్తుం। నిరుక్తత్వేదీయ మహాఫలద్వయస్యాపి శ్రీరామచంద్రస్య మదధీనీకరణోత్తర కాలిక [illegible] హి. సుపుత్ర

స్యాపి జననమాత్రేణ పిత్రోస్సార్థక్యం- నవా తావన్మాత్రప్రయుక్తకీర్తేర్వా। కింతు తదీయపరోపకారకరణ లోకోత్తరవిద్యాగ్రహణానన్యసాధ్యమహాకార్య కరణస్యైవానుకూలసుదతీ పరిణయాదినైవ। అతః యది నమే రామం వశీకరోషి తదా విద్యమానమపి త్వదీయం ఫలద్వయం అవిద్యమానమేవేతి భావః- యద్వా- ధర్మలాభం- ఆముష్మికోపయోగిపుణ్యఫలం-పరమం సర్వోత్కృష్టం- యశః- ఐహికం ఫలం- పరమమిత్యుభయాన్వయి- స్థితం- శాస్త్రసిద్ధం- ఇచ్ఛసియది- పురుషమాత్రేణావశ్యకామ్యతయా అభిప్రైషి చేత్ తదా మే రామం దాతుమర్హాసి అధికరోషి స్వర్గకామనాయా జ్యోతిష్టోమాధికారనిమిత్తత్వవత్ ఇహపరోపకారక కీర్తిపుణ్యాతిశయ కామనాయాస్తే మత్సంప్రదానక రామకర్మక దానాధికారనిమిత్తత్వం తదభావస్య తద్విఘటకత్వాదితి భావః॥

తా॥ ధర్మలాభం" విస్తారమగు పుణ్యఫలమును, ఇట్టి సుగుణాకరుడగు సుపుత్రునిపొందుటచే లభించిన విస్తారమగు పుణ్యఫలమును "పరమం యశః" ఇట్టిమహాఫలమును పొందుటచే కలిగిన సకలదిగంతవిశ్రాంతమగు కీర్తిని "స్థితం" సిద్ధమైన దానిని "దాతుం" అధీనముచేయుటకొరకు ఇచ్ఛయించినచోనని యర్థము. ఈచెప్పబడిన నీసంబంధమగు మహాఫలద్వయము, (పుణ్యము, కీర్తి) శ్రీరామచంద్రుని నాకు స్వాధీనము చేసినపిమ్మట కలిగెడి సకలశ్రేయస్సంబంధమునకు కారణమగుట వలన అని భావము. సుపుత్రుడు కలిగినమాత్రముచే, తల్లిదం

ద్రులకు సార్థక్యముండదు. ఆతడు కలుగుటచే వచ్చెడి కీర్తివల్ల నను ప్రయోజనము లేదు. ఇక నాతడు చేయు పరోపకారములు, నేర్చుకొనిన లోకోత్తరవిద్యలు, ఇతరులకు చేయ శక్యముగాని మహాకార్యములను జేయుట, అనుకూలమగు భార్యను వివాహ మాడుట, మున్నగువానిచేతనే సార్థక్యము కల్గును. కావున రాముని నాకధీనుని చేయకున్నచో నీకున్న ఫలద్వయము లేనట్టిదే యగును. అని భావము.

లేదా, "ధర్మలాభం" పరలోకమున కుపయోగించు పుణ్యఫలమును "తరమం" సర్వోత్కృష్టమగు "యశః" ఐహిక ఫలమును "స్థితం" శాస్త్రసిద్ధమైనదానిని "ఇచ్ఛసియది" పురుష మాత్రునిచేత తప్పక కోరదగినదానినిగా తలచినవాడవగుచో, అప్పుడు రాముని నాకిచ్చుటకు అధికారి వగుదువు. స్వర్గమందలి కోరికకు జ్యోతిష్టోమయాగాధికార మెట్లు కారణమగునో ఇహ పరలోకములందుపకరించెడి కీర్తి పుణ్యాతిశయముల కోరికను, నన్నుద్దేశించి రాముని దానముచేయు నధికారము కారణమ గును. లేనిచో అట్లు ప్రాప్తించదని భావము.

శ్లో॥ యదిహ్యనుజ్ఞాం కాకుత్స్థ దదత్తే తవమంత్రిణః ।
వసిష్ఠ ప్రముఖాస్సర్వే తతో రామం విసర్జయః॥

వ్యా॥ త్వదీయశక్త్యనుసారేణైవ మంత్రపూర్వకం కుర్వి త్యాహ- యదిహీతి- విసర్జయ- గచ్ఛేత్యనుజానన్నపి స్వేచ్ఛ యైవ కుర్విత్యనుజానీహి తత స్తదీయప్రవృత్తిరేవ త్వత్తుష్టికరీ భవిష్యతీతి భావః॥

తా॥ "నీశక్త్యనుసారముగ నాలోచించియే చేయుము. "విసర్జయ" వెడలుమని చెప్పుచును నీ యిచ్ఛానుసారముగ చేయుమని యనుజ్ఞ నిమ్ము. దానిచే నాతని ప్రవర్తనయే నీకు సంతుష్టిని గలిగించును.

శ్లో॥ అభిప్రేతమసంసక్తం ఆత్మజం దాతుమర్హసి ।
దశరాత్రం హి యజ్ఞస్య రామం రాజీవలోచనం॥

వ్యా॥ త్వంతు మూఢతయా రామే వ్యసనీ- నతు నతాదృశ ఇతి జ్ఞాత్వా ప్రవర్తస్వేత్యాహ అభిప్రేతమితి- అభిప్రేతం- తవ ప్రేమాస్పద మపి-అసంసక్తం.. కుత్రాపి సంగవర్జితం-ఆత్మజం-పూర్వపుణ్యబలేన త్వద్గర్భసంభవం- ఏతావదేవ జ్ఞాత్వా దాతుమర్హసి- నతు తత్ప్రేషణవిషయే తవ శ్రమ ఇతి భావః- తదపి తద్వియోగకాల స్స్వల్పఏవేత్యాహ- దశరాత్రం- సంఖ్యాపూర్వకత్వాత్ "అహస్సర్వైకదేశే" త్యాదినా అచ్ప్రత్యయా న్తో రాత్రిశబ్దః 'సంఖ్యాపూర్వం రాత్రం క్లీబ' మితి నపుంసకత్వం స్యాతుమితి శేషః -యజ్ఞస్యేతి దశరాత్ర మిత్యనేనాన్వేతి- "కాలాధ్వనో" రితి ద్వితీయా- రాజీవలోచన మిత్యుపలక్షణం- సాముద్రిక సకల లక్షణానాం తతశ్చ సర్వజిష్ణురేవాయమితి సూచ్యతే॥

తా॥ నీవు మోహ్యముచే రామునియందు వ్యసనము గలవాడవు. ఆత డట్టివాడు కాడని తెలిసికొని ప్రవర్తింపుమని దశరథునకు విశ్వామిత్రుడు తెలుపుచున్నాడు.

"అభిప్రేతం" నీకు ప్రేమాస్పదుడైనను, "అసంసక్తం" దేనితోడను సాంగత్యము లేనివాఁడు. "ఆత్మజం" నీపూర్వపుణ్య బలముచే నీగర్భమున జన్మించినవాడని తెలిసికొని శ్రీరాముని నాకీయతగును. ఆతని పంపుటకై నీకేమియు శ్రమ యుండదని భావము. అట్లు పంపినను ఆతనితో వియోగము హెచ్చుగ నుండదు. యజ్ఞమునకై పదిరాత్రు లుండవలయును.

"రాజీవలోచనం" "పద్మములవంటి నేత్రములు గలవానిని" అనుటచే సాముద్రిక సకల లక్షణములతో గూడినవాడని తెలిసికొనదగును. కావున నీత డందరిని జయింపగలడనియు సూచితమగుచున్నది.

శ్లో॥ కౌసల్యా సుప్రజా రామ పూర్వాసంధ్యా ప్రవర్తతే।
ఉత్తిష్ఠ నరశార్దూల కర్తవ్యం దైవమాహ్నికం॥

వ్యా॥ రాజ్ఞాం స్వాపాత్ప్రబోధన మన్యైః లోకమర్యాదేతి స్వయమేవ తదనుపాలయన్ చిరం మాతౄ(కౌ)సలాల్యమానస్యాభినవ తద్విశ్లేషజనితోత్కంఠయా రామస్యోన్మనీభావో భవేదితి తచ్ఛాంతయే మాతరం స్మారయతి- కౌసల్యేతి- స్వవిషయే స్వమాతుః కీదృశీవావస్థా స్యాదితి రామస్య చింతా మాభూదితి సుప్రజా ఇతి-త్వాదృశ లోకోత్తర ప్రజాసంపన్నాయా స్తస్యాః కిమపి నానిష్టమితి భావః- యద్వా- శ్రీరామస్య అపరిచ్ఛేద్య మహిమతాం మనస్యనుసంధధానోఽపి తాదృశ మహాపురుషస్య సౌలభ్యేన స్వవశంవదత్వ మహాఫల మనుభవన్ తత్ప్రవిత్ర్యాః కౌసల్యాయాః శ్లోకేన గర్భమహిమానం వర్ణయతి- కౌసల్యా

సుప్రజేతి- పూర్వా సంధ్యా ప్రవర్తతే ఇతి సత్సంతానలాభప్రయు
క్తసమ్మానస్య ప్రాయశో జననీమాత్రవిషయత్వప్రసిద్ధ్యా కౌస
ల్యేతి- యద్వా- ప్రత్యహం రామస్యోత్థానసమయే అవశ్యం
మాతృసంబంధో నియతః। కించిన్మాత్రమపి కాలం తమపశ్యన్త్యాః
మాతుః కాలయాపనస్యాశక్యత్వాదిత్యత్రాపి తత్స్మరణేన
తత్సంబంధసూచనాయాహ- కౌసల్యేతి-కాలవిశేషనియత తత్త
ల్లౌకిక వైదిక కార్యేషు రాజ్ఞా మితరవిజ్ఞాపనోత్తరమేవ ప్రవృత్తి
స్వాభావ్యేన కర్మకాలం రామస్య నివేదయతి-పూర్వా సంధ్యే
త్యాది- సంధ్యాకాలికస్వాపస్య శిష్టనిందితత్వా దుత్థానం చోద
యతి- ఉత్తిష్ఠేతి-న కేవలం తత్కాలావచ్ఛిన్న సుప్తిమాత్ర ని
షేధ ఏవ తే। కింతు ప్రజాభారపీడితస్య ప్రభోః కార్యవిశేష
మాత్రావసర ఇత్యపీత్యాహ- నరశార్దూలేతి- త్వదీయాజ్ఞాయా
ఇతరేషా మవశ్యాచరణీయత్వవత్ త్వయాప్యవశ్య మాదరణీ
యం దైవశాసనమిత్యాహ-కర్తవ్యమిత్యాది- యద్వా-రామస్య
సహజధైర్యేణ స్వదత్త విద్యాబలేన చ అల్పీయసోపి క్లేశస్యా
సంభావ్యత్వేన స్వస్య సౌఖశాయనికత్వమేవ నిశ్చిన్వానోపి
ముని రభినవ విశ్లేషేణ మాతా సుఖసుప్తిం నిరుంధ్యాదితి తత్క
ృ స్నభ్యాసమాగత ఏవ సుఖాతిశయేన తస్య నిత్యప్రబోధ కా
లాతిక్రమ ముపలక్ష్య సంతోషాతిశయేన తన్మాతృ సంబంధం
స్మృత్వా- కౌసల్యేతి- మత్సేవాయా ముపయుక్తే త్వయి యథా
త్వన్మాతా నాక్లిశ్యత్ తథా తత్పుత్ర స్త్వమపీతి భావః-ప్రవర్తతే-
ఇత్యాపి సిద్ధాం నజహాతీతి తత్పుత్రోత్కర్ష ప్రశంసా। తద్యం

గస్యా నిష్టత్వేపి త్వత్ప్రవృత్తే ర్లోకానుగ్రాహకత్వమితి- ఉత్తిష్ఠ నరశార్దూలేతి-న కేవలం లోకానుగ్రహ ఏవ కింతు, విధ్యుల్లంఘనేన తవ ప్రత్యవాయోఽపి స్యాదితి కర్తవ్యమిత్యాది-మచ్ఛాసనోల్లంఘనే ప్రత్యవాయ భీత్యా యథా త్వన్మాతా త్వద్విశ్లేష దుఃఖం కించిదపి నాగణయత్ తథా తత్పుత్ర స్త్వమపీతి భావః- దశరథ సంబంధస్య తు నిరుక్తానుకూల్యా భావాదనుక్తిః॥

తా॥ రాజులను నిద్రనుండి మేలుకొలుపుట నితరులే చేయుట లోకమర్యాద. విశ్వామిత్రుడు ఆమర్యాదను తానే నిర్వహించుచు, చిరకాలమునుండి తల్లిచే లాలన చేయబడుచున్న శ్రీరామునకు క్రొత్తగ తల్లిని వీడుటవలన గలిగెడు నుత్కంఠచే వ్యాకులత గలుగునేమో యని ఆదిగులు పోగొట్టుటకై తల్లియగు కౌసల్యను "కౌసల్యా" అని స్మరించుచున్నాడు.

తన విషయమున దిగులు గలిగి కౌసల్య యెట్లున్నదో యను చింత శ్రీరామునకు లేకుండుటకై "సుప్రజా" అనినాడు. నీవంటి లోకోత్తరుడగు సంతానముతో గూడిన నామెకు ఏమియు అనిష్టము లేదని భావము.

లేదా, విశ్వామిత్రుడు, శ్రీరాముని యపరిచ్ఛేద్య (ఎన్నుటకు శక్యముగాని) మహిమను తన మనమున భావించుచున్నను, ఇట్టి మహాపురుషుని తన స్వాధీనమునం దుంచుకొనుట యను మహాఫలము ననుభవించుచున్నను, కౌసల్యయొక్కయు, దశరథునియొక్కయు, గర్భమహిమను "కౌసల్యా" "సుప్రజా" అను పదములచే వర్ణించుచున్నాడనుకొన నొప్పును.

లేదా, లోకములో యోగ్యమగు సంతానమును బడయుటచే గలిగెడి సన్మానము తెలుపుగ తల్లికే యను ప్రసిద్ధిచే "కౌసల్యా" అనినాడు. లేదా, ప్రతిదినమున మేల్కాను నపుడు రామునకు తల్లితో సంబంధ మావశ్యకముగ నియతమైనది. కొలది కాలమైనను శ్రీరాముని జూడకున్నచో, నామెకు కాలయాపనము కష్టతరమగుటకును, యిప్పు డామెను స్మరించి తత్సంబాధమును తెలుపుటకై "కౌసల్యా" అనినాడనికూడ చెప్పవచ్చును.

ఆయాకాలములయందు తప్పక చేయదగిన లౌకిక వైదిక కార్యములందు ఇతరులకు తెలిపిన పిమ్మటనే రాజులకు ప్రవృత్తి గలుగుట సహజము గాన, కర్మకాలమును విశ్వామిత్రుడు శ్రీరామునకు దెలుపుచున్నాడు. "పూర్వాసంధ్యా" ప్రాతస్సంధ్య ప్రవర్తించుచున్నది అని. సంధ్యాసమయముల నిద్రించుటను శిష్టులు నిందించుచున్నారు గాన "ఉత్తిష్ఠ" (లెమ్ము) అని లేపుచున్నాడు.

ఆకాలమున నిద్రించుటమాత్రమే నిషేధిపబడునది గాదు. ప్రజాభారముచే పీడితుడగు ప్రభువునకు కార్యవిశేషముల నాలోచింపదగిన సమయముగూడ నని సూచించుటకై "నరశార్దూల" అనినాడు. నీశాసనము ఇతరుల కెట్లు తప్పక ఆచరింపతగినదో, నీకు నట్లే దైవశాసన మాచరింపదగినదని తెలుపుటకై 'కర్తవ్యం' (చేయతగినది) అనినాడు. లేదా, శ్రీరామునికి సహజధైర్యము చేతను తా నొసగిన విద్యల

బలముచేతను, స్వల్పమగు క్లేశముకూడ నూహింప నవసరము లేదు గాన సుఖనిద్ర నగువాడని నిశ్చయించినను, విశ్వామిత్రుడు, నూతనమగు వియోగమున తల్లి సుఖనిద్రను నిరోధించునని యూహించుచు, దగ్గరకు వచ్చి సుఖాతిశయముచే నాతని నిద్రనుండి మేలుకొనవలసిన కాల మతిక్రమించినదని నిశ్చయించి, సంతోషాతిశయముచే నాతని మాతృసంబంధమును 'కౌసల్యా' అని స్తోత్రముచేయుచున్నాడు. నీవు నాసేవకై సిద్ధపడినపుడు నీతల్లి యగు కౌసల్య యేరీతిని శ్రమ జెందలేదో, ఆమెపుత్రుడవగు నీవును అటులనే యుంటివని భావము.

"ప్రవర్తతే" సంధ్యాసమయము జరుగుచున్నది. ఇప్పటికిని నిద్రను వీడవు అని యాతని సుఖోత్కర్షను ప్రశంసించుట. నిద్రాభంగ మనిష్టమైనను శ్రీరాముని ప్రవృత్తి లోకముల నను గ్రహించునది గాన "ఉత్తిష్ఠ నరశార్దూల" అనినాడు. కేవలము లోకానుగ్రహమే కాదు. విధిని ఉల్లంఘించుటచే ప్రత్యవాయము గలుగునని తెలుపుటకై "కర్తవ్యమ్" అనినాడు. నా యాజ్ఞ నతిక్రమించినచో ప్రత్యవాయము కలుగునను భీతిచే నీతల్లి నీ వియోగదుఃఖము నెట్లు లెక్కింపలేదో యామె పుత్రుడవగు నీవు నటులనే వర్తింపవలెనని భావము.

దశరథసంబంధము కట్టి యానుకూల్యము లేకపోవుటచే చెప్పబడలేదు.

శ్లో॥ తచ్ఛ్రుంకర శిరో భ్రష్టం భ్రష్టం భూమితలే పునః ।
వ్యరోచత తదా ... [illegible]

శ్లో॥ తత్ర దేవర్షి గంధర్వా వసుధాతలవాసినః ।
భవాంగపతితం తోయం పవిత్రమితి పస్పృశుః॥

శ్లో॥ శాపాత్ప్రపతితా యేచ గగనాద్వసుధాతలం ।
కృత్వా తత్రాభిషేకం తే బభూవుర్గతకల్మషాః॥

శ్లో॥ ధూతపాపాః పునస్తేన తోయేనాథ సుభాస్వతా ।
పునరాకాశ మావిశ్య స్వాన్ లోకాన్ ప్రపేదిరే॥

వ్యా॥ గతకల్మషం-పంకరహితం-అత ఏవ నిర్మలం పర్వతాదీశ్వరశిరస్సంఘర్షణః- తతో భూమితలాభిఘాతః- ఏవముపలాస్ఫాలనాదినా వారిణస్స్వచ్ఛత్వాతిశయ ఇతి స్వభావవర్ణనం-భవాంగపతితం- అత ఏవ పవిత్రం- బాహ్యాభ్యంతర దోషశోధకం-ఇతి బుధ్వా- స్వస్వలోకాదాగత్య- వసుధాతలవాసినః-తత్ర విలీయ సమయ మపేక్షమాణాస్సన్తః దేవర్షి గంధర్వాః తత్ర- తోయే- పస్పృశుః-సస్ను రిత్యర్థః- తోయ మితి కర్మత్వ వివక్షయా స్పర్శక్రియాన్వయే విభక్తి విపరిణామేన వాక్యభేదాపత్తిః- ఆర్థికాన్వయేతు-తత్రేత్యనన్వితం స్యాత్ -శాపాదితి- ఇతః పూర్వమేవ యే స్వీయాపరాధ వశేన శప్తాః తజ్జలాభిషేకావధీకృత తద్విమోకాస్తు- తే తత్రాభిషేకేణ శాపవిముక్తా స్సన్తః తస్మిన్ పుణ్యాలోకా స్యథాపూర్వం ప్రతిపేదిరే ఇత్యన్వయః-"భవాంగపతిత" మిత్యత్ర పంచమీసమాసః-"అపేతాపోఢముక్త పతితాపత్రస్తైరల్పశః" ఇత్యనుశాసనాత్ -తత్రాల్పత్వం చ ప్రాయిక ప్రయోగవిషయత్వార్థకం-శివాపకర్ష బోధనార్థంతు దూ

రాస్వాయుపరం మణిమంజీరం! తముపష్టంభనార్థం భాగవతే భార తేచ శ్లోకద్వయం యద్యపి తత్రోదాహృతం- తథాపి నతత్స్వా ర్థసాధకం। తత్రాద్యం వర్ణ్యోత్కర్ష పరం। ద్వితీయేతు "తదంబు పతితం దృష్ట్వా దధార శిరసాహరః । పాలనార్థం జటామధ్యే యోగ్యోస్మీత్యవధారణాత్" ఇతి ప్రసిద్ధపాఠే లకారస్థానే వకార నివేశేన స్వకవిత్వ ప్రకటనపరం- అథవా- లోకపవిత్రీకరణార్థ మిత్యర్థః- శబ్దస్వభావాత్ -తత్ర యోగ్యత్వం "ఈశానా స్సర్వ విద్యానా" మిత్యాది శ్రుతిసిద్ధ మనన్య దేవతాసాధారణం ప్రభుత్వం- తచ్చ సతి సంకటే లోకస్య తన్నివర్తనేన సుఖాధా యకత్వ రూపమేవ- ఇత్యాది భాగవతాదిత ఏవోపలబ్ధుం- జాగ్రతో నిద్రాబోధనప్రాయం గోవిందాచార్య వ్యాఖ్యాన మితి వేదితవ్యం- "సా తస్మిన్ పతితా పుణ్యా పుణ్యే రుద్రస్య మూ ర్ధని । హిమవత్ప్రతిమే రామ జటామండల గహ్వరే" ఇత్యేత త్సర్గీయ సప్తమశ్లోక స్తస్య దుఃఖావహ ఏవ । గత్యంతరేణా ప్య న్యథా వ్యాఖ్యాతు మశక్యత్వాదితి సంతోష్టవ్యం ! అపుణ్యే ఇతి పదచ్ఛేదేతు అపుణ్యా ఇత్యపి ఛేద్యతాస్యాత్ -ఇతి జోషం భావ ఏవ తస్య శరణం॥

తా॥ "గతకల్మషం" బురద లేనిది. కనుకనే నిర్మలమైనది. పర్వతమునుండి ఈశ్వరుని శిరమున పడి, అక్కడనుండి భూతలమున బడినది. ఈరీతిగ పాషాణఘాతము మున్నగువానిచే నీటియొందలి నిర్మలత తెలియుచున్నది. కావున నిది స్వభావ వర్ణనమే.

"భవాంగపతితం" ఈశ్వరుని శిరమున బడినది; కనుకనే "పవిత్రం" బాహ్యాభ్యన్తర దోషములను ఇట్లు తెలిసికొని శోధించునని. దేవర్షులు గంధర్వులును తమ తమ లోకములనుండి వచ్చి భూతలమందే వసించుచు, ఏకాగ్రతతో సమయమును నిరీక్షించుచు, "తత్ర" ఈ యుదకమందు "పస్పృశుః" స్నానము జేసిరి.

ఇంతకు ముందు ఎవరు తమ యపరాధ వశమున శపింపబడినారో, వారు ఈజలమందు మునుగుటే శాపమోక్షావధి గలవారై, ఇందు స్నానముచేయుటచే శాపమువలన విడువబడి తమ తమ పుణ్యలోకములను యథాపూర్వముగ జేరిరి.

'భవాంగపతితం' అనుచోట 'అపేతాపోఢ...' ఇత్యాది సూత్రముచే పంచమీ సమాసము. ఈసూత్రమున నుండెడి "అల్పశః" అనుపదము, ప్రయోగముల బాగుగ జూపట్టెడి పంచమ్యన్తము. అపేతాది శబ్దములతో సమసించునను అర్థమును తెలుపును. మణిమంజీర వ్యాఖ్యానమున శివున కపకర్షను దెలుపుటకై దూరాన్వయమును జొనిపి, దానిని సమర్థించుటకై భాగవత భారతములందలి రెండు శ్లోకము లుదాహరింపబడినవి. కాని యట్టి రచన గోవిందరాజులవారికి స్వార్థసాధకము కానేరదు. అందు మొదటిశ్లోకము వర్ణోత్కర్షను దెలుపునది. రెండవ శ్లోకమున 'పాలనార్థం" అని ప్రసిద్ధ పాఠ ముండగ నందు 'ల' కారమునకు బదులుగ 'వ' కారమును జేర్చుట వారి కవిత్వప్రతిభను తెలుపుటకొరకే యగును.

లేదా, శబ్దస్వభావముచే "లోకములను పవిత్రము చేయుటకు" అని 'పావనార్థం' అను పదమున కర్థము. ఎట్లన, "ఈశ్వరుడు సర్వవిద్యలకు సర్వభూతములకు ప్రభువు" మున్నగు శ్రుతివాక్యములచే ఇతరదేవతలకుండని ప్రభుత్వ మీశ్వరునకు గలదు. అట్టి ప్రభుత్వముకూడ లోకములకు సంకటము గలిగిన పుడు దానిని పోగొట్టి సుఖమును గూర్చుటయే ఈవిషయము భాగవతము మున్నగు గ్రంథములనుండియే తెలియుచున్నది. ఇట్టిస్థితిలో ఈశ్వరుడే తన పవిత్రతకొరకు గంగను ధరించినా డని గోవిందరాజులవారు వ్యాఖ్యానము చేయుట మేలుకొనిన వానిని నిద్రనుండి లేపుటవంటిదని తెలియనగును.

"పరమపవిత్రమగు శివుని శిరస్సునందుం దుడింనట్టి ఆ పవి త్రమగు గంగ హిమవత్పర్వతముతో తులతూగు జటామండల మనెడు గుహాయందు పడినది" అను నీసర్గమందలి ఏడవశ్లోకము శ్రీవారి కెంతేని దుఃఖమును కలుగజేయునదియే. ఏగతినైనను దానిని వేరొకరీతిగ వ్యాఖ్యానము చేయుటకు వలనుపడను గాన, నింతటితో వారు సంతసింపదగినదే. ఒకరీతిని ఈశ్లోకమున "అపుణ్యే" అని పదచ్ఛేదము చేయుదమన్నను "అపుణ్యా" అని యు పదచ్ఛేదము చేయ వీలగును గాన వారు మౌనమును వహించుటయే తగినపని.

శ్లో॥ విశ్వామిత్రస్తు ధర్మాత్మా శ్రుత్వా జనకభాషితం ।
వత్స రామ ధనుః పశ్య ఇతి రాఘవ మబ్రవీత్॥

వ్యా॥ ధర్మాత్మా- జనకప్రతిజ్ఞా నిర్వహణరూప ధర్మై కాయత్త చిత్త స్సన్నిత్యర్థః। పశ్యేతి- తద్దర్శనమాత్రేణైవ క్షమమః వీర్యహానిర్భవిష్యతీతి భావః॥

తా॥ "ధర్మాత్మా" విశ్వామిత్రుడు జనకుని ప్రతిజ్ఞను నిర్వహించుట యనెడు ధర్మమందే స్థిరమైన చిత్తము గలవాడై. "పశ్య" చూడుము. చూచిన మాత్రముననే ధనుస్సునకు వీర్యము నశించునని భావము.

శ్లో॥ భగవన్ దృష్టవీర్యో మే రామో దశరథాత్మజః।
అత్యద్భుత మచిన్త్యంచ నతర్కిత మిదం మయా॥

వ్యా॥ త్వద్వాక్యమాత్రా ద్విశ్వాసో మే నజాతః అతో మమాపరాధం క్షన్తుమర్హసీతి సంబోధయతి- భగవన్నితి- దృష్ట వీర్యః- ఇదానీం ప్రత్యక్షీకృతపరాక్రమః- అత్యద్భుతం-ఈశ్వర తేజోభివ్యంజకత్వా దత్యాశ్చర్యం- అచిన్త్యం- బాలత్వా దసం భావ్యం- ఇదం రామకర్తృక ధనుర్భంజనం-నతర్కితం-సర్వజ్ఞేన భవతా సాకూత ముక్తప్రాయ మప్యేవం భవిష్యతీతి మయా నానుమితం- ఈశ్వరాతిరిక్త వస్తున్యనుమానస్య ప్రమాణ త్వే పీశ్వరాంశే ప్రత్యక్షానుభవ ఏవ ప్రమాణ మితి భావః॥

తా॥ నీవాక్యము వినినంత మాత్రమున నాకు విశ్వాసము కలుగలేదు. కావున నాయపరాధమును క్షమింపుమని సంబో ధించుటకై "భగవన్" అనుపదము. "దృష్టవీర్యః" ఇప్పుడే ప్రత్యక్షముగ కనపఱచిన పరాక్రమము గలవాడు. 'అత్యద్భుతం' ఈశ్వరుని తేజస్సును వ్యక్తపఱచుటచే మిక్కిలి ఆశ్చర్యకరము.

"అచిన్త్యం" బాలుడు గాన నూహింప శక్యముగాని. "ఇదం" రామునిచే చేయబడిన ధనుర్భంగము. "నతర్క్యతం" సర్వజ్ఞుల రగు, తమ రభిప్రాయగర్భితముగా దెలిపినను ఇట్లు జరుగునని నే నూహింపనైతిని. ఈశ్వరునికంటె నితరవస్తువును అనుమాన ప్రమాణముచే సాధించినను, ఈశ్వరాంశే విషయమై ప్రత్యక్షానుభవమే ప్రమాణమని భావము.

శ్లో॥ జనకానాం కులే కీర్తిమాహరిష్యతి మే సుతా ।
సీతా భర్తారమాసాద్య రామం దశరథాత్మజం॥

శ్లో॥ మమ సత్యా ప్రతిజ్ఞాచ వీర్యశుల్కేతి కౌశిక ।
సీతా ప్రాణై ర్బహుమతా దేయా రామాయ మే సుతా॥

వ్యా॥ జనకానాం- తద్వంశ్యానాం రాజ్ఞాం- కీర్తిం- జనకవంశ్యా బ్రహ్మవిద ఇతి ప్రసిద్ధిం- మే సుతా సీతా ఆహరిష్యతి- సర్వాపేర్థభూత రాజ్యభరణాదిసాంసారిక చిహ్నైః జనకవంశీయా అపీతర రాజతుల్యా ఏవ-నతు బ్రహ్మవిదః- తద్విరోధిధర్మవత్త్వా దిత్యాదినా అన్యథా బహుభి ర్మన్యమానామపి ఆహృత్య ప్రకటీకరిష్యతి-కిం కృత్వా-భర్తారం-బిభర్తీతి భర్తా-స్థితికర్తారం- ఇదంచ జన్మప్రళయయోరప్యుపలక్షణం- ఏతేన "యతోవా ఇమాని" ఇత్యాది శ్రుత్యర్థో దర్శితః- రామం-రమయతి భక్తాన్ స్వానందప్రాపణేనేతి రామం-ఏతేన "ఆనందో బ్రహ్మ" ఇతి శ్రుత్యర్థో దర్శితః- దశరథాత్మజం-దశరథత్వేనావతీర్ణస్య కశ్యపస్య తపఃఫలభూతం ఆసాద్య- ప్రాప్య-ఆసాదనంచాత్ర స్వవశీకృతేశ్వరకత్వం- ... శ్రుత్యర్థ ... కత్వాంగీకా

రాత్-అనన్య సాధ్యేశ్వర ధనుర్భంగరూప క్రియాశక్త్యా తదద్రష్టమానే దశరథపుత్రే పరమేశ్వరత్వాభివ్యక్తే స్సర్వహృదయారూఢత్వేన తాదృశేశ్వర వశీకరణానుకూల గుణవిశిష్ట సీతాసంబంధిత్వస్మాసు నిష్ప్రత్యూహం పూర్వోక్తం యశ ఇతి భావః- అథవా- జనకానాం కులే కీర్తిం- తత్కులవ్యాపినీం కీర్తిం- "కర్మణైవహి సంసిద్ధిమాస్థితా జనకాదయ" ఇతి జనకనామక స్వవంశ్య రాజసామాన్య వర్తినీం కీర్తిం మే మహ్యం ఆకరిష్యతి- మదేకాశ్రయాం కరిష్యతి- స్వనామసామ్యేన స్వకుల్యే ష్విత రేష్వపి తత్వబుద్ధ్యా పితఃపూర్వాం ప్రాజ్ఞాప్రాజ్ఞ సాధారణాయామపి సాక్షాచ్ఛిత్కళాయా స్స్వాత్మవ్యక్తి విశేషాత్మజాత్వేనావతీర్ణాయా స్సర్వానుభవ సిద్ధేశ్వరత్వ విశిష్ట శ్రీరామాసాదనేన తత్కర్తే స్స్వాత్మమాత్ర విశ్రాంతి ర్భవిష్యతీతి భావః-యద్వా-అయోనిజాయా విధవశాన్మత్సుతాత్వేన పరికల్పితాయా స్సర్వేశ్వర్యా అపి మదీయపణనిర్వహణాశక్త్యా కేనాపి పుంసా అద్యాప్యనూఢాయా అన్యాసంబంధో ఽ స్మాక మితఃపూర్వాం కేనాప్యకలంకితానా మపయశస ఏవాభూత్ -ఋతుమత్యా స్సుతాయాశ్చిర మప్యనుకూల వరాలాభేన అపరిణయేన స్థితాయా స్త త్పిత్రూ దేవతాపతన హేతుత్వ స్మరణాత్ - ఇత్యాదినా సంక్లిశ్యతా మస్మద్వంశ్యానాం క్లేశమపనియాధునానుకూల నిరుక్త గుణవిశిష్ట వరపరిణయేన కీర్తి మేవార్జయిష్యతీతి భావః- యద్వా నిఖిల కల్యాణగుణవిశిష్టాం నిరతిశయప్రేమ్ణా ఏతావన్తం కాలం పోషితాం స్వసుతాం ... శ్రీరామ ... దత్వాపి

తద్విశ్లేషజన్యదుఃఖేన సంతప్యతాం జనకానాం కులే గృహే గృహే స్వాపేక్షయాపి సర్వలోకరమణీయాం కీర్తిం స్త్రీలింగ స్వారస్యేన కాంచనకన్యాం తత్సంతాపశాన్త్యై ఆహృత్యార్పయిష్యతీతి భావః- సర్వజనీనోఽయ మనుభవః- యత్స్వదేశే స్వగృహే వా చిరం లాల్యమానః పుత్రాది ర్గుణవత్తయా పిత్రాద్యానందహేతుస్సన్ పూర్వాపేక్షయా మహాపద మనుభవిను మన్యత్ర గతోఽపి స్వార్జితకీర్తివిశేషాదినా స్వవియోగజన్యం క్లేశం విస్మార్యా నందయతీతి-యద్వా-జనకానాం కులే కీర్తి మిత్యత్ర అకీర్తి మితి పదచ్ఛేదః- "తరతి శోకమాత్మవిత్" ఇతి శోకాది తరణ హేతుభూతాత్మవేదన విశిష్టతయా ప్రసిద్ధానాం జనకానాం సర్వేషామపి పూర్వోక్తదిశా సర్వగుణవిశిష్ట భర్తృసంగత్యా సర్వదాపి శ్వశురగృహైకలాలసాం సుతాం మనసాప్యవిస్మరణీయ గుణాలవాలభూతాం పరిత్యజ్య కాలం యాపయితుమశక్త్యా పుత్రీవియోగోత్కంఠితానాం చిత్తవైకల్య సంపాదకతయా నైతే జ్ఞానిన ఇతి అపకీర్తి మాహరిష్యతి ఆర్జయతీతి భావః- యత్తు కన్యావరణ హేతుభూత సౌందర్యాది సంబాధద్యోతకతయా శ్యామాదిపదానాం తాత్పర్యం పరికల్ప్య తాదృశవరసంబంధా జ్జనకానాం కీర్తిమాహరిష్యతీత్యాది ప్రాహుః-తదసుందరం- తదుక్త విత్తాదిగుణ విశిష్టవర సంబంధస్య ప్రాయశో మహారాజకన్యా సాధారణ్యేన తదధీనకీర్తే స్సీతానిమిత్తత్వకల్పనాయాం చమత్కారాభావాత్ ఏతచ్ఛ్లోక పూర్వాపరగ్రంథ స్వారస్యేన [illegible] తృప్తేః

షమకాష్ఠాధిసాధకత్వేన నిశ్చితస్య జనకస్య మహాయోగినో భావస్య స్వసుతాయా నిరుక్తగుణవిశిష్ట శ్రీరామసంబంధ విషయకత్వ కల్పనాయామేవ ప్రకృత శ్లోకసార్థక్యలాభాత్- సీతాయా ఏవ విశిష్ట శ్రీరామాసాదనోత్తరకాలిక కీర్తిహేతు త్వమిత్యర్థే ఇతఃపూర్వం తాదృశ వరాలాభేన స్వవంశోత్పన్న కన్యానాం అకీర్తిహేతుత్వమితి అశ్లీలస్య ప్రతీతేశ్చ॥

వ్యా॥ మమేతి- పూర్వోక్తప్రకార విశిష్టం రామమాసాద్య- నిమిత్తీకృత్య-సత్యా- సఫలా- ప్రతిజ్ఞాచ- పూర్వోక్తరీత్యా కీర్తిమాహ రిష్యతీత్యప్యన్వయ స్సుకరః- అవశిష్యతేతు దానసంస్కారమాత్ర మిత్యాహ-సీతా ప్రాణై రిత్యాది-యద్వా- ప్రాణైస్సహ సీతా దేయా- ఇతఃపరం ప్రాణవృత్తేరపి సీతాయా ఇవ రామ ఏవ విశ్రాంతిభూమిరితి భావః- యద్వా- ప్రతిజ్ఞా నిర్వాహమాత్రేణ సీతా తదీయా జాతైవ- కింతు సుతాత్వాభిమానా ద్దానమాశాస ఇత్యాహ- సీతాప్రాణైరిత్యాది- కించ-బహూనాం మతా పరిణేతు మితః పూర్వమిష్టా- ప్రాణైరితి- హేతావితి తృతీయా- తద్వ్యయేనాపి సీతాం పరిణేష్యామీతి సర్వాభిమతా- దేయా- దానక్రియయా రామసాత్కర్తవ్యా-అన్యథా కిం వా-వికృతం భవేత్ -మమేతి భావః-యద్వా- సీతా ప్రతిజ్ఞాచ రామాయైవ దేయా-వశీకర్తవ్యా-పోషణమాత్రేణ సీతాయా ఇవ వాచికవ్యాపారమాత్రేణ ప్రతిజ్ఞాయా అపి మదీయత్వాభిమానః- వస్తుతస్తు తదుభయఫలస్వామిత్వం రామస్యైవేత్యాశయః- తత్ర హేతుమాహ- వీర్యశుల్కేతి-

అథవా- స్వవీర్యేణైవ సీతాయా స్తదధీనత్వేన ఉపేక్షేత చేత్ ఈశ్వరస్య కన్యాదానప్రయుక్తవైభవం మమ నసిధ్యేదితి సవినయం యాచతే- సీతేత్యాది-కించ-నిసక్తదిశా మమ సర్వైశ్వర్యలాభేన అవశ్య కర్తవ్యమపి సుతాదానం క్లేశావహ మేవేత్యభిసంధాయాహ-సీతేత్యాది-తత్ర సార్థకవిశేషణాని-సీతేత్యాదీని-కించ-అనన్యసాధ్య మదీయ ప్రతిజ్ఞానిర్వహణద్వారా మహోపకర్తుః రామస్య ప్రత్యుపకరణేన స్వస్యానృణ్యం కామయమానో విజ్ఞాపయతి- సీతా ప్రాణైరిత్యాది-కించ-భగవతా న్యాసతయా మద్వశీకృతాం సీతాం పునస్తస్మై సమర్ప్య కృతార్థయామ్యాత్మాన మితి యాచతే- సీతేత్యాది॥

తా॥ "జనకానాం" జనకవంశజులైన "రాజ్ఞాం" రాజుల యొక్క- "కీర్తిం" కీర్తిని. అనగా జనకవంశీయులు బ్రహ్మవేత్తలనెడు ప్రసిద్ధిని. "మేసుతా" నా కుమార్తె యగు సీత, "జనకవంశమందలివారుకూడ యితరరాజులవలె రాజ్యభరణము మున్నగు సాంసారికచిహ్నాలు కలవారు. కావున బ్రహ్మవేత్తలకుండెడు ధర్మములకంటె విరుద్ధమగు ధర్మములుకలవారు" అని యితరులందరు తలచెడి ప్రవాదను "ఆహరిష్యతి" హరింపజేసి ప్రకటింపగలదు. "భర్తారం" భరించువాడు కాన భర్త. స్థితికర్త. ఇది జన్మప్రళయములనుగూడ సూచించుచున్నది. దీనిచే "ఎవనివలన భూతము లుత్పన్న మగునో" ఇత్యాదిశ్రుత్యర్థము చూపబడుచున్నది. కావున సృష్టి స్థితి లయములకు కారణభూతుడును, స్వానందమును పొందించి భక్తులను సంతోషపెట్టువా

నను. దశరథుని కుమారుడై యవతరించిన కశ్యపమహర్షి యొక్క తపఃఫలమగు శ్రీరాముని 'ఆసాద్య' పొంది. ఇచ్చట పొందుట యనగా ఈశ్వరుని తన స్వాధీనము చేసికొనుట యని యర్థము. 'ఆసాద్య' అను పదమందలి "ఆఙ్" అను ఉపసర్గ 'వ్యాప్తి' యను నర్థము కలది. ఇతరులకు సాధింపశక్యముగాని యీశ్వర ధనుర్భంగ రూపమగు క్రియాశక్తి గలవాడగ యందలి హృదయములకు నాటునట్లు చూపట్టుటచే, అట్టి యీశ్వరుని తన స్వాధీనముచేసికొనుటకు తగిన గుణములతోగూడిన సీతకు సంబంధించిన మా (జనకవంశపురాజుల) యందు పూర్వమున చెప్పబడిన బ్రహ్మవేత్తలను కీర్తిని ఆమె నిరాటంకముగ సమకూర్చునని భావము.

లేదా 'కర్మచేతనే జనకాదులు సిద్ధినిపొందిరి' అని జనకకులమును వ్యాపించియున్న కీర్తిని 'మే' నాకొక్కనికే సమకూర్పగలదు. తననామసామ్యముచే, తనకులమందలి యితరులకుగూడ తత్త్వజ్ఞానమున్నచో ఇంతకు ముందు ప్రాజ్ఞులకు ప్రాజ్ఞులు కాని వారికి పైకీర్తి సాధారణముగ నుండెడిది. నేను సాక్షాచ్చిత్కలాస్వరూపిణియే తన స్ఫురణవిశేషరూపమగు నాత్మజాత్వము (కుమార్తెయగుట) నొంది, తద్రూపమున నవతరించి, స్వానుభవసిద్ధమగు ఈశ్వరత్వముతోగూడిన శ్రీరాము నాసాదించుటచే, నందువలనగలిగెడి కీర్తి నాయందే విశ్రమించునని భావము,

లేదా, అయోనిజయు (శుక్లశోణితసంబంధముచే బుట్ట నదియు) దైవవశమున నాపుత్రికయని కల్పింపబడినట్టియు, సర్వేశ్వరియైనను, నేనుకూర్చిన పన్నిదమును నిర్వహింప సమర్థుడు కాకపోవుటచే, ఏపురుషునితోనైనను నేటికిని వివాహమును చేసికొనని ఈమెయొక్క సంబంధము, ఇంతకుపూర్వ మెవని చేతను కలంకితులుగాని జనకవంశీయులకు అపయశస్సునకే హేతువైనది. ఏలనన ఋతుమతియై, చిరకాలము అనుకూలవరుడు లభింపక పోవుటచే, వివాహము లేకుండ నుండెడి స్త్రీ, ఆవంశమందలి పితృదేవతలకు పతనమును గల్గించునని స్మృతులు చెప్పుచున్నవి. ఈరీతిగ క్లేశము నొందుచున్న మావంశీయుల క్లేశమును పోగొట్టి, నేడు అనుకూలుడు పై చెప్పబడిన గుణములతోగూడిన వాడు నగు వరునితో వివాహము చేసికొనుటచే కీర్తినే సంపాదింపగలదు. అని భావము.

లేదా, సమస్తకల్యాణగుణములతో గూడినట్టియు, నిరతిశయప్రేమచే నింతవరకు పోషింపబడినట్టియు, నా కుమార్తెయగు సీతను మహాత్ముడగు శ్రీరామచంద్రున కిచ్చియు, ఆమె వియోగము వలన గలుగు దుఃఖముచే తపించు జనకవంశము వారి ప్రతిగృహమందును, తనకంటె (సీతకంటె) సమస్తలోకములకు రమణీయమగు కీర్తికన్యను సంతాపశాంతికొరకు తీసికొనివచ్చి యీయగలదని భావము. తన దేశమునందుగాని, తన గృహమునందుగాని చిరకాలమునుండి లాలనచేయబడుచున్న పుత్రుడు మున్నగువారు విశేషగుణములు గలిగి, తలిదండ్రుల

కానందమును గలుగజేయుచు, పూర్వముకంటె నెక్కువయగు పదము ననుభవించుటకు మఱియొకచోటికి వెడలినను, యిది వరకు తాము సంపాదించిన కీర్తి విశేషము మున్నగువానిచే తమ వియోగమువలన గలిగెడి దుఃఖమును మరపింపజేసి ఆనంద మును గలుగజేయు ననెడి యనుభవము లోకసిద్ధము గదా?

లేదా, "జనకానాం కులే కీర్తిం" అనుచోట "అకీర్తిం" అని పదచ్ఛేదము. "ఆత్మవేత్త దుఃఖము నతిక్రమించును" అను శ్రుతివాక్యము చెప్పిన శోకమును దాటుటకు కారణభూతమగు ఆత్మజ్ఞానము కలవారు జనకవంశజులు అనెడి ప్రసిద్ధితో గూడిన వారము. ఇట్టి మాకు పైజెప్పినరీతిగ సర్వగుణవిశిష్టుడగు భర్త తో గూడి, ఎల్లపుడు భర్తృగృహమందుండుటకే ఆతురతతో గూడిన నా కుమార్తెను, మనస్సున మరచుటకు శక్యముగాని గుణాలవాలను విడచి, కాలమును గడపుటకు శక్తి లేకపోవు టచే పుత్రీవియోగమునకై ఉత్కంఠతో గూడిన చిత్తవైక ల్యము గలుగును. ఇట్టివైకల్యమును సంపాదించెడిదగుటచే సీత "జనకవంశీయులు జ్ఞానులు కారు" అనెడి అపకీర్తిని సంపాదింప గలదని భావము.

కొందరు ప్రాచీనులు "రామం ఇత్యాదిపదములు కన్య నరించుటకు కారణమగు సౌందర్యాదిసంబంధద్యోతకములు" అని యాపదములకు తాత్పర్యము చెప్పి, అట్టివరునితో గూడు టచే సీత జనకులకు కీర్తిని సంపాదించును. అని మొదలగు నర్థము జెప్పిరి. కాని అది స్వరసముగ లేదు. ఏలనన వారు

చెప్పిన విశేషగుణములతోఁగూడిన వరుని సంబంధము సామా న్యముగ రాచకన్యకలకు సులభము గాన అద్దానివలన కలిగెడి కీర్తికి సీతయే కారణమని చెప్పుటలో చమత్కార ముండనే రదు. ఈశ్లోకమునకు పూర్వాపరగ్రంథస్వారస్యము (ముందు వెనుకలనుండెడి గ్రంథసందర్భము) పరికించినచో సీతారాము లకు పరమేశ్వరత్వము వ్యక్తమగుటచే ఆనందమునకు చివర హద్దు నధిష్ఠించితినని నిశ్చయించిన మహాయోగీశ్వరుడగు జన కుని భావమునకు, ముందు చెప్పబడిన గుణములతోఁగూడిన శ్రీరాముని సంబంధమును విషయముగా కల్పించినపుడే, ఈ శ్లోకమునకు సార్థక్యము లభించును. సీతయే విశిష్టపురుషుడగు శ్రీరాముని బొందించుట గలిగెడి కీర్తికి కారణమను నర్థము చెప్పినచో, ఇంతకుముందు అట్టివరుడు లభింపక పోవుటచే జనక వంశమందు పుట్టిన కన్యకలు అపకీర్తికి హేతుభూతుల రనెడి యశ్లీలార్థముగూడ తోఁచెడిని.

తా॥ "మమ సత్యా ప్రతిజ్ఞాచ" నా (జనకుని) ప్రతిజ్ఞ సత్యమైనది. ముందుచెప్పబడిన గుణములతోఁగూడిన రాముని నిమిత్తముగ జేసికొని, సీత, కీర్తిని తీసికొని రాగలదు గాన, నా ప్రతిజ్ఞ సత్యమైనదే యను నన్వయము సుకరము. దానసంస్కా రముమాత్రమే మిగిలదను సూచించే "సీతా ప్రాణైః" ప్రాణములతోఁగూడ సీత రాముని కీయదగినది అని చెప్పుచు న్నాడు. ఇకమీద సీతకువలె నాప్రాణవృత్తికిగూడ రాముడే విశ్రాంతిస్థానమని భావము.

లేదా, ప్రతిజ్ఞ నిర్వహించుటచే సీత రాముని యధీనమే మైనది. కాని కుమార్తెయను నభిమానముచే దానసంస్కారము కోరుచున్నానని గూడ భావము చెప్పవచ్చును.

"బహానుతా" అనేకు లింతకుముందు వివాహాము చేసికొనుట కిచ్ఛగింపబడినది.

"ప్రాణైః" అనుచోట హేత్వర్థమందు విధింపబడిన తృతీయావిభక్తి. "ప్రాణములను గోల్పోయినను సీతను వివాహ మాడెద" నను పట్టుదలతో నందరకు అభిమానమును గల్గించిన సీతను రామునకే యధీనము చేయదగినది. అట్లు చేయనిచో నాకు వికృతము సంభవించునని భావము.

లేదా, సీతయు, ప్రతిజ్ఞయు, రామునకే స్వాధీనము చేయదగినవి. పోషించినమాత్రమున సీత నాదనుకొను నభిమాన మెట్లో, వాగ్వ్యాపారమాత్రముచే ప్రతిజ్ఞగూడ నాదనుకొను నభిమానము నట్లే. కాని బాగుగ నాలోచించినచో నా రెండుఫలములకు (అధికారిత్వము) స్వామిత్వము రామునకే యని భావము. ఈవిషయమున హేతువును జెప్పుచున్నాడు. 'వీర్యశుల్క' అని.

లేదా, శ్రీరాముని వీర్యముచే సీత యాతని యధీనమైనదని యుపేక్షించినచో, ఈశ్వరునికి కన్యాదానము చేయుటవలన గలిగెడి వైభవము సిద్ధింపదని జనకుఁడు యాచించుచున్నాడని తెలుపుటకై "సీతా..." ఇత్యాదికము. మఱియు పై జెప్పినరీతిని నాకు సమస్తైశ్వర్యములు లభించినవి గాన, తప్పక చేయుతగిన

దైనను, కన్యాదానము క్లేశావహమే యనుకొని చెప్పుచున్నా డని తెలుపుటకు "సీతా" ఇత్యాదిసార్థక విశేషణములు కవిచే గూర్పబడినవి.

ఇతరులకు సాధింప శక్యముగాని ప్రతిజ్ఞను నిర్వహించి మహోపకారము జేసిన రామునికి ప్రత్యుపకారముచే తన కృతజ్ఞతను గోరువాడై (జనకుడు) విజ్ఞాపనజేయుచున్నాడు. "సీతా ప్రాణైః" ఇత్యాదికముచే. మఱియు భగవంతునిచే న్యాసము (నిధి) వలె నాకధీనము చేయబడిన సీతను, తిరిగి యాతని కర్పించి తన్ను కృతార్థునిగా జేసికొనెదనని యాదించుటను దెలుపుటకును "సీతా" ఇత్యాదికము సేకరింపబడినది.

శ్లో॥ ఇయం సీతా మమసుతా సహధర్మచరీ తవ ।
ప్రతీచ్ఛ చైనాం భద్రం తే పాణిం గృహ్ణీష్వ పాణినా॥

వ్యా॥ అత్ర ఇమామిత్యాది ద్వితీయాన్త పదన్యాసేన గృహ్ణీష్వేతి క్త్వాంతతయా విపరిణమ్యానన్వాదేశ పదేనైవ ప్రతీచ్ఛాయా ఏకస్యా ఏవ క్రియాయాః ప్రాధాన్యేన పూర్వ వాక్యం సమాప్య, వధూవరోభయసంబంధి మంగళాశంసాపర తయా భద్రమస్తువామితి వాక్యాన్తరకల్పనయాచ చమత్కార విశేషస్ఫూర్తిద్వారా లాఘవేన శ్లోకరచనాసామంజస్యే వాక్యషట్కరచనం నిష్ఫలం- కించ- ప్రథమసీ భూత పాణిగ్రహణోత్తరకాలిక శుభాశంసాయాః ప్రతీచ్ఛామాత్రేణ ఏకతరమాత్ర విషయకత్వ కల్పనం చ సహృదయా నామనా రూఢ మితి ప్రతిభాతి. తథాపి కేనాపి కారణేన భూమా

నీయ మదీయభాగ్యేన యజ్ఞీయశాలాయాం లాంగలసంస్కార
కాలే నిక్షేపవత్ మమస్వం భూత్వా ఏతావన్తం కాలం
మత్పోషణేన మదభిమానినీ జాతా ఇయం- తతశ్చ విశ్వామిత్ర
యాగరక్షణాది రూపో ధర్మః యథా తవ సహజః తథా మ
త్ప్రతిజ్ఞా పరిపాలనాదినా మదర్పణమప్యస్యా స్సహజః- తతో
స్యాం త్వదనపాయిన్యాం మహాలక్ష్మ్యాం ఆత్మీయమేవ మిత్యను
గ్రహ పూర్వకేచ్ఛామాత్ర మేవ త్వదధీనం- నత్వపూర్వ మ
న్యత్- తతశ్చ తదనుగ్రహద్వారా మదభీష్టాపాదనరూపభద్ర
ప్రార్థనేతి భద్రమస్తుతే- ఇతి-యది తావదేవస్యాత్తథా బహిర
భివ్యక్త్యా మత్ప్రతిజ్ఞా శేషస్యాదితి విశ్వజనీనతయా పాణిగ్ర
హణసంస్కారం యాచతే- యద్వా- యజ్ఞీయపాయసస్వీకా
రేణ యథా త్వయి భగవదంశాభివ్యక్తిః తథా హలకర్షణేన
భూమావభివ్యక్త్యాస్యా దేవీత్వ వ్యక్తిరితీయం సీతేతి- యథా
వా-చిరంతన తపోబలేన దశరథస్య త్వత్సంబంధః తథా మదీయ
భాగ్యవశే నాస్యా మత్సంబంధ ఇతి మత్సుతేతి- యథావా-
మస్కార మపి పితృవాక్య పరిపాలనాదికం త్వం చికీర్షసి తథేయ
మపి మహత్యపి సంకటే తాదృశ ధర్మాచరణేన త్వదనపాయి
నీతి ద్యోతయితుం సహధర్మచరీ తవేతి- అత స్సర్వాత్మనా సిద్ధ
ఏవ యువయోస్సంబంధః- పరంతు ఏతద్విషయకేచ్ఛాభివ్యం
జక పాణిగ్రహణ వ్యాపార మాశాస ఇత్యాహ- ప్రతీచ్ఛ
త్యాదిః- అత ఏవాన్వాదేశోపపత్తిః- యత్కించిద్ధర్మ విధ్యుద్దేశ్య
తావచ్ఛేదకా వచ్ఛిన్నే ధర్మాన్తర విధానమన్వాదేశః- తతశ్చ

ధర్మయోః ప్రయోజ్య ప్రయోజకభావవిధా పర్యవస్యతీతి విశేషః- విశ్వామిత్ర యాగరక్షణాది పుణ్యప్రభావేన యాగస్థలీయు లోకోత్తర గుణవిశిష్ట కన్యాలాభ స్తవేతి ధ్వనిః-యద్వా- ఇయం సీతా సతీ మద్భాగ్యవశాన్మమ సుతా దుహితా అభవత్- ఇదానీంతు తవ సహధర్మచరీ- "ఆవాభ్యా ముభాభ్యాం సహ కర్మాణి కర్తవ్యానీ" త్యాదినా సాహిత్యే నానుష్ఠేయో యశ్శ్రౌత స్మార్తాదిరూపో ధర్మస్తదా చరణశీలా తస్మాదేనాం ప్రతి ఉద్దిశ్య- ఇచ్ఛ-"ధర్మేచ అర్థేచే" త్యాది గురుశాసనోత్తర కాలిక "నాతి చరామీ" త్యేవం సంకల్పయేత్యర్థః అత్రపక్షే ఉన్వాదేశోపపత్తిః సులభైవ- ఏవంచ స్వసదృశస్వాభిలషిత కన్యావిషయక సంకల్పవత స్తవ భద్రం పురస్థిత మేవేతి భద్రం తే ఇత్యుక్తిః-తచ్చ ఉపస్థిత మేవ-అతః పాణిగ్రహణసంస్కారం అనుతిష్ఠేతి పాణిం గృహ్ణీష్వేత్యాదినా ప్రార్థ్యతే- ఇత్యేవం వ్యాఖ్యానే వాక్యభేదచింతైవ నావతరతి- వస్తుతస్తు ప్రకాశ విమర్శోభయ సామరస్య పర్యవసాన ప్రతిపాదన పరస్యాస్య గ్రంథస్య జగన్నియామకత్వ కృత్యోపయికతయా శ్రీరామస్య ప్రకాశస్వరూపస్య విమర్శోన్ముఖ్య రూపేచ్ఛా శక్తిసంబాధ తాత్పర్యకత్వ బోధనాయ దేవస్య విమర్శోన్ముఖ్యం ప్రార్థ్యతే- ఇయం సీతేత్యాది ప్రతీచ్ఛేత్యంతం- అస్మిన్పక్షే భద్రపదం ఇచ్ఛాశక్త్యధీన విశ్వవిజృంభణార్థకం- ఈశ్వరస్య సంకల్పమన్తథా సృష్టే రేవాసంభవా దిత్యాది రహస్యం సంప్రదాయతోవగన్తవ్యం॥

తా॥ ఈశ్లోకమున "ఇమాం" అను ద్వితీయాన్తపదమును గూర్చుకొని "గృహ్ణీష్వ" అను తిజన్తపదమును క్త్వాన్తపదముగా మార్చి, అన్వాదేశవిషయముగాని పదముతోడనే, ప్రతీచ్ఛారూపమగు ఒకక్రియకే ప్రాధాన్య మొసగి, పూర్వవాక్యమును ముగించి, వధూవరు లిద్దరకు మంగళము కోరురీతిని "భద్రమస్తువాం" (మీకు మంగళ మగుగాక, యను వాక్యాన్తరమును గల్పించినచో, చమత్కారవిశేషము స్ఫురించును లాఘవముగ "ఇమాం సీతాం మమ సుతాం సహధర్మచరీం తవ| ప్రతీచ్ఛ పాణినాపాణిం గృహీత్వా భద్రమస్తువాం" అను రీతిని శ్లోకరచనా సామంజస్యము కలుగుచుండ, నారువాక్యములతో శ్లోకమును రచించుట నిష్ఫలము. మఱియు, ప్రధానమగు పాణిగ్రహణ మైనపిమ్మటది యగు, శుభాశంసనమునకు "ప్రతీచ్ఛాం (మిక్కిలి కోరుట) మాత్రమునే" విషయముగా కల్పించుటయు సహృదయుల హృదయముల కానందదాయకము కానట్లును తోచెడిని, కాని, ఏకారణముననో భూమియం దణగియుండి, నాభాగ్యవిశేషముచే యజ్ఞశాలయందు లాంగల (నాగలి) సంస్కారకాలమున నిధివలె నాసొత్తై, ఇంతవరకు నేను పోషించుటచే నా కభిమానవతియైనది "యీమె (సీత)". తరువాత విశ్వామిత్రుని యాగరక్షణరూపమగు ధర్మము నీకెట్లు సహజమో, నా ప్రతిజ్ఞను పాలించుట మున్నగువానిచే నన్ను రక్షించుట నీమెకును సహజమే. కావున మహాలక్ష్మీస్వరూపిణియై నిన్నెన్నడు నెడబాయని యీమెయందు "ఈమె నాసం

బాధమైనది" అను అనుగ్రహముతోఁగూడిన ఇచ్ఛామాత్రమే నీయధీనము. క్రొత్తవిషయ మేమియు లేదు. గాన నామె నను గ్రహించుచు నాయభీష్టము నొడగూర్పుమనెడి మంగళప్రార్థనయే యని తెలుపుటకై "భద్రమస్తు తే" అను పదములు కూర్పబడినవి.

ఇంతమాత్రమే యగుచో బహిరంగముగ స్పష్టపడక పోవుటచే తన ప్రతిజ్ఞ మిగిలిపోవునని అట్లు తలచి సర్వజన సాధారణమగుటచే పాణిగ్రహణసంస్కారమును సలుపుమని జనకుడు ప్రార్థించుచున్నాడు.

లేదా, యజ్ఞమం దుద్భవించిన పాయసమును సేకరించుటచే నీయం దేరీతిగ భగవదంశ వ్యక్తమయినదో, ఆరీతిగనే, నాగటిచాలున భూమియందు వ్యక్తమగుటచే దేవీస్వరూపిణియే యీ సీత యని దెలుపుటకు "ఇయం సీతా" యనుపదములు గ్రహింపబడినవి.

లేదా, చిరకాలము తపమాచరించుటచే నీసంబంధము దశరథున కెట్లో నాభాగ్యవశమున నాకు నీమెసంబంధము నటులనే యని తెలుపుటకై "మమ సుతా" యనినాడు.

లేదా, చేయ శక్యముగానిదైనను పితృవాక్యపరిపాలనాదికమును నీ వెట్లు చేయ నిశ్చయించుచున్నావో అటులనే యీమెగూడ మహాసంకటావస్థయందును ధర్మాచరణమున నిన్ను విడువనిదై యుండునని తెలుపుటకై 'సహధర్మచరీతవ' యనునది. కావున సర్వవిధముల నీమె యుద్ధరమును సంబంధము

సిద్ధమే. కాని యీవిషయమును బలపరుచు పాణిగ్రహణ వ్యాపారమును నేను గోరుచున్నాననుటకు "ప్రతీచ్ఛ" యని నాడు. కావుననే "ఏనాం" అనుచోట నన్వాదేశము సరిపడును. ఒక ధర్మవిధానమున కుద్దేశింపబడినదానికి ధర్మాంతర విధాన మన్వాదేశ మనబడును. దానిచే నీధర్మములలో నొకదానికి ప్రయోజ్యభావము. వేరొకదానికి ప్రయోజకభావము పర్యవసన్నమగును. విశ్వామిత్రుని యాగమును రక్షించుట మున్నగు పుణ్యముల ప్రభావముచేతనే యాగస్థలమం దావిర్భవించి లోకోత్తరగుణములతోఁగూడిన కన్యాలాభము నీకు గలిగినదని వ్యంగ్యార్థము స్ఫురించుచున్నది.

లేదా, ఈమె సీత యగుచు నా భాగ్యవశమున నాకు కుమార్తె యైనది. "మన యిద్దరచేతను కర్మలు కలసి చేయదగినవి" ఇత్యాదివాక్యముచే నీకు నీమెతో కలసి చేయవలసిన శ్రౌతస్మార్తాది ధర్మముల నాచరించెడి స్వభావములకది. కావున "ధర్మమున, అర్థమున, కామమున నీమె నతిక్రమింపతగదు" అని గురువర్యులు శాసించినపిదప "అతిక్రమించను" అని సంకల్పించుము. ఈరీతిగ నర్థమును "ఇయం సీతా మమ సుతా సహధర్మచరీతవ ప్రతీచ్ఛ" అను నీభాగమునకు చెప్పవచ్చును. ఈపక్షమున అన్వాదేశము సులభముగనే సిద్ధించును.

కావున నీకు తగినట్టియు, నీవుకోరిన కన్యనుగూర్చి సంకల్పము గలిగిన నీకు మంగళ మెదుటనే యున్నదని తెలుపుట కొరకే "భద్రం తే" అనునది. అట్టిమంగళమును సిద్ధమే. కావున

పాణిగ్రహణసంస్కారమును జేయుమని "పాణిం గృహ్ణీష్వ పాణినా" అని ప్రార్థించుచున్నాడు. ఈరీతిగ వ్యాఖ్యానము చేసినచో వాక్యభేదము వచ్చుననను చింతయే యుండదు.

ఇక వాస్తవమగు నర్థ మేది యనిన, ఈగ్రంథము ప్రకాశ విమర్శ స్వరూపముల సామరస్యపర్యవసానమును దెల్పునది యనియే. జగన్నియామక రూపమగు కృత్యైపయికముగ ప్రకాశస్వరూపుడగు శ్రీరామునకు, విమర్శాన్మఖ్యరూపమగు ఇచ్ఛాశక్తి సంబంధ తాత్పర్యమును బోధించుటకుగాను పరమే శ్వరునకు విమర్శాన్మఖ్యముచు 'ఇయం సీతా' అనునది మొద లుగ 'ప్రతీచ్ఛ' అనువరకు నుండెడి గ్రంథమున జనకుడు ప్రార్థిం చుచున్నాడు. ఈపక్షమున "భద్రం" అను పదము ఇచ్ఛాశక్తి కధీనమగు విశ్వవిజృంభణమర్థముగా గలది. ఈశ్వరసంకల్పము లేనిచో సృష్టియే సంభవించదు గాన ఇత్యాదిరహస్యములు సంప్రదాయముననే తెలియనగును.

శ్లో॥ దేవైస్తదా సమాగమ్య సర్షిసంఘైః స్వచారణైః।
యాచితౌ ప్రశమం తత్ర జగ్మతుస్తౌ సురోత్తమౌ॥

వ్యా॥ తదా- శివధనుషః శివస్యచ విష్ణుహుంకారేణ జడీకరణానంతరం- యాచితౌ- స్వయత్నవైఫల్యేన శివస్య పునా రణోద్యోగః- స్వశక్తిప్రథనేన విష్ణోస్తదుద్యోగః- అత ఉభయో రపి పరాక్రమ ప్రవణత్వమాలక్ష్య యద్యనయోః పునర్యుద్ధం తదా రుద్రస్య సంహారకత్వేన విష్ణోరపి ప్రమాదస్యాత్ -అథవా- సమబలత్వే యుద్ధాన్నివృత్తిర్న స్యాత్ -తథాచ- జగతామకాల ప్రళయస్స్యాదితి త్రిపురధ్వంసకాలిక రుద్రక్రోధశాంతయే విష్ణోః

కోపముత్పాద్య శరభూతస్య విష్ణో రేవాధిక్యం ప్రకటితవత స్తవ మహత్త్వ్రమి మహాశా దర్శితం-అలమియతా కార్యేణేతి శివం-తవ శరత్వే ఏవ రుద్రేణ త్రిపురదాహాగ్ని కృత స్తథాపి శివే ప్రభుత్వం వ్యక్తీకృతవత స్తవ స్వామిపక్షపాతస్స్పష్టః-అతోఽలం యుద్ధేనేతి విష్ణుం చ ప్రసాద్య యాచ్నాం చక్రురిత్యర్థః-నత్వీశ్వర నిరోధన మాత్రేణ విష్ణోః పరత్వం- తథాత్వే శివకర్మక యాచ్నాయాః అప్రసక్తేః- కించ తమః ప్రధానత్వేన రుద్రస్యైవ విష్ణోరప్యప రత్వాపాతాత్ - తదభావే విరోధస్యైవా సంభవ ఇతి మహ దనిష్టం।

తా॥ "తదా" శివధనుస్సును శివుని విష్ణు హుంకారముచే జడములనుగా జేసినపిమ్మట, చారణులతోను ఋషిగణములతో డను వచ్చి దేవతాశ్రేష్ఠులు యాచించిరి. తన యత్నము విఫల మగుటచే శివునకు తిరిగి యుద్ధము చేయవలసినస్థితి యేర్పడినది. తన శక్తిని ప్రకటించుటచే విష్ణువునకు నట్టిస్థితియే యేర్పడినది. కావున నిద్దరును పరాక్రమము జూపించుట కున్ముఖులనుగా జూచి, వీరిద్దరకు యుద్ధము పొసగినచో రుద్రుడు సంహారకు డగుటచే విష్ణువునకును ప్రమాదము వాటిల్లును. లేదా, సమ బలులగుటచే యుద్ధమునుండి మరలకుండుట తటస్థించెడిని. అప్పుడు జగత్తుల కకాలముందు ప్రళయము వచ్చును. ఇట్లు తలచి త్రిపురదాహకాలమునందలి రుద్రునికోపమును శాంతింప జేయుటకొరకు విష్ణునకు కోపమును బుట్టించి, బాణమైన విష్ణు నకే ఆధిక్యమును జూపిన నీ వీశ్వరుని విషయమున గొప్ప ప్రేమ చు జూపినాడవని విష్ణుని ప్రార్థించిరి. లేదా, ఇంతటి కార్యముచే

జాలునని శివుని, నీవు బాణమగుటనే రుద్రుడు త్రిపురములను దహించినాడు; అయినను శివునియందు ప్రభుత్వమును వ్యక్తము చేసిన నీకు స్వామిపక్షపాతము కలదని స్పష్టమగుచున్నది. కావున యుద్ధము మానుమని విష్ణుని ప్రార్థించిరని భావము. ఈశ్వరు నోడించినమాత్రమున విష్ణునకు పరత్వము సిద్ధింపదు. అట్లైనచో శివుని యాచింప నవసరముండదు. మఱియు శివునకువలె తమః ప్రధానత్వముచే విష్ణునకును పరత్వము సిద్ధింపదు. ఆ తమస్సు లేనిచో విరోధమే సంభవించదు. అట్లైన మిక్కిలి అనిష్టదాయకము.

శ్లో॥ జృంభితం తద్ధనుర్దృష్ట్వా శైవం విష్ణుపరాక్రమైః ।
అధికం మేనిరే విష్ణుం దేవాస్సర్షిగణాస్తదా ॥

వ్యా॥ తదా అధికం మేనిరే- తత్కాలావచ్ఛిన్నోత్కర్ష విశిష్టం- ఏవం కాలాంతరే కార్యవశాచ్ఛివోపి భవేదితి తాత్ప ర్యం- నతు శివకేశవయోః శ్రుతి విప్రతిపన్నపరత్వసందేహే విష్ణుమాత్రధర్మిక పరత్వ తాత్పర్యకమేతద్వాక్యం- బలాబలపరీ క్షయేతి బలమాత్ర ప్రశంసాయా ఏవ ప్రస్తావాత్ - నతావతా విష్ణోః పరత్వవ్యవస్థాకల్పనా న్యాయ్యా- సగుణవాదే ఆత్యంతిక సుఖరూప ముక్తిప్రదత్వరూప పరత్వస్యైవ శ్రుత్యవసేయత్వేన హరిహరయోః రన్యతభేదేన తదంశే విప్రతిపత్తేః- యుద్ధకాలిక జయాపజయయోస్తయోరన్యతరస్య తదసాధకత్వాత్ - తథా సతి కంచనకాలం దశకంఠస్యాపి స్వీయతపోవృద్ధికాలే సాక్షాద్వై కుంఠే విష్ణో రజయ్యత్వకథనేన పరత్వం వ్యత్యయమేవ కల్ప్యేత- కించ- ప్రకృతే శ్రీరామాపేక్షయా పరశురామస్య న్యూనత్వ కథనేన విష్ణ్వంశస్యైవ న్యూనత్వకథన మిత్యాపద్యేత-నచ పరశు

రామః కళావతారః- శ్రీరామస్తు పూర్ణావతారః- అత్రోనోక్త దోష ఇతి వాచ్యం- కింతావత్పూర్ణావతారత్వం- పరాభిమత విష్ణుసంబాధి యావచ్ఛక్తి విశిష్టత్వం తదితి చేత్ సచ విష్ణుస్స్వరూపతస్సన్ స్వీయ యావచ్ఛక్తి మన్యత్రావేశయతి- కింవా- స్వయం సాక్షాత్సాకల్యేన తాద్రూప్యేణ పరిణమతేవా- నాద్యః- స్వసత్త్వం స్వశక్తి సాకల్యాభావే కథం- నాన్త్యః- పరిణామిత్వే పరస్యానిత్యత్వప్రసంగ ఇత్యాది దోషాపత్తేరిత్యలం॥

ఇతి శ్రీమద్రామాయణే బాలకాండే హరితసగోత్రోద్భవేన
బొమ్మకంటి నృసింహశాస్త్రిణా విరచితాయాం
కల్పవల్లికాఖ్యాయాం వ్యాఖ్యాయాం
ద్వితీయః కిసలయః

తా॥ 'తదా' శివధనుర్భంగమైనపిదప నాకాలమందలి విష్ణుని పరాక్రమమును ఉత్కర్షను జూచి విష్ణునే గొప్పవానిగా దేవతలు తలచిరి. ఇతరకాలములందు మహత్తరకార్యములను జేయునపు డీశ్వరుడు నట్లే తలపబడునని భావము. కాని, యీ వాక్యము శ్రుతికి విరుద్ధముగ శివకేశవులకు పరత్వవిషయమున సందేహము గలిగినపుడు శివునికే పరత్వమును ప్రతిపాదించునది గాదు. 'బలాబలపరీక్షయా' అని బలమాత్రమునుగూర్చి ప్రస్తావన సందర్భమున నీవాక్యమును జెప్పుటయు పైవిషయమున కుద్బోధకము. ఇంతమాత్రముచే విష్ణునకు పరత్వవ్యవస్థను కల్పించుట న్యాయముగాదు సగుణవాదమున ఆత్యన్తిక సుఖరూపము (అఖండసుఖరూపము) అగునట్టి ముక్తి నిచ్చుటయే స్వరూపముగాగల పరత్వము శ్రుతివలన నిశ్చయింపబడినది.

ఆవిషయమున హరిహరులకు మతభేదముచే విరోధము గన్నట్లు ను. యుద్ధసమయమున జయించుటగాని ఓడుటగాని పరత్వసాధకములు గావు. జయించుటే పరత్వసాధక మైనచో కొండొక కాలమున రావణుని తపోబల మధికముగ నున్నపుడు విష్ణువుకు కిగూడ జయింప శక్యముగాకుండెనని చెప్పుటచే విపరీతముగ రావణునికిగూడ పరత్వము కల్పింపవలసివచ్చును. మఱియు ప్రస్తుతసమయమున శ్రీరామునికంటె పరశురామునకు న్యూనత్వము (కొద్దితనము) ను చెప్పుటచే విష్ణ్వంశమునకే న్యూనత్వమును చెప్పుట మున్నగునవి తటస్థించినవి.

పోనిండు. పరశురాముడు అంశావతారుడు. శ్రీరాముడు పూర్ణావతారుడు. కావున పై జెప్పిన దోషము రాదందురేమో? అప్పుడు పూర్ణావతార మననేమి? ఇతరు లిష్టపడినట్లు విష్ణుని సంబంధమగు సమస్తశక్తులతో గూడికొనుటయే యందురా! అన్నచో, ఆవిష్ణువు స్వరూపముచే నొకచోనుండి, తన సమస్త శక్తులను మఱియొకచో నుంచునా? లేక సంపూర్ణముగ నా యవతారమై పరిణమించునా? తన శక్తులను వేరొకచో నుంచు ననుట వలనుపడదు. తన సమస్తశక్తులు లేకున్నచో తానుండు టెట్లు? పరిణమించుటయు పొసగదు. పరిణమించెడివాడగుచో పరస్వరూపునికి అనిత్యము వచ్చును ఈరీతిగ నావాద మనేక దోషములతో గూడినది గాన నింతటితో విరమించెను.

ఇట్లు శ్రీ హరితసగోత్రోద్భవ బొమ్మకంటి నృసింహశాస్త్రి విరచితంబైన శ్రీమద్రామాయణ కల్పవల్లికా వ్యాఖ్యా యందు ద్వితీయ కిసలయము సంపూర్ణము.

# శ్రీ వాల్మీకి ప్రణీత రామాయణే బాలకాండే పాయసవిభాగ సందేహ పరిహారఘట్టః



వాల్మీకియే

శ్లో॥ "కౌసల్యాయై నరపతిః పాయసార్ధం దదౌ తదా।
అర్ధాదర్ధం దదౌ చాపి సుమిత్రాయై నరాధిపః॥
కైకేయ్యై చావశిష్టార్ధం దదౌ పుత్రార్థకారణాత్ ।
ప్రదదౌ చావశిష్టార్ధం పాయసస్యామృతోపమం॥
అనుచింత్య సుమిత్రాయై పునరేవ మహీపతిః ।
ఏవం తాసాం దదౌ రాజా భార్యాణాం పాయసం పృథక్"॥

అధ్యాత్మరామాయణే బాలకాండేతు.

శ్లో॥ "ఋశ్యశృంగ వసిష్ఠాభ్యా మనుజ్ఞాతో దదౌ హవిః ।
కౌసల్యాయై సకైకేయ్యై చార్ధమర్ధం ప్రయత్నతః॥
తతస్సుమిత్రా సంప్రాప్తా జిఘృక్షుః పౌత్రికీం చరుం ।
కౌసల్యాతు స్వభాగార్ధం దదౌ తస్యై ముదాన్వితా।
కైకేయీచ స్వభాగార్ధం దదౌ ప్రీతి సమన్వితా ।
ఉపభుజ్య చరుం సర్వా స్త్రియో గర్భసమన్వితాః॥
దేవతా ఇవ తా రేజుస్స్వభాసా రాజమందిరే"॥

భోజరాజకృత చంపూరామాయణేచ.

శ్లో॥ "కౌసల్యాయై ప్రథమమదిశద్భూపతిః పాయసార్ధం ।
ప్రాదాదర్ధం ప్రణయమధురం కేకయేంద్రస్య పుత్ర్యై ।

ఏతే దేవ్యౌ తరళమనసః పత్యురాలోచ్య భావం ।
స్వార్ధాంశాభ్యాంస్వయమకురుతాంపూర్ణకామాంసుమిత్రాం॥"
శ్రీకాళిదాసకృత రఘువంశే చ.
శ్లో॥ "తే బహుజ్ఞస్య చిత్తజ్ఞే పత్న్యౌ పత్యుర్మహీక్షితః ।
చరోరర్ధార్ధభాగాభ్యాం తామయోజయతాముభే"

ఏవం స్థితే వాల్మీకిగ్రంథస్థ పాయస విభాగస్య తత్కర్తృత్వస్య చ తత్ప్రాశనక్రమస్యచ తదుత్తరం శ్రీరామాదీనాం చతుర్ణాం భాగతారతమ్యం చ తత ప్తదుత్పత్తి ప్రయుక్త జైష్ఠ్యకానిష్ఠ్యస్యచ యథా శ్రుతరీత్యా విరోధః ప్రతిభాతీతి తత్పరిహారార్థం ప్రాచీనై రనేకథార్థభేదః కృతః । తత్ర పాయస విభాగస్య గ్రంథభేదేన భిన్నక్రమస్య కల్పాన్తరవిషయకత్వ కల్పనేన సమాధానం చ దర్శితం- తథాపి పూర్వోక్త కల్పాంతరవిషయకత్వకల్పనే ప్రమాణాప్రదర్శనా దసంతుష్టి ర్విదుషాం భవేత్ । స్వవాక్యంతు న తత్సాధకం । పరంతు స్వాశక్త్యుద్బోధకం । కించ । "కౌసల్యాయై" ఇత్యత్ర వాల్మీకిప్రణీతే కేనచిదిష్వాస్వరసత ఏవ ఆర్ధాదర్ధమిత్యస్య కౌసల్యా సాత్కృతాదర్ధాదర్ధ మితి। అవశిష్టార్ధమిత్యస్య షష్ఠీ తత్పురుషపక్షేణ చతుర్థాంశ మితి అవశిష్టార్ధమిత్యస్య పదస్య కర్మధారయ సమాసేన చతుర్థాంశ మితి చ వ్యాఖ్యానేన చతుర్ణాం రామాదీనా మప్యవిశేషేణ సమభాగత్వం సమర్థితం । పాయస దాతృత్వాంశే త్వవశిష్టం సమాధాన మితి వాల్మీకి శ్లోకాభిప్రాయః ప్రకాశ్యతే । అతిప్రాజ్ఞో దశరథస్సమభాగమేవ పాయసం విభజ్య కౌసల్యా

మై కైకేయ్యైచ దత్వా తదనుమతిపూర్వకం సుమిత్రాయై తాభ్యాముభాభ్యాం స్వార్ధభాగద్వయం గృహీత్వా స్వయం దదౌ। సుమిత్రాయాః కౌసల్యాద్యపేక్షయా సౌమనస్యం జ్యేష్ఠనుహిషీత్వేన కౌసల్యాయావా కైకేయీ పరిణయకాలే స్వప్రతిజ్ఞానుసారేణ తస్యాః పుత్రస్యైవా భవేద్రాజ్యమతస్సుమిత్రాయా స్తదుభయానురాగ ఆవశ్యకస్తస్మాత్ పుత్రద్వయమస్యాం జాయతాం। కౌసల్యా కైకేయ్యోస్త్వేకైకపుత్రోత్పత్తిరేవ భవతు। తతశ్చ చతుర్ధాత్మానం విభజ్య తవ పుత్రత్వం భజామీతి భగవద్వాక్యస్య సార్థక్యంచ నిశ్చిత్య చాతుర్యేణ తిసృణామపి పత్నీనాం సమమేవ పాయసం దశరథో దదావితి। ఏవంచ అధ్యాత్మరామాయణశ్లోకే "సుమిత్రాయై" ఇత్యత్ర చతుర్థ్యా ఉద్దేశ్యత్వం ప్రకల్ప్య దశరథాయేతి అధ్యాహృత్య తస్మా ఏవ చరుం దదావిత్యర్థ ఏవ ఉచితః। అన్యథా కౌసల్యా కైకేయీభ్యాం సాక్షాత్స్వయమేవ పాయసదానేన తద్విషయే స్వస్య గాఢానురాగం ప్రకటయతో దశరథస్య సుమిత్రావిషయే సపత్నీభ్యాం చరోర్దాపనే దాక్షిణ్యభంగ ఇతి మహదనిష్టం। అతఏవ ప్రథమం సమాంశదానేన కౌసల్యా కైకేయ్యా తాభ్యామేవ సప్రణయం స్వయం గృహీతస్య పాయసస్య స్వస్యార్ధకాంశదానేన సుమిత్రాంచానందయతః పత్న్యోః పత్నీసమ్మాన చాతుకీం సర్వేష్వపి రామాయణచరిత్రప్రతిపాదక గ్రంథేషు "సంమానం మేనిరే సర్వాః ప్రహర్షోదితచేతసః" ఇతి వాల్మీకినా

మితి భోజరాజీయే "బహుజ్ఞస్యోచితజ్ఞే" ఇతి కాళిదాసీయే చ ప్రాచీకటన్ । కైకేయీ దానానంతరమేవ సుమిత్రాయాః పాయసదానం ప్రత్యా సత్యా కౌసల్యా సంబంధ్యర్థాదితి పద సంబంధార్థంతు మహర్షిణా ప్రతిపాదిత మితి న తావతా వ్యుత్క్రమ ఇతరగ్రంథానా మితి పూర్వోక్త సకలవిరోధపరిహార సుధీభిరూహ్యా ఇత్యలం॥

బాలకాండ స్సమాప్తః.

తా॥ వాల్మీకిరామాయణమున

తా॥ "దశరథు డప్పుడు పాయసమున సగముభాగమును కౌసల్య కిచ్చెను. రాజు సగములో సగమును సుమిత్రకు నిచ్చెను. మిగిలిన సగముభాగమును పుత్రులకొరకై కైకేయికి నిచ్చెను. అమృతముతో తుల్యమగు పాయసమున మిగిలిన సగముభాగమును ఆలోచించి రాజు సుమిత్రకొరకు తిరిగి యిచ్చెను" అనియు, అధ్యాత్మరామాయణమందు బాలకాండమున,

"ఋష్యశృంగవసిష్ఠులవలన ననుజ్ఞనందినవాడై విష్ణువు కౌసల్యకు కైకేయికి ప్రయత్నముతో సగముసగము నిచ్చెను. పిమ్మట సుమిత్ర పుత్రేష్టి సంబంధమగు చరువును (పాయిసమును) భక్షించుటకై వచ్చెను. కౌసల్య సంతసముతోఁగూడినదై తన భాగమునుండి సగము నామె కిచ్చెను. కైకేయియు ప్రీతితో తాను తన భాగమందలి సగము నామె కిచ్చెను. ఆ చరువును ముగ్గురు భార్యలు భక్షించి గర్భవతులై తమ

కాంతులచే దేవతాస్త్రీలవలె రాజగృహమున ప్రకాశించిరి" అనియు,

భోజరాజు రచియించిన చంపూరామాయణమున,

"దశరథుడు ముందుగ పాయసములో సగముభాగము కౌసల్యకిచ్చెను. కైకేయికి ప్రణయమధురముగు సగముభాగము నిచ్చెను. ఈయిద్దరు దేవులు తత్తరపడుచున్న ప్రియునిభారమును కనిపెట్టి తమ పాయసములోని సగముభాగముచే సుమిత్రను పూర్ణమైన కోరిక గలదానినిగా జేసిరి" అనియు,

కాళిదాసు రచియించిన రఘువంశమున,

"బహుజ్ఞుడు (విస్తారముగ దెలిసినవాడు)ను ప్రభువు నగు భర్తయొక్క ఔచిత్యము నెరిగిన ఆభార్య లిద్దరు, చరువులో సగము సగము భాగములతో సుమిత్రను గూర్చిరి'' అనియు నున్నది.

ఇట్లుండ వాల్మీకిగ్రంథమునందున్న పాయసవిభాగము, ఆపాయసము నిచ్చుట, దానిని భక్షించిన క్రమము, పిమ్మట రామాదుల నలుగురకు భాగములందలి తారతమ్యము, తరువాత పుట్టుకలోని జ్యేష్ఠత్వ కనిష్ఠత్వాదికము (పెద్దతనము, చిన్నతనము) మున్నగునవి యథాశ్రుతరీతిని పరస్పర విరుద్ధముగ నున్నట్లు తోచుచున్నవి. ఈవిరోధములను పరిహరించుటకై అనేకులనేకరీతుల వ్యాఖ్యానము చేసియున్నారు.

వారిలో కొందరు పాయసవిభాగము, వేర్వేరుగ్రంథములలో వేర్వేరుగ చెప్పుటకు కారణము, ఆయాకల్పభేదములను

బట్టియే యని సమాధానము చెప్పియున్నారు. అయినను ఈ రీతిని కల్పాంతరవిషయమని చెప్పుటలో ప్రమాణమును చూపించకపోవుటచే నీసమాధానమున విద్వాంసులకు సంతుష్టి కలుగదు. తమవాక్యము ప్రమాణమును సాధించునది కాదు. ఇక తమ యసామర్థ్యమును తెలుపునది యగును.

మఱియు వాల్మీకి రచియించిన గ్రంథములో శ్లోకములందలి "కౌసల్యాయై" అనుచోట నుండెడి "అర్ధాదర్ధం" అను దానికి కౌసల్య కీయబడిన సగములో సగము అని అర్థమనియు, "అవశిష్టార్ధం" అను పదమునకు "అవశిష్టస్య అర్ధం" అని తత్పురుష సమాసమును జెప్పి నాల్గవభాగమను నర్థమనియు మఱియొక "అవసిష్టార్ధం" అనుదానికి "అవశిష్టంచ తదర్ధంచ" అను కర్మధారయసమాసముచే నాల్గవభాగమను నర్థమనియు వ్యాఖ్యానముచేసి రామాదులకు నలుగురకు భాగములు సమానములని సమర్థించిరి. పాయసము నిచ్చినవా రెవరను ప్రశ్నకు సమాధానము నిలిచియున్నది గాన వాల్మీకి శ్లోకాభిప్రాయము ప్రకటింపబడుచున్నది.

మిక్కిలి ప్రాజ్ఞుడగు దశరథుడు, పాయసమును సమభాగములుగ విభజించి, కౌసల్యకు కైకేయికి నిచ్చి, వారియనుమతితోడనే వారిభాగములనుండి సగము సగము భాగమును తీసికొని, యారెండు భాగములను స్వయముగ సుమిత్రకొరకిచ్చెను.

సుమిత్రకు కౌసల్యకంటెను, కైకేయికంటెను సౌమనస్యము, జ్యేష్ఠభార్యయగుటచే కౌసల్యకు గలిగిన పుత్రునకు గాని, వివాహసమయమున ప్రతిజ్ఞ చేయుటచే కైకేయిపుత్రునకుగాని రాజ్యము సంక్రమించును గాన, వారిద్దర యనురాగము మిక్కిలి యావశ్యకము. కావున సుమిత్ర కిద్దరు పుత్రులు కలుగుగాక. కౌసల్యకు కైకేయికి ఒక్కొక్క-పుత్రుడు కలుగుగాక. ఇట్లైనచో "నన్ను నాల్గువిధములుగ విభజించి నీకు పుత్రత్వము నొందెదను" అను భగవద్వాక్యమునకు సార్థక్యము గలుగునని నిశ్చయించి, తన నేర్పరితనమున దశరథుడు ముగ్గురు భార్యలకు పాయసమును సమముగనే యిచ్చెను.

ఈసందర్భమున అధ్యాత్మరామాయణమునందలి "సుమిత్రాయై" అనుచోట చతుర్థీవిభక్తికి ఉద్దేశ్యత్వమును కల్పించి, "దశరథాయ" అను పదమును అధ్యాహారము చేసికొని, సుమిత్ర నుద్దేశించి దశరథునికే చరువు (పాయసము) నిచ్చిరి అను అర్థమును చెప్పుటయే తగియున్నది. ఇట్లు చెప్పనిచో కౌసల్యాకైకేయులకు తాను స్వయముగనే పాయసము నిచ్చి వారివిషయమున గాఢానురాగమును చూపి, సుమిత్రకు వారిద్దరచేత చరుభాగముల నిప్పించినచో దశరథుని దాక్షిణ్యమునకు (భార్య లందరియందు సమానముగ ప్రవర్తించుట) భంగము కలుగును. కావుననే ముందుగ సమభాగముల నిచ్చుటచే కౌసల్యా కైకేయులగు వారిద్దరనుండి ప్రేమపూర్వకముగ తిరిగి భాగములను తీసికొని పాయసమును వారిద్దరకంటె తనకు

నెక్కుడుగ యిచ్చుటచే సుమిత్రను ఆనందింపజేసిన భర్తకు, భార్యలను సమముగ గౌరవించుటలో చాతుర్యము కానవచ్చు చున్నది. ఈవిషయమును రామాయణమును వర్ణించిన గ్రంథములలో "అందరును సంతసముతో నిండినవారై సమానమని తలచికొనిరి" అని వాల్మీకి రామాయణమునను, "వ్యాకుల చిత్తముగల భర్తయొక్క అభిప్రాయమును ఆలోచించి'' అని భోజ చంపునందును, "విస్తారమును తెలిసిన భర్తయొక్క ఔచిత్యము నెరిగిన భార్యలు'' అని రఘువంశమునందును వర్ణించిరి. కైకేయికి పాయసము నిచ్చినతరువాత సుమిత్రకు పాయసము నిచ్చె ననగా కౌసల్య భాగమునుండి యని పదసంబంధముతో గూడిన నర్థమును మహర్షి చెప్పినాడు గాన, అంతమాత్రముచే వ్యుత్క్రమ ముండదు గాన, పూర్వమున చెప్పబడిన సకలవిరోధములకు పరిహారము చెప్పబడినదని విద్వాంసు లూహించెదరుగాక.

ఇది బొమ్మకంటి వంశోద్భవ, నృసింహశాస్త్రి జ్యేష్ఠపుత్ర,
రామలక్ష్మీగర్భసంజాత, బుధజనవిధేయ, సుబ్ర
హ్మణ్యశాస్త్రి విరచితంబైన
ఆంధ్రతాత్పర్యమున
బాలకాండము
సమాప్తము.



# తప్పు ఒప్పుల పట్టిక.

| గ్రంథ భాగము | పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| పీఠిక | xvi | 10 | మహోద్యము | మహోద్యమము |
| శ్లోకములు | 1 | 4 | చాశంకనీయం | నాశంకనీయం |
| ,, | 5 | 2 | పాక్రు | ప్రాకు |
| ,, | ,, | 6 | స్వివాదరక్థా | స్వివాదరర్థా |
| ఉపోద్ఘాతః | 6 | 2 | శ్రీరామస్య | శ్రీరామస్య |
| ,, | 8 | 2 | ఇయత్వం | ఇయత్త్వం |
| ,, | ,, | 15 | ఏలనన | ఏలయన |
| బాలకాండః | 4 | 6 | చతుష్టయ | చతుష్టయం |
| ,, | 5 | 16 | స్వారసిక | స్వారసిక |
| ,, | 6 | 7 | దిశాయమేవ | దిశాఽయమేవ |
| ,, | ,, | 10 | స్వభావత్తయా | స్వభావవత్తయా |
| ,, | 11 | 6 | తపస్వా | తపస్స్వా |
| ,, | 20 | 6 | స్గోక | శ్లోక |
| ,, | ,, | 17 | పున | పునః |
| ,, | 21 | 4 | మంత్రత్వేద | మంత్రత్వేన |
| ,, | 27 | 5 | ఏలనన | ఏలయన |
| ,, | 36 | 16 | జ్లానోపదేశ | జ్ఞానోపదేశ |
| ,, | ,, | 20 | అను | అను |
| ,, | 38 | 16 | దార | దారా |
| ,, | 42 | 19 | (మణిమంజీర) | మణిమంజీర |
| ,, | 43 | 7 | పౌరుక్త్యము | పౌనరుక్త్యము |
| ,, | 44 | 9 | ఫలత్వే | ఫలత్వేన |

| గ్రంథ భాగము | పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| బాలకాండః | 49 | 16 | ధ్యైప్షే | ద్వైప్షే |
| ,, | 60 | 6 | శిష్టాఽర్థ్యత్వ | శిష్టాఽర్థ్యత్వ |
| ,, | 64 | 21 | అపర | అపరః |
| ,, | 68 | 11 | కారణత్వాత్ | కారణత్వాత్ |
| ,, | ,, | 19 | కాన్యయా | కామ్యయా |
| ,, | 77 | 1 | ప్రతీ | ప్రతి |
| ,, | 78 | 3 | స్ఫుటత్వాత్ | స్ఫుటత్వాత్ |
| ,, | 87 | 7 | ఉత్తత్తి | ఉత్పత్తి |
| ,, | 90 | 19 | పుత్రవాప్త్యా | పుత్రావాప్త్యా |
| ,, | 92 | 9 | తరమం | పరమం |
| ,, | ,, | 18 | విసర్జయః | విసర్జయ |
| ,, | 93 | 7 | నతు | సతు |
| ,, | 95 | 12 | ఇతపీ | ఇత్యపీ |
| ,, | 102 | 11 | దుడింనట్టి | దుండినట్టి |
| ,, | 105 | 17 | అపరిణయే | అపరిణయేన |
| ,, | 108 | 8 | విజ్ఞానో | నోవిజ్ఞా |
| ,, | 117 | 13 | చ్ఛాం | చ్ఛా |
| ,, | 121 | 6 | యాచా | యాచ్నా |
| ,, | 124 | 4 | విష్ణుమూ | విష్ణుమూర్తి |
| ,, | 128 | 17 | పాయిస | పాయస |
| ,, | 132 | 16 | విరచితతం | విరచితం |

# బొమ్మకంటి నృసింహశాస్త్రి స్మారకనిధి వివరములు.

ఈనిధిని సమకూర్చుటకు శ్రీ శాస్త్రిలవారిచే సంస్కృతభాషలో రచింపబడి దిగువ పేర్కొనబడు గ్రంథములకు పోషకులను చందాదారులను చేర్చుకొనుట, గ్రంథములను నాగరిలిపిని, తెలుగులిపిని (ఆంధ్రతాత్పర్యసహితము) ముద్రింపించి విక్రయించుటయు ముఖ్యోద్దేశములు. ఈనిధికి సంబంధించిన గ్రంథములు శ్రీ శాస్త్రిలవారి జ్యేష్ఠకుమారులగు సుబ్రహ్మణ్యశాస్త్రిగారు తండ్రిగారి స్మారకార్థము స్వగృహమునందు శాశ్వతముగ నెలకొల్పిన కల్పవల్లికా కార్యాలయమునందు లభించగలవు.

గ్రంథములు, చందాలు:—(1) కల్పవల్లికా (శ్రీమద్రామాయణవ్యాఖ్యానము). ఈగ్రంథము మూడుసంపుటములుగ ముద్రింపబడును. సంపుటములు మూడుకలసి నాగరిలిపి రు 5—0—0 తెలుగులిపి రు 3—0—0

| | | | |
|---|---|---|---|
| (2) మణిమంజరీఖండనం ,, | రు 2—0—0 | ,, | రు 1—0—0 |
| (3) తారావళి, ప్రకీర్ణశ్లోకములు | 1—0—0 | ,, | రు 1—0—0 |

పోషకులు:—రు 10—0—0 గాని యంతకుమించిగాని ఒకసారి యీయము నిచ్చువారు. వీరికి పైగ్రంథములన్నియు ముద్రణానంతర ముచితముగ పంపబడును.

ప్రత్యేకపోషకులు:—దరఖాస్తుతో ముద్రణానంతరము రు 0—8—0 చెల్లించి గ్రంథముల నన్నిటిని చందాల వెలలకు కొనువారు. (ఖర్చులు వేరు)

చందాదారులు:—ఏగ్రంథమునకైనను చందాను ముందుగ నిచ్చువారు. వీరికి ముద్రణానంతర మాయాగ్రంథము లుచితముగ పంపబడును.

ప్రత్యేకచందాదారులు:—దరఖాస్తుతో రు 0-4-0 లు చెల్లించవలెను. కల్పవల్లికను కొనువారు నాగరిలిపి రు 5—4—0 తెలుగు రు 3—6—0 మూడుసంపుటములపైనను సమముగనిచ్చి పుచ్చుకొనవలెను. శేషించిన గ్రంథములను కొనువారు చందాలవెలలకే పుచ్చుకొనవలెను. (ఖర్చులు వేరు)

గ్రంథములన్నియు చక్కని కాగితముపైన ముద్రింపబడి, శాస్త్రిలవారి ఛాయాపటము, వంశావళి, జీవితచరిత్ర మున్నగునవి కలిగియుండును.

ముద్రితగ్రంథములు కూడ ప్రత్యేకవెలలకు విక్రయింపబడును.

దరఖాస్తులు, చందాలువగైరాల నీక్రిందివిలాసమునకు పంపవలెను.

కల్పవల్లిక ఆఫీసు, రామారావుపేట, కాకినాడ.

తూర్పుగోదావరిజిల్లా.